తెలుగు కథల
సమాహారం

# కథాకేళి

ప్రారంభ సంచిక
ఏప్రిల్, 2006

వెల: రు. 8/-







# ముందుమాట

ఒకప్పుడు తెలుగు పత్రికా ప్రపంచం కథలకు
కాణాచిగా, విజ్ఞానానికి వేదికగా వర్ధిల్లింది. కాలం
పుటల్లో అవన్నీ క్రమంగా కనుమరుగైపోయాయి.
ఇప్పుడు మళ్ళీ కథమీద కుతూహలం పెరుగుతోంది.
పాతపత్రికలు కొన్ని కొన ఊపిరి కొస నుంచి పునర్జీవం
పొందగా, కొత్త పత్రికలు కళ్లు తెరుస్తున్నాయి.

కేవలం కథలకే ప్రాధాన్యత ఇచ్చే ఉద్దేశ్యంతో
ప్రారంభమవుతున్న ఈ 'కథాకేళి' పత్రిక
పాఠకుల అభిరుచికి అద్దం పట్టాలని ఆకాంక్షిస్తోంది.

పాత, కొత్త తరాల రచయితల నుంచి వైవిధ్య సంపన్నమైన
రచనలకు స్వాగతం పలుకుతున్నాం. ఈ పత్రిక మీద
మీ అభిప్రాయాలకు నిరీక్షిస్తున్నాం.

**శ్రీ వ్యయనామ**
**ఉగాది శుభాకాంక్షలు**


| కథాకేళి<br>తెలుగు కథల సమాహారం | విడి ప్రతి : రు. 8/-<br>సంవత్సర చందా: రు. 80/- |
|---|---|

మీ చందాలను ఈ క్రింది చిరునామాకి పంపించండి.

**CRESCENT PUBLICATIONS**
29-25-43A, Vemuri Vari Street, Suryarao Pet,
VIJAYAWADA - 520 002. Ph: 0866 - 5562666 / 5563666

సంపుటి : 1
సంచిక : 1
ఏప్రియల్, 2006
ఎడిటర్: యం. నాగకుమారి

# కథాకేళి

మాస పత్రిక

మాసపత్రికా...? అందులోనూ తెలుగు కథల పత్రికా? ఎవరైనా కొంటారా...? ఈ పత్రికను ప్రారంభిస్తున్నామని చెప్పినపుడు అనేకమంది నుంచి ఎదురైన ప్రశ్న ఇది. పత్రికా పఠనం పట్ల నానాటికీ ఆసక్తి తగ్గిపోతున్న ఈ రోజుల్లో ఒక 'తెలుగు కథల పత్రికను ప్రారంభించడం సాహసమే'నన్నారు దాదాపు అందరూ.

మానవుల మధ్య సంబంధ బాంధవ్యాలు నానాటికీ సన్నగిల్లిపోతు న్నాయి. పొరుగింట్లో ఎవరుంటున్నారో, ఏమి జరుగుతోందో కూడా గమ నించలేనంత బిజీ జీవితాలకు అలవాటుపడిపోతున్నాం. ఇంకా గట్టిగా చెప్పాలంటే తమ స్వంత ఇంట్లో జరిగే సంఘటనలే తెలుసుకోలేనంత బిజీ జీవితాల పెద్దలు ఎక్కువైపోతున్నారు. మనుషుల్లో వయోబేధం లేకుండా బాధ్యతారాహిత్యం నానాటికీ పెరిగిపోతోంది. సేవా దృక్పథం, సహకారభావం కొరవడుతున్నాయి.

ఒక మంచి కథ... పాఠకుడిని ఆలోచింపజేయగల కథ... తప్పకుండా మన ఈ వ్యవస్థలో ఎంతో కొంత మార్పు తీసుకొస్తుంది. సున్నితమైన భావాన్ని హృదయానికి హత్తుకొనేలా చెప్పగల శక్తి కథకు ఉంది. అటువంటి కథలను తెలుగు పాఠకులకు అందించాలని, తద్వారా సమాజానికి ఎంతో కొంత మేలు చేయాలనేది మా ప్రయత్నం. మా ఈ ప్రయత్నాన్ని తెలుగుపాఠకులు ఆహ్వానిస్తారని, ఆదరించి-ఆశీర్వదిస్తారనీ ఆశిస్తున్నాం.

## అందరికీ ఉగాది శుభాకాంక్షలు!

ముఖచిత్రం: ఉగాది సుందరి చిత్రకారుడు: ఉదయ్
కథలకు చిత్రాలు: బాలి, పాణి, ఉదయ్, ఏ.వి.యమ్

Printed, published and owned by M. Rama Rao on behalf of CRESCENT PUBLICATIONS and printed at Ratna Printing Works, 28-19-29, Janda Street, Arundel Pet, Vijayawada-520 002. A.P. and Published at 29-25-43A, Vemuri Vari Street, Suryarao Pet, Vijayawada-520 002. A.P.
Editor: M. NAGAKUMARI

ఈ సంచికలోని కథల వరుస...

# రచనలకు స్వాగతం

'కథాకేళి'లో ప్రచురణకు రచనలు పంపేవారు క్రింది విషయాలు గమనించవలసిందిగా మనవి.

★ సరదాగా చదువుకోవడానికి ఉపయోగపడుతూనే ఎంతో కొంత సమాజహితం కోరే కథలకు, హాస్యకథలకూ అధిక ప్రాధాన్యత ఇవ్వబడుతుంది.

★ కథ సైజుపై ఎలాంటి నియమాలూ లేనప్పటికీ చిన్న కథలకు ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వడం జరుగుతుంది.

★ రచనల ఒరిజినల్ వ్రాత ప్రతులు మాత్రమే పంపించాలి. జెరాక్స్ కాపీలు అనుమతించబడవు.

★ రచనలు అరఠావు లేదా ఎ4 సైజు పేపరుపై వ్రాసి, వీలైనంత వరకూ కొట్టివేతలు, దిద్దివేతలూ లేకుండా ఉండాలి.

★ నచ్చిన కథకు అవసరమైన మార్పులు చేసుకునే హక్కు మాకు ఉంటుంది

★ ప్రచురించిన ప్రతి కథకూ పారితోషికం ఇవ్వడమే గాక ఆ నెల నుంచి సంవత్సరం పాటు పత్రికను ఉచితంగా పంపిస్తాం.

★ కార్టూన్లు, జోక్స్ నిరభ్యంతరంగా పంపవచ్చు (కార్టూన్స్ 11x7 సైజుకి వచ్చేలా ఉండాలి.)

★ పుస్తక సమీక్షల నిమిత్తం కొత్తగా విడుదలైన పుస్తకాలు మాత్రమే (రెండు కాపీలు) పంపాలి.

★ సాహిత్య కార్యక్రమాల వార్తలు, ఫొటోలు కూడా పంపవచ్చు.

– ఎడిటర్

## పాఠకులకు మనవి

ఏదైనా ఒక కథ చదివినపుడు ఆహా... చాలా బావుంది అన్పించొచ్చు... పర్వాలేదులే అన్పించొచ్చు... లేదా ఉత్త చెత్త అన్పించొచ్చు. ఈ సంచికలో 13 కథలు మీ ముందుంచాం. 'అన్నీ బావున్నాయ్... చాలా బావున్నాయ్' అన్పించుకోవాలనేది మా తాపత్రయం. ఇదే తొలి సంచిక కనుక మా ప్రయత్నం ఎంతవరకూ ఫలించిందనేది మీరే చెప్పాలి.

మీ ప్రతిస్పందన కోసం ఎదురుచూస్తూ...

'కథాకేళి' – క్రిసెంట్ పబ్లికేషన్స్, వేమూరి వారి వీధి, సూర్యారావుపేట, విజయవాడ –2



# గొడుగు

ఈ వాన పూర్తిగా ఆగదు, జోరుగా సాగదు. తన జీవితం లాగానే వుంది సుమిత్రకి. ఆ బస్‌స్టాప్‌లో ఎవరైతే కనబడకూడదు అనుకుందో అతనే కనిపించాడు. ఈ దేశంలో నేనొక్కడినే పురుషోత్తముడను అన్నట్లు రెండు చేతులూ వెనుక పెట్టుకుని 'నాకు ఎదురు లేదు' అన్నట్లు నిలబడతాడు. అయినా తనకెందుకు? నీ దారి నీది, నా దారి నాది అని ఆరు నెలల క్రితం చెప్పేసి వెళ్లిపోయింది తను. ఆ బస్‌స్టాప్, ఆ వాన, ఆ మనిషి, ఆ పరిచయం... అసలు అవన్నీ జరగకుండా ఉండవలసింది. జరగకూడనిది జరిగేటప్పుడే అసలు ఈ వాన కురుస్తుందని తన నమ్మకం. వాన అంటేనే తనకి ఒక అడ్డం. ఏదీ సాఫీగా సాగదు. సమయం అంతా వృథా. కానీ వానలు కురవాలి. వాన లేకుండా జీవితం లేదు. పెళ్లి కూడా అంతే! స్వాతంత్ర్యం కోల్పోవాలి. జైల్లోకి వెళ్లాలి. అయినా చేస్కోవాలి... వాట్ నాన్‌సెన్స్. చూడు ఎలా కురుస్తోందో... ఆ రోడ్డు మీద టప్పు టప్పున కురుస్తూ ఆ మోత ఒకటి! భార్యాభర్తలు పోట్లాడుకుంటున్నట్లు! ఒక చినుకు ఇక్కడ, మరొకటి అక్కడ... దంచుకుంటూనే వుంది...

ఆరు నెలల క్రితం ఈ బస్‌స్టాప్‌లోనే నిలబడింది. ఆఫీస్‌లో చెప్పేసి ఇంటికి బయలుదేరింది. బస్సువాడు అక్కడ దింపేసి ఇంక నీ ఖర్మ అంటూ వెళ్లిపోయాడు. నాలుగు అడుగులు వేస్తే ఇల్లు. సుమిత్రకి ఇది మామూలే! సినిమా హాల్లో టికెట్ కోసం లైన్లో నిలబడి కౌంటర్ దాకా వెళ్లేసరికి టికెట్లు అయిపోతాయి. తనకి కావలసిన ప్రోగ్రామ్ టి.వీ.లో చూడాలని అనుకుంటూ అన్నీ సర్దుకోగానే కరెంట్ పోతుంది. ఇంట్లో వుంటే కేబుల్ వాడి దగ్గర పోతుంది. చాలా ముఖ్యమైన పని ఇంట్లో వుంటే అదే రోజు ఆఫీసులో ఇన్‌స్పెక్షన్ వుంటుంది. ఈ పురుషపుంగవుడు తనని చూస్తూ నిలబడ్డాడు. చేతిలో గొడుగు పట్టుకున్నాడు. ఆఫీసు నుంచి ఎలాగో అలాగ తప్పించుకుని ఇక్కడ దిగింది. నాలుగు అడుగులు వేస్తే తన ఇల్లే. కానీ ఇదిగో... విధి లీలల్లో అద్భుతమైన డిసైన్ –

ప్రతిసారీ ఇలా జరగాల్సిందే. బస్సులో ఉన్నంతసేపూ వాన లేదు. ఇలా దిగింది – ఈ అంతు లేని వాన. ఆగుతుందేమోనని ఆశగా చూసింది. లేదు. ఆ గొడుగు మనిషి ఆశగా చూస్తున్నాడు. గొడుగు చేతిలో వున్నప్పుడు అలా వెళ్లిపోవచ్చు కదా? ఏమో, బస్సు కోసం కావచ్చు.

'బాగా వానగా వుందండీ' అన్నాడు.

తను చేతులు కట్టుకుంది. సమాధానం చెప్పలేదు. ఈ మగాళ్లందరూ ఇంతే.

'ఇది శారదానగర్ బస్‌స్టాపే కదండీ?'

'అవును'.

అతను ఆ గొడుగు పట్టుకుని దగ్గరగా వచ్చాడు. జేబులోంచి ఓ కాగితం తీశాడు.

'మీరు ఈ కాలనీలోనే వుంటున్నారా?' అడిగాడు.

'అవునండీ'

'కాస్త ఈ అడ్రస్ చెబుతారా?'

అడ్రస్ జాగ్రత్తగా చదివింది.

'నేనూ అదే ప్రాంతానికి వెళ్లాలండీ. కాకపోతే వాన'.

అతను తన గొడుగును వజ్రాయుధం ఇవతలకి తీసినట్లు తీశాడు.

'నా దగ్గర గొడుగుంది. ఫరవాలేదు. రండి'

సుమిత్ర ఆలోచించింది. బాగుండదేమో. ఎవరైనా చూస్తే... అసలే పెళ్లి కాని పిల్ల.

'వాన ఆగిపోవచ్చుండీ'

**వేదాంతం శ్రీపతిశర్మ**

అతను వదలలేదు.

'ఇది ఆగే వాన కాదు. రండి... పోనీ ఎంత దూరం వుంటుంది?'

'పది నిమిషాల నడక. అంతే'

అతను రోడ్డు మీదకి వెళ్లి గొడుగు విప్పేశాడు. ఏమీ చెయ్యలేక అందులోకి దూరింది. గొడుగు జాగ్రత్తగా పట్టుకున్నాడు. ఎవరి నడక వారిదైనా గొడుగు సృష్టించిన నియమం వలన ఒకరి నడకను ఒకరు పరిశీలించుకుంటూ జాగ్రత్త పడుతూ కాలనీలోకి వచ్చేశారు.

'మీరు వెళ్లవలసిన ఇల్లు ఇదే'.

అతను అటూ ఇటూ చూసి గొడుగు అలానే పట్టుకున్నాడు.

'మిమ్మల్ని మీ ఇంటిలో దింపి నేను మరలా ఇక్కడికి వస్తాను. వాన తగ్గలేదు మరి'.

తను గొడుగు లోంచి ఇవతలకి వచ్చి గేటు తెరిచి నాలుగు అడుగులు గబగబా వేసి, వెనక్కి తిరగకుండానే చెప్పింది. 'ఇది మా ఇల్లే. ఇలా లోపలికి వెళ్లండి' అని ముందు ద్వారం చూపించి, ఎందుకో సిగ్గుతో పెరట్లోకి వెళ్లిపోయింది.

ఏం పెళ్లికొడుకో ఏమో! ఇలా ఒంటరిగా వానలో గొడుగుతో వచ్చాడు. తనకి జరిగే పెళ్లిచూపులకి ఇలా తనే పెళ్లికొడుకుని వెంట పెట్టుకురావాల్సి వస్తుందని ఎన్నడూ అనుకోలేదు. కాఫీ గ్లాసులు ప్లేట్లో పెట్టుకుని ముందు గదిలోకి వచ్చింది. నాన్నగారు గొంతు సర్దుకున్నారు. 'అయ్యా సుబ్బారావుగారూ, ఇదిగో మా అమ్మాయి సుమిత్ర. చూడమ్మా, వారే సుబ్బారావుగారు', అని మరలా దగ్గారు. ఇన్నాళ్లూ తప్పించుకుని తిరుగుతున్న వ్యక్తి చేతికి చిక్కినట్లు ఆయన్ని అలా చూపిస్తూనే వున్నారు. సుబ్బారావు తన గొడుగుని మూలగా పెట్టి, కాలు మీద కాలు వేసుకుని కూర్చున్నాడు. ఎందుకో ఒక వెర్రి నవ్వు నవ్వి, కాఫీ కప్పు అక్కడ పెట్టింది. బస్‌స్టాప్‌లో కలుసుకున్న సంగతి మాట్లాడతాడేమో అనుకుంది. అలాంటిదేమీ మాట్లాడలేదు. గొడుగ తో పొడుస్తున్నట్లే తనని చూస్తున్నాడు. దీర్ఘంగా ఆలోచిస్తున్నట్లున్నాడు.

'గొడుగు అనే వస్తువు మీద మీ అభిప్రాయం చెబుతారా?' అడిగాడు. అందరూ ఒకళ్ల మొహాలొకళ్లు చూసుకున్నారు. ఇతని ఉద్యోగం, సంప్రదాయం, సర్వం మంచివే. సింపుల్‌గా వున్నాడు. ఈ ప్రశ్నే వింతగా వుంది.

'గొడుగు గురించి ఏం చెబుతామండీ?'

అందరూ నవ్వారు. అతను నవ్వలేదు, తొణక లేదు.

'అలా కాదు...' అన్నాడు. '... రెయిన్‌కోట్ల కాలంలో కూడా గొడుగు అవసరమా? ఇది నిత్యం దగ్గర పెట్టుకుంటే చూసేందుకు చిరాకుగా లేదా? ఇటువంటి ఆలోచనలు కలుగవా?'

ఆలోచించింది. తనలో ఏదో వెతుకుతున్నాడు. అర్థమయింది.

'గొడుగు అవసరం లేదనుకోవడం పొరపాటు...', చెప్పింది '... ఎంతో మంది గొడుగు వాడుతున్నారు'.

'నేను అడిగానని చెబుతున్నారా? లేక నిజం చెబుతున్నారా?'

నాన్నగారు ఎందుకో లోపలికెళ్లి వచ్చారు. ఒక పాత గొడుగు పట్టుకొచ్చారు.

'అయ్యా, దీనిని ఇప్పటికీ వాడతాము', అన్నారు.

అతను లేచి నిలబడ్డాడు. అందరూ నవ్వారు. అతను తన గొడుగు తీసుకుని చేతులు కలిపాడు. చెరో గొడుగు వేసుకుని ఇద్దరూ బస్‌స్టాప్ వరకూ వెళ్లిపోయారు. రెండు గొడుగులూ ఏం మాట్లాడుకున్నాయో ఏమో... తన పెళ్లి మటుకు అతనితో అయిపోయింది...

తొలిరాత్రి ఇద్దరి చేతా ఎంతో మందికి తాంబూలాలు ఇప్పించారు. నీరసం వచ్చింది. దేశంలో ఇందరు వృద్ధులు అసలు ఎందుకున్నారా అని ఆశ్చర్యం వేసింది! అందరూ వెళ్లిపోయాక అతనూ ఎందుకో వెళ్లిపోయాడు. ఏమీ తోచక కిటికీ దగ్గర నిలబడింది. 'దృశ్యం చాలా బాగుంది' వెనుక నుండి వినపడింది. అటు తిరిగింది. పట్టు వస్త్రాలలో కొత్త పెళ్లికొడుకు చేతిలో గొడుగు పట్టుకుని వున్నాడు. దానిని తీసుకొచ్చి మూలగా నిలబెట్టాడు.

'ఏ దృశ్యం?' అడిగింది.

'కిటికీ లోంచి కనిపిస్తున్న దృశ్యం. చక్కని చంద్రుడి మీద చిక్కని మేఘం ఎంచక్కా ఒక గొడుగు పట్టుకున్నట్లు వుంది!'

తనకి ఆ కిటికీలోంచి దూకెయ్యాలనిపించింది.

'ఈ రాత్రి కూడా మనకి ఈ గొడుగు గురించి ఎందుకండీ?'

'పొరపాటు! గొడుగు సామాన్యమైనది కాదు. దానిని తొలుత వామనమూర్తి తీసుకుని వచ్చాడు. గుళ్లలో కూడా అడపాదడపా పెరుమాళ్లు వారికి ఒక గొడుగు పట్టుకుని నాలుగు వీధులూ తిప్పుతారు...'

'ప్లీజ్!' అని పక్కకు జరిగింది సుమిత్ర. తనను లాగినట్లయి ఒక్కసారి సిగ్గుతో రెండు చేతులలో ముఖం దాచుకుంది. ఈ గొడుగు వీరుడు ఇంత సరసుడా? అనుకుంది. మెల్లగా వెనక్కి చూసింది. తన కొంగు లాగింది అతను కాదు. గాలికి ఆ కొంగు గొడుగు కొమ్ముకు తగిలి ఇరుక్కుంది. అతను నడుము మీద చెయ్యి పెట్టి విజయగర్వంతో పొంగిపో తున్నాడు! తలచుకుంటే ఇప్పటికీ రోషం ఆగదు.

చిన్నప్పటి నుంచీ ఈ మనిషి పుట్టగొడుగులు తినేశాడో లేక విప్పిన గొడుగునే ఉయ్యాలలా వేసుకుని ఊగేశాడో తెలియదు కానీ తను కేవలం ఒక గొడుగుకు భార్యగా వచ్చిందనుకుంది. ఎక్కువ మాట్లాడితే ఆ గొడుగే లేకపోతే అసలు కలిసే వాళ్లమే కాదు అనేవాడు. రోజులు గడిచాయి. కాకరొత్తు మీద నిప్పులాగా కాలం అలా కాలుతూనే కరుగుతూ తరుగుతూ అలా చెరిగిపోయింది. తన మనసూ విరిగిపోయింది. ఆఫీసుకు బస్సుల్లో ప్రయాణం చేయలేక, అత్త మామలతో 'కలసిపోలేక' ఒక రోజు గొడుగు సుబ్బారావు గారికి మనవి చేసుకుంది.

'ఏమండీ'

'యస్?'

'మనం వేరే వుందామండీ!'

'ఎందుకు?'

'ఆలోచించండి. నేను చెబితే బాగుండదు.'

అతను లేచి నిలబడ్డాడు. 'సుమిత్రా, పెద్దవారి అండదండలు గొడుగులా మనల్ని కాపాడుతూ వుంటాయి. పాతవన్నీ అపాత మధురాలు. వాటిని తృణీకరించకూడదు. ఈ గొడుగే లేకపోతే...' మూలన వున్న గొడుగు తీసి పట్టుకున్నాడు. తనకి కోపం తారాస్థాయిని దాటింది. గబగబా అతని చేతిలోంచి ఆ నల్లని గొడుగును లాక్కుని హాల్లోకి నడిచింది. అతనూ వెంట వచ్చాడు. మామగారు హోమియోపతీ పుస్తకం చదువుతున్నారు. ఇద్దరి గొడవా చూసి 'ఇద్దరూ కాలీఫాస్ వాడాలి!' అన్నారు. తను మారు మాట్లాడలేదు. 'మిస్టర్ సుబ్బారావ్!...' గర్జించింది, '... ఈ గొడుగో నేనో తేల్చుకోండి' అని అరిచి దానిని వాకిట్లోకి విసిరి కొట్టింది. పెద్దాయన పుస్తకం మూసేసి నిలబడ్డాడు. సుబ్బారావు బరువుగా వాకిట్లోకి వెళ్లాడు. ఇంత బ్రతుకూ బతికి ఇంటి ముందు చచ్చినట్లు ఆ గొడుగు అక్కడ ఛిన్నాభిన్నమై పడి వుంది. అతను దానిని నిదానంగా పైకి తీశాడు.

సినిమా హీరోలా తనవైపు చూశాడు. మెల్లగానే అన్నాడు...

'కాల ప్రవాహానికి కొట్టుకుపోయే వారిని కాలం ఏ రోజూ అపదు. అనంత జీవనవాహిని లోకి కాలువలా కొట్టుకుని వచ్చావు. గొడుగు లోంచి నేను చెబుతున్నవి మామూలు మాటలు కావు...'

అతను మాట్లాడుతూండగానే తను పెట్టె సర్దుకుని వచ్చేసింది. అతను గొడుగుతోనే గేటు తెరిచాడు... సుమిత్ర రోడ్డు మీదకి వచ్చేసింది!

ఆరు నెలలు గడిచాయి. గొడుగు దగ్గర నుంచి ఏ సమాచారం లేదు. తనూ పట్టించుకోలేదు. అప్పుడప్పుడూ తన వెర్రితనం మీద బాధ కలిగేది. ఆ గొడుగు ఏం చేసింది? ఆలోచించినప్పుడల్లా ఎందుకో గింజుకునేది! ఇంత కాలానికి మరలా ఈ బస్‌స్టాప్‌లో మరలా ఇదే వానలో నిలబడింది. ఆ మనిషి అలానే అదే స్థానంలో నిలబడ్డాడు. కదలడు, వదలడు. అసలు ఎందుకు వచ్చాడు మళ్లీ? ఇంటికి వచ్చి గొడవ చేస్తాడా? అసలు తను ఎందుకు చూడాలి అతని వైపు? సన్నగా చూసీ చూడనట్లు చూసింది. అరె! అతను ఆ గొడుగును అక్కడే మరిచిపోయి వెళ్లిపోతున్నట్లున్నాడు. బస్‌స్టాప్ బెంచ్‌కి అన్చి వుంచాడు. వాన పడుతోందో లేదోనని చెయ్యి చాచి చూసుకుంటున్నాడు. ఎవరో ఒక జంట గబగబా లోపలికి వచ్చారు. చేతిలో గొడుగు తీసి మూసేశారు. వాళ్ల కుర్రాడొకడు రెయిన్ కోట్లో వున్నాడు. వాడు కిందకి దిగి నీళ్లల్లో చిందులు వేస్తున్నాడు.

'ఏమండీ...', ఆమె అంటోంది, '... మనం కూడా రెయిన్ కోట్లు కొనుక్కుందాం?'

'ఎందుకు? అక్కర్లేదు...', అతను అంటున్నాడు. '...మన ముందు స్వేచ్ఛగా వాడు ఆడుకోవాలి. మనకి గొడుగు చాలు. ఏమంటావు?'

వాన ఆగిపోయింది. రాత్రంతా వాదనలో గడిచి, తెల్లవార్లూ పోట్లాడుకున్న ఓ జంటకు తెల్లవారినట్లుంది. ఇటు చూసింది. సుబ్బారావు వెళ్లిపోతున్నాడు. అరె! గొడుగు మరిచి పోయాడు. గబగబా గొడుగు తీసుకుని అతని వెంట వెళ్లింది. గొడుగు తిరిగి ఇవ్వడంలో తప్పు లేదు...

'మీ గొడుగు!'

అతను ఆగాడు. తనని చిత్రంగా చూసి గొడుగు తీసుకుని విప్పాడు.

'నాకు తెలుసు సుమిత్రా...' అన్నాడు. '...లోపలికి రా. నీవు ఇక్కడ ఉంటావని తెలిసి నీ కోసం ఈ గొడుగు నీ ముందరే వదిలేశాను. నువ్వు తప్పకుండా దానిని తిరిగి అప్పచెప్పి దానిని వదలనీయవని నాకు తెలుసు! రా... లోపలికి రా!' తను ఏదీ ఆలోచించలేక పోయింది. లోపలికి వెళ్లిపోయింది! నాలుగు అడుగులు వేశారు. ఇబ్బందిగానే వుంది. వాన లేకపోయినా వీళ్లు ఎవరా గొడుగులో వెళుతున్నారని జనం విచిత్రంగా చూశారు.

'గొడుగు చిత్రమైనది...', సుబ్బారావు చెబుతున్నాడు. '... నీలా నువ్వు నడవలేవు! నాలాగా నేనూ నడవలేను. నువ్వు తడవకూ డదు. నేను తడబడకూడదు! గొడుగు లేకపోతే అంతా స్వాతంత్ర్యమే! ఇద్దరికీ అంతా దూరమే! ఇది వుంటేనే ఇంత దగ్గర... ఇది తరతరాలది! అంతరాల మాటున మరో తరానికి తరలి వెళ్లాలి...'

దూరంగా నాన్నగారు ఒక గొడుగులో ఏదో కొనుక్కుని వెళ్లిపోతున్నారు... సుమిత్ర గొడుగు చేతిలోకి తీసుకుంది. 'మన ఇంటికి వెళదాం పదండి!' నవ్వుతూ అనేసింది.

వాన పూర్తిగా వెలిసింది! ●

వనమాలి బస్సు దిగాడు.

ఎదురుగా తాతయ్య...

వేయికళ్లతో తనరాక కోసమే నిరీక్షిస్తూ కనిపించాడు.

తాతయ్య సూట్‌కేసు కోసం చేయి చాచాడు.

వనమాలి ఒప్పుకోలేదు.

ఇద్దరూ టాపులేని రిక్షా ఎక్కారు.

“బాగున్నారా తాతయ్యా... నాన్నమ్మెలా ఉంది...” వనమాలి



యోగక్షేమాలడిగాడు.

"బాగానే ఉన్నాం బాబూ..." అంటూ తాతయ్య ఏవో కబుర్లలోకి దింపబోయాడు.

"తాతయ్యా... కాసేపు ఏమీ మాట్లాడించకు... చెట్టూ చేమా చూసుకొంటూ మౌనంగా పోదాం... సాయంత్రం నీ దగ్గరే కూర్చుంటాగా... అప్పుడన్నీ చెపుదువుగాని?..."

"ఇంకా చెట్టూ చేమా ఎక్కడివిరా... పన్నెండేళ్ల క్రితం పల్లెటూరనుకొంటున్నావా... ఆ పల్లెతల్లి ఎప్పుడో..." అంటూ తాతయ్య ఏదో చెప్పబోయాడు.

వనమాలి "కాసేపు ఆగు తాతయ్యా..." అంటూ గడ్డం పట్టుకొన్నాడు.

కొంతదూరం సాగేసరికి వనమాలికి అన్నీ అనుభవంలోకి రాసాగాయి.

అసలు - ఆ వాతావరణమే మారిపోయింది.

సహనంతో రాళ్లదెబ్బలు తింటూ మధురంగా నవ్వే ఆ మామిడి చెట్టు కోసం అటూ యిటూ చూశాడు.

అది హుష్‌కాకి అయిపోయింది...

పండిన వరిచేల మధ్య ఎర్రటి తామర పూలతో కనిపించే ముత్తయిదువలాంటి ఆ చెరువు కూడా అదృశ్యమైపోయింది.

రోడ్డుకి అటూ యిటూ చూశాడు.

పక్షులు కొరికి పడేసిన బాదంకాయలు కనిపించటం లేదు...

కోతి కొమ్మచ్చిలాడటానికి వంపు తిరిగిన అలనాటి చెట్టు కొమ్మలు సైతం చూపులకు అందటం లేదు.

వర్షం వస్తే తలదాచుకోటానికి ఆ పాడుపడ్డ సత్రం కూడా కనుమరుగైపోయింది.

చీదరించుకొనే మట్టిరోడ్డు స్థానంలో సిమెంట్‌రోడ్డు కొత్త రూపందాల్చి బద్ధకంగా ఒళ్లు విరుచుకొంటోంది...

వనమాలిలో ఆవేదన - ఆనందం - ఒకదాని వెంబడి ఒకటి ఆవహించాయి.

గతకాలం దృశ్యాలపై ఒక ఇనుప తెర పడిపోయింది. ఆ అనుభవాల్ని తలచుకొంటూ నిట్టూర్చాడు...

నేటి కాలం అభివృద్ధి దిశగా పరుగులు తీస్తోంది. మంచి పరిణామం... ఈ అనుభూతుల్ని ఆస్వాదిస్తూ అభ్యుదయవాదిగా ఆనందించాడు.

"కాలం నాణెం లాంటిది... దానికి రెండు పార్శ్వాలు..." ఎప్పుడో తను వ్రాసిన కథలోని ఒక వాక్యం గుర్తుకొచ్చింది.

"ఊళ్లోకి వచ్చేశాం..." తాతయ్య మనవడి భుజంపై చేయివేస్తూ అన్నాడు.

అప్పుడు గాని వనమాలి వర్తమానంలోకి రాలేదు.

"ఏ బాబూ... రాఘవయ్యగారి విగ్రహం దగ్గర ఒక నిమిషం ఆపుచెయ్..." వనమాలి అన్నాడు.

రిక్షా అక్కడ ఆగింది.

తాతయ్యకు ఇదేమీ అర్థంకాలేదు.

"తాతయ్యా... ఒక్క నిమిషం..." అంటూ బేగ్‌లోంచి ఓ దండ తీశాడు.

"ఎందుకురా..." తాతయ్య అసహనంతో మూలిగాడు.

తాతయ్య చూస్తూండగానే వనమాలి ఆ విగ్రహానికి దండ వేసి వచ్చి రిక్షాలో కూర్చున్నాడు.

తాతయ్య వనమాలి చేసిన పనిని సమర్థించలేకపోయాడు.

మనవడికేసి అదోలా చూసి తలదించు కొన్నాడు.

"వాడికి దండేవిట్రా... మన ప్రత్యర్థి..." తాతయ్య మండిపడ్డాడు.

వనమాలి ఏమీ మాట్లాడలేదు...

ఆ ఊరు గురించి, ప్రజల గురించీ విన్నాడు. తాత, తండ్రీ కలిసి రాఘవయ్యగారి మంచి పనులకు ఎలా అడ్డు పుల్లలు వేసిందీ - అన్నీ మిత్రుడు సంపత్ ద్వారా ఎప్పుడో తెలుసు కొన్నాడు వనమాలి.

రిక్షా వెళ్లి ఒక ఇంటి ముందాగింది.

అదే తాతయ్య ఇల్లు.

ఆ సాయంకాలం -

తాతయ్య తోడులేకుండానే వనమాలి ఒక్కడే ఊళ్లోకి బయల్దేరాడు. దారిలో గుర్తులో ఉన్న పెద్దవాళ్లందర్నీ వనమాలి చేతులు జోడిస్తూ పలకరించాడు.

"గంజాయి వనంలో తులసిమొక్క..." వనమాలి తీరుతెన్నుల్ని గమనించిన వాళ్లు అను కొన్నారు.

"ఎంతగా మారిపోయిందో ఊరు..." అడుగడుగునా వనమాలికి ఆశ్చర్యమే ఎదురయింది.

ఊళ్లో మచ్చుకైనా ఎక్కడా పూరిగుడిసె కనిపించటం లేదు.

డాబాలూ, భవనాలు కొలువుతీరి "కో" అని పిలుస్తున్నాయి.

పన్నెండేళ్లలో ఇంత మార్పా...

వనమాలి నమ్మలేకపోయాడు...

అక్కడక్కడా షాపులు...

పద్ధతిగా రూపొందించిన రోడ్లు...

మంచినీటి కుళాయిలు...

డ్రయినేజ్ సౌకర్యం...

ఓహ్! ఒకటేమిటి?... వనమాలికి ప్రతీదీ వింతగానే తోచింది. పుట్టి పెరిగిన ఊళ్లో - ఇంత అభివృద్ధి కనిపించేసరికి వనమాలి ఎంత గానో ఉప్పొంగిపోయాడు.

కొంతదూరం వెళ్లాక - వనమాలి ఓ గుడి ముందాగాడు.

గ్రామీణుల సహకారంతో ఆ గుడిని ఎలా తీర్చిదిద్దారో అక్కడున్న ఒక యువకుడు వివరిస్తూంటే వనమాలి విస్తుపోయాడు.

ఒకప్పుడు తనకు బాగా తెలిసిన దేవాలయమే అది. అయితే మారిపోయిన రూపురేఖల మధ్య వనమాలి దాన్ని గుర్తించలేకపోయాడు.

వేణుగోపాలస్వామి గుడిలో అర్చన చేయించి నాలుగడుగులు ముందుకేశాడు. మునసబు గారింటి ముందు వెలసిన కళ్యాణమంటపం వనమాలిని బాగా ఆకర్షించింది. వివాహాలు మొదలుకొని విద్వత్సభల వరకూ అదే వేదిక కావడం వనమాలిని అమితంగా ఆకట్టుకొంది.

మరికొంత దూరం సాగాడు.

గ్రంథాలయం పలుకరించింది. లోపలికెళ్లి చదువరుల జాబితాలో సగర్వంగా తెలుగులో సంతకంచేసి అక్కడున్న పుస్తకాల్ని చూసి బయటకొచ్చాడు. దానికి పదిగజాల దూరంలో పాలకేంద్రం కనిపించింది.

అది దాటి మలుపు తిరిగితే - పశుగణాభివృద్ధి నిలయం...

ఆ వెనుక వీధిలో హైస్కూల్...

ఆ ప్రక్కనే కో-ఆపరేటివ్ సొసైటీ...

పురాణం పంతులుగారి రావిచెట్టుదాటి కొంచెం ముందుకు నడిస్తే హాస్పటల్...

ఎదురుగా పోస్టాఫీస్... అక్కడే బ్యాంక్...

ఊరికి మధ్యలో బస్టాప్... ఊళ్లోకి బైపాస్

సర్వీసులు మాత్రమే రావు.

అందుకే తాతయ్యకు ముందుగానే కబురు పెట్టి ఊరవతల రోడ్డు మీద బైపాస్ ఎక్స్‌ప్రెస్ లో దిగాడు వనమాలి.

ఒక్కొక్కటీ పరిశీలిస్తూ పార్కులోకి అడుగు పెట్టాడు వనమాలి.

అదొక నందనవనంలా అగుపించింది. చాలాసేపు అక్కడే గడిపి ఇంటి ముఖం పట్టాడు వనమాలి.

ఆ ఊరి ప్రగతి గురించి, రాఘవయ్యగారు పడ్డ శ్రమ గురించీ వాళ్లూ వీళ్లూ చెపుతూంటే వనమాలి అక్షరం పొల్లుపోకుండా ఆసక్తిగా ఆ విషయాలన్నిటినీ ఆలకించాడు.

ఆ ఊళ్లో మూడు వందల ఇళ్లున్నాయి.

జనాభా రెండు వేలు...

అందులో సగానికి సగం వనమాలి కుటుంబం మాదిరి దండిగా డబ్బున్నవాళ్లే... వాళ్లందరూ కలిసి ఎవరి పరిధిలో వాళ్లు కొంత సొమ్ము పెట్టుబడి పెట్టడంతో ఆ ఊరి కథే మారిపోయింది. ఆ పెట్టుబడి ఆధారంగా వివిధ వాణిజ్య కేంద్రాలు నెలకొల్పబడ్డాయి. ఆ ఊళ్లో ప్రజలందరూ ఆ షాపుల్లోనే కొనాలన్నది ఆ గ్రామ శాసనం. నాణ్యత, ధరల విషయంలో ఏ విమర్శకీ తావులేదక్కడ. పట్టణాలతో సమానంగా ప్రతి కొత్త ఉత్పత్తినీ ఆ షాపులు దిగుమతి చేసుకొంటున్నాయి. దొరకని వస్తువంటూ లేదు. లాభాల్ని పెట్టుబడుల నిష్పత్తిలో పంచుకొంటూ - అందులో కొంత శాతాన్ని గ్రామాభివృద్ధినిధిగా కూడబెడుతున్నారు. ఈ వ్యవహారాలన్నీ చూడడానికి ఊరిమధ్యలో ఒక కార్యాలయం ఉంది. పెట్టుబడి పెట్టే తాహతు లేని అట్టడుగు వర్గంలో కొంతమందికి ఆ షాపుల్లో పనికల్పించబడింది. స్త్రీలు కుట్టుపని, లేసు అల్లటం వంటి పనులలో తర్ఫీదు పొందారు.

అయితే ఇంతటి అభ్యుదయ చరిత్ర వెనుక రాఘవయ్య అనే ఒక మహనీయుడు దాగి ఉన్నాడన్న సత్యాన్ని తెలుసుకొన్న వనమాలి ఆయనకు అంజలి ఘటించకుండా ఉండలేక పోయాడు. తన ఆస్తిలో ఎక్కువ భాగాన్ని గ్రామాభివృద్ధి కోసం ఉదారంగా ధారపోసిన త్యాగశీలి ఆయన. కష్టాల్ని సైతం లెక్కపెట్ట కుండా గ్రామంకోసం ఖర్చుపెట్టిన ఒక మహా మనీషి ఆయన. ఈ అభివృద్ధికి సంబంధించిన ప్రతి ప్రణాళికా రచనలోనూ ఆయనదే శ్రీకారం. ప్రభుత్వం నుంచి మేచింగ్ గ్రాంట్స్ సంపాదించడంలో ఆయన అడుగడుగునా కృతకృత్యు లయ్యారు. తన ప్రయాణమార్గంలో కొన్ని అడ్డుపుల్లలు వెక్కిరించినా ఆయన నవ్వుకొంటూనే ముందుకు సాగిపోయారు. తన తాత గారూ, తండ్రీ ఒక వర్గాన్ని కూడకట్టుకొని తిరుగుబాటు ఎగరేసినా ఆ నీడలోంచే ఆయన పురోగమించాడు. ఒక్క మాటలో చెప్పాలంటే ఈ గ్రామ చైతన్యానికి ఊపిరిపోసింది రాఘ వయ్యగారే!

అడుగులో అడుగు వేసుకొంటూ ఆ గ్రామ చరిత్రనంతటినీ ఆనోటా ఈనోటా విన్న వనమాలికి కాళోజీ వ్రాసిన మినీకవిత గుర్తు కొచ్చింది.

"పుటుక నీది
చావు నీది
బతుకంతా దేశానిది..."

జయప్రకాశ్ నారాయణ్ పరమపదించినప్పుడు కాళోజీ చెప్పిన మినీకవిత ఇది.

రెండు చేతులూ జోడించి మనసులోనే ఆ మహావ్యక్తికి నమస్కరించాడు వనమాలి.

ఉప్పొంగిన ఆనందంతో క్షణకాలం ఉక్కిరి బిక్కిరయ్యాడు. గ్రామ వైభవం తిలకించి ఇంటిలో అడుగు పెట్టేసరికి రాత్రి ఏడుగంటల యింది. సరిగ్గా అప్పుడే హైదరాబాద్ నుంచి

వనమాలి తలిదండ్రులూ, భార్య, మూణ్ణెళ్ల కొడుకు వచ్చారు.

ఆ రాత్రి -

ఎంత ప్రయత్నించినా వనమాలికి నిద్ర పట్టలేదు.

ఉదయమే లేవాలి.

అమెరికా నుంచి పదిరోజుల క్రితమే వనమాలి హైదరాబాద్ వచ్చాడు. హైదరాబాద్‌లో తల్లీతండ్రీ ఉంటున్నారు. నిన్న ఉదయం హనుమకొండ వెళ్లి, అక్కడనుంచి నేరుగా ఈ ఊరొచ్చాడు.

తాతయ్య కోరిక మేరకు తన కొడుక్కి నామకరణ మహోత్సవం రేపిక్కడ జరిపించాలి.

నిద్రపట్టక వనమాలి ప్రక్కనే ఉన్న మేగజైన్ తీసుకొని చదవడం మొదలుపెట్టాడు.

ఒంటిగంట దాటిపోయింది.

అయినా కంటికి కునుకు రావడం లేదు.

అతని ఆలోచనంతా తాను పుట్టి పెరిగిన ఈ ఊరు గురించే. ఇంతగా అభివృద్ధి సాధించడం వెనుక రాఘవయ్యగారి కృషి తనను ఎంతగానో ప్రభావితం చేసింది.

ఆ ప్రక్కనే తండ్రి, తాత కలసి స్వార్థంతో ఆయనపై తిరగబడ్డ చరిత్రా మనసులో మెదిలింది.

అమెరికాలో ఉన్నప్పుడు ఈ ఊరు అభివృద్ధి గురించి స్నేహితుల ద్వారా విన్నాడు కాని, ఇంత వైభవం ఉంటుందనుకోలేదు.

అమెరికా వెళ్లాక "మా పల్లె బంగారం" అంటూ ఎలుగెత్తి చాటాలనిపించింది. ఆ నిమిషంలో రాఘవయ్యగారు నవభారత గ్రామ నిర్మాతగా కనిపించారు.

ఆ మరుసటిరోజు సాయంత్రం గుడి బయట "నామకరణం" పై చర్చ మొదలయింది.

అక్కడిద్దరు కూర్చున్నారు.

"పిల్లాడికి తాతగారిపేరు పెడతాడేమో వనమాలి..."

"తండ్రిపేరు వదిలేశా..."

ఇంతలో అక్కడికి మరో వ్యక్తి వచ్చాడు. చర్చ ఏమిటో అతనికి అప్పటికే అర్థమయింది.

"మీరనుకొన్నట్లు ఆ పేర్లేమీ పెట్టలేదు. ఆఖరికి మనం కూడా తలకాయలు దించుకొనేలా కొడుక్కి పేరు పెట్టాడ్రా..." ఆ వ్యక్తి అన్నాడు.

"అవును మరి... అమెరికాలో ఉంటున్నాడు కదా... ఏ క్లింటన్ పేరో, బుష్ పేరో తగిలించుంటాడు... ఆ ఉప్పు తింటున్నాడుగా మరి..."

అదిగో అక్కడే పప్పులో కాలేశారు... మన పిల్లలెవ్వరికీ మనం కృతజ్ఞతగా పెట్టనిపేరు ఆ అమెరికా కుర్రాడు పెట్టాడోయ్... దానికే సిగ్గుపడాలి మనమంతా..."

"ఇంతకీ ఏమిటా పేరు?..."

"రాఘవ్..."

## మరపురాని 'రోజు'

*ఓ మహాతల్లికి భర్తని సాధించడం డ్యూటీ. ఒక రోజు ఆమె సాధింపు ఇలా వెరైటీగా ఉంది.*

*భార్య: "హు! ఏదీ గుర్తుండి చావదు మీకు! అన్నీ నేనే చెప్పాలి! అసలీ రోజు మన పెళ్ళి రోజన్నైనా మీకు గుర్తుందా?"*

*భర్త: "ఎంత మాటే! నా జీవితంలో మధురాను'బూతు'లను మిగిల్చిన ఈరోజునెలా మార్చిపోతాననుకొన్నావ్?"*

*భార్య: ???*

**హ**లో...

"హలో.. మిడిమేళపు సుబ్బారావుగారేనా."

"అవునండీ... మీరు...?"

"నాపేరు రిస్మితాసేన్"

"రిస్మితాసేనా... ఈ పేరు ఎక్కడో విన్నట్టుందే"

"ఎక్కడో వినడమేమిటండీ. నేను గత సంవత్సరం మిస్ ఇండియాని. గుర్తు పట్ట లేదా?"

"ఓ... గుర్తుపట్టా. ఇంతకీ మీరు ఎందుకు ఫోన్ చేశారో...?"

"వధువు కావాలని మీరు ఇచ్చిన పత్రికా ప్రకటన చూశా. సమున్నతమైన వ్యక్తిత్వం, నిరాడంబరత్వం కలిగిన మీలాంటి వాళ్లని పెళ్ళి చేసుకోగలిగితే అంతకంటే అదృష్టం ఏముంటుందండీ..."

ఆశ్చర్యంతో, ఆనందంతో, అయోమయంతో ఉక్కిరి బిక్కిరయ్యాడు సుబ్బారావు.

......

"మాట్లాడరేమిటండీ సుబ్బారావుగారూ..."



# తనకి తనపి నెప్పు

"ఆ... ఆ... మాట్లాడుతున్నాను. ఏమండీ రిస్మితగారూ. మీరు తెలుగు చాలా చక్కగా మాట్లాడగలుగుతున్నారు. ఆంధ్రదేశంలో పుట్టినవాళ్ళే తెలుగును అనేక భాషలతో కలగాపులగం చేసి, అసలు తెలుగంటే ఏమిటో తెలియనట్టు మాట్లాడుతున్నారు. అటువంటిది మీరు చక్కటి తెలుగు మాట్లాడుతుంటే వినసొంపుగా ఉంది".

"చిన్నప్పటి నుంచీ మాయింటి పక్కన తెలుగువాళ్ళు ఉండేవాళ్ళు. వాళ్ళతో మాట్లాడి మాట్లాడి తెలుగు వచ్చేసింది. ఇప్పుడు నేను తెలుగు రాయగలను కూడా".

"చాలా సంతోషం రిస్మితగారూ. ఇంతకీ మీరు ఏ ఊరి నుంచి మాట్లాడుతున్నారు?"

"ఢిల్లీ నుంచి మాట్లాడుతున్నాను. మిమ్మల్ని పెళ్ళి చేసుకోగలిగితే మీతోపాటే అంబాజీపేటలో ఉంటాను".

"రిస్మితగారూ... మీ ప్రతిపాదనను తప్పక పరిశీలిస్తాను".



నమస్తే...

నమస్తే...

టెలిఫోన్ పెట్టేసి ఆరోజు వచ్చిన ఉత్తరాలు చూడడం మొదలుపెట్టాడు సుబ్బారావు. దాదాపు పాతిక ఉత్తరాలున్నాయి. అందులో గులాబి రంగు కవరు సుబ్బారావు దృష్టినే కాదు గుండెను కూడా ఆకర్షించింది. వెంటనే ఆత్రంగా ఆ ఉత్తరాన్ని తీసి కవరు మీద అక్షరాల్ని చూశాడు. ముత్యాల్లాంటి అక్షరాలు.

"ఫ్రం... వీణాధరి, వైజాగ్" అని ఉంది.

సుబ్బారావుకి ఆశ్చర్యమేసింది. ప్రముఖ కూచిపూడి నృత్యకారిణి తనకి లేఖ రాసింది. విషయమేమిటోనని మనసు తొందర పెట్టింది. వెంటనే కవరు తెరిచి చూశాడు. అక్షరాల వెంట కళ్ళు వేగంగా పరుగులు తీసినై. సారాంశం... పెళ్ళి ప్రతిపాదనే. తనలాంటి ఆదర్శమూర్తిని, నిరాడంబరుడినీ పెళ్ళి చేసుకోవాలన్న అభిలాషని వ్యక్తం చేసింది వీణ.

తన జీవితాన్నంతటినీ కళకే అంకితం చేద్దామనుకున్నానని, సుబ్బారావు పెళ్ళి ప్రకటన చూసాక ఈ ఉత్తరం రాయాల్సి వచ్చిందనీ వీణాధరి వివరించింది.

సుబ్బారావుని పెళ్ళి చేసుకొని, ఆయన సహకారంతో "ప్రతి స్త్రీ విజయం వెనుక ఒక పురుషుడు ఉన్నాడని" నిరూపిస్తానని వీణ పేర్కొంది.

సోమేపల్లి వెంకటసుబ్బయ్య

సుబ్బారావు ఒక్క నిమిషం రిస్మితా గురించి ఆలోచించినట్టే వీణాధరి గురించీ ఆలోచించ సాగాడు. ఇంకా ఆలోచనలో ఉండగానే–

"ఒరేయ్ అన్నయ్యా ఫ్యాక్స్ వచ్చింది చూడ రా" అంటూ చెల్లాయి నందిని ఒక కాగితం చేతిలో పెట్టి తుర్రున జారుకుంది.

ఫ్యాక్స్‌లో వచ్చింది సందేశం కాదు. బయోడేటా. ఆ బయోడేటాని ఆసక్తిగా చూశాడు. అది జ్యోత్స్నరావుది. సుబ్బారావు కంప్యూటర్ మైండ్‌కి వెంటనే గుర్తొచ్చింది. క్రితం వారమే ఆమె గురించి దాదాపు అన్ని పత్రికల్లో "మహిళా విజయం" పేరుతో కథనాలు వచ్చినయ్. అతి చిన్న వయసులో అతి పెద్ద కంపెనీకి జనరల్ మేనేజర్ అయిందామె. జీతం నెలకి దాదాపు రెండు లక్షల రూపాయలు. ఆమె ఎంతో మందికి ఆదర్శం. ఆమె జీనియస్. ఆమె భాగ్యనగర నివాసి.

బయోడేటా చదవగానే చివర్లో రెండోపేజీ చూడమని సూచన ఉంది. తనకి చెల్లాయి ఒక పేజీయే ఇచ్చింది. వెంటనే ఫ్యాక్స్ దగ్గరకి వేగంగా వెళ్ళాడు రెండోపేజీ కోసం. అప్పటికే రెండోపేజి సిద్ధంగా ఉంది. ఆత్రంగా ఆ పేజీ తీసుకొని అక్కడికక్కడే చదివేశాడు.

"తనకి ధనం ప్రధానం కాదని, వ్యక్తిత్వం ముఖ్యమని, సుబ్బారావు అంగీకరిస్తే పెళ్ళి చేసుకోవాలని ఉందనీ" రాసి ఉంది అందులో. సుబ్బారావుకి మెదడు మొద్దుబారిపోయింది. ఊహించని ఉత్తరాలు... ఆశ్చర్యం, ఆనందం. ఆ ఆనందంలో మునిగి తేలుతూండగానే...

కాలింగ్‌బెల్ శబ్దం. రెండు మూడుసార్లు అస్పష్టంగా వినిపించింది. అనుమానంగానే వెళ్ళి తలుపులు తెరిచాడు.

పూర్తిగా తెల్లని దుస్తుల్లో అదే రంగు టోపీ పెట్టుకొని ఒక వ్యక్తి వినయంగా నిల్చున్నాడు. సుబ్బారావుని చూడగానే తల మరింతగా వంచి "గుడ్‌మార్నింగ్ సార్" అన్నాడు.

ప్రత్యుత్తరంగా తలవూపి విషయం ఏమిటన్నట్టు చూశాడు సుబ్బారావు.

"అయామ్ ఫ్రం అమెరికా" అన్నాడు ఆ వచ్చిన వ్యక్తి.

"అ...మె...రి...కా...యా!?!" ఆ ఆశ్చర్యం అవయవాల్లో కనిపించనీయకుండా జాగ్రత్త పడుతూ–

"అయితే ఏమిటంటా" అన్నట్టు మళ్ళీ చూశాడు సుబ్బారావు.

"మీరు బిల్‌గేట్స్ పేరు విన్నారు కదా...?"

"అవును... విన్నాను ఇంతకీ విషయం ...?"

"వాళ్ళ కజిన్ కూతురు మార్గరెట్ గేట్స్ మిమ్మల్ని పెళ్ళి చేసుకోవాలనుకొంటున్నారు. మీకీ లెటర్ ఇవ్వమని స్పెషల్‌గా నన్ను పంపించారు" అన్నాడు.

లెటరు అందుకున్న సుబ్బారావు "ఇక మీరు వెళ్ళొచ్చు" నన్నట్టు హరిత సంకేతం ఇచ్చాడు. ఉత్తరం ఇచ్చిన వ్యక్తి గేటు దాటీ దాటకముందే బర్రున ఉత్తరం చించి చదివేశాడు సుబ్బారావు. తన ప్రతిభ అమెరికా దాకా చేరినందుకు ఆనందం వేసింది. బిల్‌గేట్స్ అంతటి ప్రపంచంలోనే ధనికుడి కజిన్ కూతురు తనని పెళ్ళి చేసుకుంటానని అనడం నమ్మబుద్ధి కాలేదు సుబ్బారావుకి.

సుబ్బారావు మనసిప్పుడు క్రాస్‌రోడ్స్‌లో ఉంది. ఎటువెళ్ళాలో తెలియడం లేదు. అంతా అయోమయం తల దిమ్మెక్కింది. రెండు చేతులతో తల గట్టిగా పట్టుకున్నాడు. పది నిమిషాలు మౌనంగా గడిచాయి. మెరుపులా ఓ ఆలోచన వచ్చింది. తన ఆలోచనలకి అక్షర




రూపం ఇచ్చి తృప్తిగా నిట్టూర్చి నిద్రలోకి జారుకున్నాడు. సుబ్బారావు కలం నుంచి జాలువారిన అక్షరాల రూపం...

## ప్రకటన

గతనెల 12వ తేదీన "వధువు కావలెను" అనే ప్రకటన అన్ని దినపత్రికల్లో ఇచ్చాను. అందులో "సమున్నతమైన వ్యక్తిత్వం, నిరాడంబరత కలిగిన మిడిమేళపు సుబ్బారావు అనే అంబాజీపేట యువకునికి తగిన వధువు కావాలని" ప్రకటించాను. ఆ ప్రకటన అసమగ్రంగా ఉన్నదని భావించి మరికొంత అదనపు సమాచారంతో ఇప్పుడు మరొక ప్రకటన ఇస్తున్నాను. మిడిమేళపు సుబ్బారావు, అంబాజీపేట అనే నాకు కావల్సిన వధువు రిస్మితాసేన్ అందం, వీణాధరి నాట్యం, జ్యోత్స్నరావు తెలివితేటలు, మార్గరెట్ గేట్స్ ఐశ్వర్యం కలగలుపుకొని ఉన్న యువతి అయితే మంచిది. అటువంటి యువతి నుంచి ఇప్పటి దాకా ఎటువంటి ప్రతిపాదనలూ అందలేదు. ఇప్పటి వరకూ అందిన ప్రతిపాదనలు ఈ ప్రకటనలో పేర్కొన్న అన్ని అంశాలు కలగలుపుకొని ఉండ నందున తిరస్కరించడమైనది. పై విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకు అవకాశం లేదని తెలియజేస్తున్నాను.

ఇట్లు
మిడిమేళపు సుబ్బారావు
అంబాజీపేట

"కొంపముంచావ్ గదరా సుబ్బారావ్" తలుపులు దబాదబా బాదుతున్నాడు ఏడుకొండలు.

కంగారుగా కళ్ళువిప్పి తలుపు తెరిచి చూశాడు సుబ్బారావు.

"ఇట్లా పొద్దెక్కిందాకా ముసుగుతన్ని పడుకుంటే ఎట్లారా మిడిమేళపు సుబ్బారావ్. నీవల్ల సగం ఊరు న్యూస్ పేపర్లు పంచకుండా ఆగిపోయింది. ఏం గొడవొస్తుందో ఏమో" అన్నాడు ఏడుకొండలు ఏడుపు మొఖంతో. హడావుడి పడుతూ గబగబా సైకిలెక్కి పేపర్లు పంచడానికి ఉరుకులు పరుగులెత్తాడు మిడిమేళపు సుబ్బారావు మిట్టమధ్యాహ్న వేళలో... ●

అది ఒక ఓల్డేజ్‌హోమ్. సరిగ్గా చెప్పాలంటే కన్నపిల్లలు బరువుగా భావించే తల్లిదండ్రులకు నీడను ఇచ్చే ఒక ఆశ్రమం.

రకరకాల వృద్ధులతో నిండి ఉంది ఆ ఓల్డేజ్ హోమ్. చేతి కర్ర పట్టుకుని అతి కష్టం మీద నడిచే వృద్ధులు కొందరయితే, వీల్ చెయిర్‌లో కూర్చుని తిరిగేవారు మరి కొందరు.

కొంతమంది పిల్లలు పరదేశాల్లో జీవిస్తూ – వారి తల్లిదండ్రులను చూడడానికి మరెవరూ లేకపోవడంతో వాళ్ళని ఇక్కడ చేర్పిస్తారు. కొంతమందికి ఆస్తికి కొదవలేదు. ప్రతి సంవత్సరం విహారయాత్రలకి పోతారు పిల్లలతో పాటు. అయితే సంవత్సరానికి ఒక పది రోజులు తల్లిదండ్రులను చూసి పోవాలని ఎందుకో అన్పించదు వాళ్లకి. మరికొంతమంది దేశంలోనే ఉంటారు. అయినా తల్లిదండ్రులను దగ్గర ఉంచుకోలేరు. కారణం వారికే తెలియాలి. కొంతమందికి ఆస్తి ఎంత ఉందో వాళ్లకే తెలియదు. అయితే తల్లిదండ్రుల విషయం వచ్చే టప్పటికి "డబ్బు లేదు". అందుకే ఓల్డేజ్ హోమ్‌లో మామూలు గదిలో చేర్పిస్తారు.

ఆవిడ పేరు రంగనాయకమ్మ. కొద్ది రోజుల క్రితమే – ఆమె చిన్నకూతురు, అల్లుడూ తీసుకువచ్చి ఆమెను అక్కడ చేర్చారు. అక్కడకు తీసుకువస్తూ కూతురు రంగనాయకమ్మగారికి ధైర్యం చెప్పింది.. "ఈ ఓల్డేజ్ హోమ్ వ్యవస్థాపకురాలు – సుబ్బలక్ష్మమ్మగారు – నీకు చిన్నప్పుడు బాగా తెలుసట – మాకు చెప్పింది. నీ మీద చాలా గౌరవం. నిన్ను జాగ్రత్తగా చూస్తానని చెప్పింది. అయినా పదిహేను రోజులేగా. వాడి పెళ్లి అవ్వడం, వాళ్లు అమెరికా వెళ్లిపోవడం–నిన్ను ఇంటికి తీసుకు వెళ్లడం – బెంగ పెట్టుకోవద్దు. మేం వచ్చి చూస్తూ ఉంటాం. బెంగ పెట్టుకోవద్దు".

నాలుగు, అయిదు రోజులు జరిగి పోయాయి. కూతురు, అల్లుడూ మళ్లీ కన్పించలేదు.

ఏదో ఆలోచిస్తూ కూర్చుంది గదిలో ఒంటరిగా రంగనాయకమ్మ.

అంతలో వాచ్‌మెన్ మూర్తిని ఆవిడ గదికి తీసుకువచ్చాడు.

మూర్తిని చూడగానే ఎంతో సంతోషపడిపోయింది రంగనాయకమ్మ. చెయ్యి గట్టిగా పట్టుకుని మంచం మీద కూర్చోబెట్టుకుని ఆపేక్షగా అడిగింది "బెంగుళూరు నుంచి ఎప్పుడు వచ్చావు?"

"నిన్ననే వచ్చాను ఆంటీ. రమ ఇంటికి వెళ్లాను నిన్ను చూద్దామని. రమ చెప్పింది చిన్నవాడి పెళ్లి కుదిరిందని, ఇంట్లో అంతా హడావిడిగా ఉందని, నీకు ఇబ్బందిగా ఉంటుందని ఇక్కడ చేర్పించామనీనూ. అందుకే ఇక్కడకు వచ్చాను".

మూర్తి హైదరాబాద్ ఎప్పుడు వచ్చినా దొడ్డమ్మని చూడకుండా వెళ్లడు.

అంతలో సుబ్బలక్ష్మమ్మ అక్కడకు వచ్చింది.

"సుబ్బలక్ష్మీ – వీడు నా చెల్లెలి ఆఖరి కొడుకు. బెంగుళూర్‌లో ఉంటాడు–నా పిల్లలు, నా చెల్లెలి పిల్లలూ స్వంత అన్నా, చెల్లెళ్లు గానే పెరిగారు. వీళ్ల చిన్నతనంలో ప్రతి వేసవికాలం శలవులూ మా తండ్రిగారి పల్లెటూరిలోనే గడిపేవారు.

స్వంత అక్కలు, చెల్లెళ్లు, అన్నలు, తమ్ముళ్లలాగే పెరిగారు. నేనంటే అభిమానం. హైదరాబాద్ వస్తే నన్ను చూడకుండా వెళ్లడు. సంతోషంగా పరిచయం చేసింది మూర్తిని – సుబ్బలక్ష్మికి.

"మీ పెద్దమ్మగారు పిల్లల కోసం బెంగపెట్టుకున్నారు. చేర్పించి వెళ్లారు – అయిదు రోజుల క్రితం. కనీసం ఫోన్ కూడా లేదు".

ఆనందకృష్ణ

"వాళ్ల చిన్న అబ్బాయి పెళ్లి. హడావుడిలో ఉండి ఉంటారు" సర్ది చెప్పబోయాడు మూర్తి.

"మగ పిల్లవాడి పెళ్లి. వీళ్లకు హడావిడి ఏమిటి?" తోసిపుచ్చింది రంగనాయకమ్మగారు.

"ఓరేయ్ – నీ అక్కలు నన్ను ఇక్కడ నుంచి మళ్లీ ఇంటికి తీసుకువెడతారంటావా?" ఆ ప్రశ్న అడిగిందే కాని – ఆమె అనుమానం ఆమె ముఖంలో స్పష్టంగా కన్పిస్తోంది.

"ఎందుకు తీసుకువెళ్ళరు ఆంటీ – అక్కడ పెళ్లి హడావిడి – నీకు ఇబ్బంది అవుతుందే మోనని! మరి ఎక్కడ పెడతారు? అందుకని కొద్ది రోజుల కోసం నిన్ను ఇక్కడ ఉంచారు. పెళ్లి నుంచి తిరిగి రాగానే నిన్ను ఇంటికి తీసుకువెడతారు" ధైర్యం చెప్పాడు మూర్తి.

"నన్ను కూడా పెళ్లికి తీసుకువెళ్లమని బ్రతిమాలాను. అదే మాట – నీకు ఇబ్బంది. ప్రయాణం కష్టం"

"కాదు ఆంటీ రాత్రంతా ప్రయాణం. నీకు ఏ వళ్లు నొప్పులో వస్తే?" సర్ది చెబుదామని చూశాడు మూర్తి.

"రైల్లో ఎ.సి.లో కూర్చుంటే – పడుకుంటే వళ్లు నొప్పులేమిటి? – ప్లైట్‌లో కూర్చుంటే గంటలోపు ప్రయాణం" మళ్లీ తోసిపుచ్చేసింది మూర్తి మాటను.

ఆవిడ మాటలకు నవ్వు వచ్చినా ఆపుకుంది సుబ్బలక్ష్మి. ఈ ఓల్డేజ్ హోమ్‌లో ఎ.సి. గదులున్నా – అవి కాదని మామూలు గదిలో చేర్పించారు – డబ్బు ఖర్చు అని. వాళ్లు ఆవిడను ఎ.సి.లో తీసుకువెడతారా!?

"ఎన్నాళ్లుంటావు? హైదరాబాద్‌లో"

"నాలుగు రోజులు"

"ఉన్నన్ని రోజులూ కన్పిస్తూ ఉండు"

"తప్పకుండా ఆంటీ"

అతను గదిలో నుంచి బయటకు వస్తూంటే – అతనితో బాటు బయటదాకా వచ్చి "ఆవిడని ఈ నాలుగు రోజులూ చూసి వెడుతూ ఉండండి – చాలా బెంగ పెట్టుకుంది. నాకు ఆవిడ చిన్నప్పుడు బాగా తెలుసు. ఎంత దర్జాగా పెరిగిందండీ? ఆమెను చూస్తే జాలి వేస్తుంది..." అంది సుబ్బలక్ష్మి.

"తప్పకుండా కలుసుకుంటానండీ... ప్రతీ రోజూ..." మూర్తికి తన చిన్నతనం జ్ఞాపకం వచ్చింది.

స్కూలు వేసవి సెలవులకు మూయడం, తనూ తన అన్నలూ అమ్మా తాతగారి పల్లెటూరు చేరుకోవడం జరిగేది. కోర్టులు మూయగానే అడ్వకేట్ అయిన తన తండ్రి కూడా అక్కడకు వచ్చేవారు.

దొడ్డమ్మ, బాబాయ్‌గారు, తన అక్కలూ అదే సమయానికి అక్కడకు వచ్చేవారు.

ఎంతో సంతోషంగా గడచిపోయేవి ఆ రోజులు – పొలాల్లో తిరగడం – తోటల్లో మామిడి పండ్లు, కొబ్బరి బొండాలూ – ఒకటే అల్లరి – గాదుపులు అని తాతయ్య కేకలు పెడుతున్నా వినేవారు కాదు. తాతయ్యకు చాలా ఆస్తి ఉండేది. కొబ్బరి తోటలు, మామిడి తోటలు, వరి పొలాలు...

పెద్ద ఇల్లు. అమ్మ, దొడ్డమ్మ రాణీల్లా ఉండేవారు – తాతయ్య భారత, రామాయణ కథలు చెబుతూంటే వింటూ నిద్రపోయేవారు. తన తల్లి పోవడంతో ఆంటీలోనే అమ్మను చూసుకునేవాడు మూర్తి.

అటువంటి దొడ్డమ్మను – అటువంటి పరిస్థితుల్లో చూడవలసి వస్తుందని కలలో కూడా అనుకోలేదు. ఆవిడ దురదృష్టానికి ఒక కన్నీటి చుక్క విడవడం తప్ప తను చేయగలిగింది ఏమీలేదు. చాలా బాధపడ్డాడు – హైదరా

బాద్‌లో ఉన్న నాలుగు రోజులూ ప్రతిరోజూ ఆమెను కలుసుకునేవాడు.

మూర్తి వెళ్లిపోయిన తరువాత భోజనం చేసి నిద్రపోవడానికి ప్రయత్నం చేసింది రంగనాయకమ్మ. నిద్ర రాలేదు. గతం జ్ఞాపకం రావడం మొదలు పెట్టింది. తనకు అప్పుడు 13 సంవత్సరాల వయస్సు. చెల్లెలికి 10 సంవత్సరాలు. ఆ వయసులో ఎంతో ఆనందంగా ఉండేవారు - తనూ చెల్లెలు - సీత. తండ్రి అడ్వొకేట్ - పేరు గాంచిన అడ్వొకేట్ కాకపోయినా - మనిషిగా - మానవత్వం ఉన్న మనిషిగా పేరు గడించారు. డబ్బు ఆర్జించారు - రావుగారితో తన పెళ్లి అయింది. అందగాడు, తెలివైన వాడు అని పేరు. మామగారు "దివాన్ బహదూర్". భర్త రావు న్యాయస్థుడని ఆయన చెప్పిన తీర్పుకు ఎదురులేదని - న్యాయశాఖలో పేరున్న మేజిస్ట్రేట్. మూడు పువ్వులు, ఆరు కాయలుగా మొదలయింది ఆమె వైవాహిక జీవితం. భర్త అంచెలంచెలుగా ప్రమోషన్‌లు సాధించాడు - కొడుకు, ఇద్దరు కూతుళ్లు. చెల్లెలు సీతకు కూడా పెళ్లయింది. ఆమె మామగారు కూడా దివాన్ బహదూర్. పేరు గాంచిన అడ్వొకేట్. ఇద్దరు అక్కచెల్లెళ్లూ స్థిరపడ్డారు - వైవాహిక జీవితంలో. దేనికీ లోటు లేదు... కొడుకు చిన్నతనంలో గ్రాడ్యుయేట్ అయ్యాడు. ఇండియాలో అక్కౌంటింగ్ ట్రైనింగ్ తీసుకుని విదేశాలకు వెళ్లిపోయాడు పై చదువులకి... అంతే కొంచెం కొంచెం దూరమయిపోయారు. వాడు ఉత్తరాలు కూడా వ్రాసేవాడు కాదు... అయితే ఆ బాధను కొంతవరకూ తట్టుకోగలిగారు - భర్తా తనూను.. కారణం వేసవి కాలం - చెల్లెలు, పిల్లలూ తండ్రిగారి పల్లెటూరు వచ్చేవారు. చెల్లెలుకి ఆడపిల్లలు లేరు - దాని పిల్లలు తన కూతుళ్లను స్వంత అక్కలుగా, చెల్లెళ్లగా చూసేవారు. ఎంతకలసికట్టుగా ఉండేవారు? ఆ రోజులు తలుచుకుంటూంటే తనకే ఆశ్చర్యంగా ఉంటుంది.

తన పిల్లలు అందగత్తెలు, తెలివైన వాళ్లు - వాళ్లకు మంచి సంబంధాలే వస్తాయి అన్న ధైర్యం. కొంచెం అహం కూడానేమో! తనకే అనుమానం.

అనుకున్నట్టుగానే వాళ్లిద్దరికీ మంచి సంబంధాలే వచ్చాయి. అందులో చిన్న కూతురి భర్త తనకు చాలా దగ్గర చుట్టరికం కూడా. మనుమల్ని ఎత్తుకుంది - వాళ్లూ పెద్దవాళ్లయిపోయారు - వాళ్ల చిన్నతనం ఇప్పటికీ కళ్లకు కట్టినట్లుంది. వాళ్లు సెలవులకు రావడం - అమ్మమ్మా అంటూ తన చుట్టూ తిరగడం, వాళ్లకి ఏం కావాలంటే అది వంట మనిషి చేత చేయించి పెట్టడం - ఎంతో ఆనందంగా ఉండేది.

మనుమలు, మనమరాళ్లూ పెద్ద అవడం, ఒక్క ఆఖరి మనుమడుకి తప్ప తక్కిన వాళ్లందరికీ పెళ్లిళ్లు అయిపోయాయి. వాళ్లు భర్తలతో, భార్యలతో పై దేశాలకు వెళ్లిపోయారు. ఎంత సేవ చేసింది పిల్లలకు, మనుమలకు? రావు గారు పిల్లలకు ఏది కావాలంటే అది ఇచ్చేవారు. అల్లారుముద్దుగా పెంచారు. దానికి వాళ్లు ఋణం తీర్చుకుంటారు అనుకునేది. ఆయన రిటైర్ అయిపోయిన తరువాత పిల్లలు వచ్చేవారు సెలవులకి. పిల్లల దగ్గరకు వెళ్లడం వీరికి అలవాటు లేదు. వాళ్ళే వచ్చేవారు.

ఆనందంగా జరుగుతున్న తన జీవితం - ఒక్కసారిగా విషాదాంతంగా మారిపోయింది ఒక రోజు.

ఆ రోజు సాయంత్రం మామూలుగా స్నేహితులతో పార్కుకి వెళ్లివచ్చారు. మామూలుగా నిద్రపోయారు... అయితే పొద్దున అయిదున్నర గంటలకు లేచే ఆయన ఆరు గంటల వరకూ

లేవలేదు – బద్ధకంగా ఉందేమో ఎందుకు లేప డం అని తనూ వూరుకుంది – ఆరున్నర అ యింది – అయినా నిద్రలేవలేదు – తనకూ తోచక నిద్ర లేపుదామని ప్రయత్నించింది. లేవలేదు... ఊ... అని కూడా అనలేదు. భయం వేసింది. వెంటనే పని మనిషితో ప్రక్కన ఉన్న చెల్లెని కొడుక్కి కబురు పంపింది. పరి గెట్టుకొచ్చాడు, దొడ్డమ్మ ఇంటికి – తనూ ప్రయ త్నం చేశాడు ఆయన్ను నిద్ర లేపడానికి. ఎంతకీ లేవకపోవడంతో అర్ధమయింది అది శాశ్వత నిద్ర అని. అయినా ఆమెకు ఆ మాట చెప్పలేక పోయాడు. ప్రక్క ఇంట్లో ఉన్న డాక్టర్‌ని పిలుచు కువచ్చాడు – ఆయనకు చెప్పక తప్పలేదు – రావుగారు ఇంకలేరు అని. గొల్లుమంది. తన చెల్లెలు – చెల్లెలి కొడుకు కుటుంబం ప్రక్కనే ఉంటారు. పరుగెట్టుకు వచ్చారు...

జరుపవలసిన తతంగం అంతా చెల్లెలి కొడుకే చేశాడు. తన కొడుకు దేశంలో లేడు. ఇంచుమించుగా వాడిని మరచిపోయారువాళ్లు. కూతుళ్లు, అల్లుళ్లూ మర్నాటికి చేరుకున్నారు. నాతో రా అంటే నాతో రా అని పోటీపడ్డారు వాళ్ళిద్దరూ – తనను తీసుకువెళ్లడానికి. లోపల భర్తపోయిన బాధను కొంతవరకూ మరిచి పో యేలా చేసాయి వాళ్లమాటలు.

అలా ఆరంభమయింది తన ఏకాంత జీవితం. తల్లికి అడుగులకు మడుగులొత్తారు ఇద్దరు కూతుళ్ళూ. "నా దగ్గర ఉంటుందిలే అమ్మ – ఇంకొన్ని రోజులు" అని పోటీ పడే వారు వాళ్లిద్దరూ. ఏమీ లోపం లేకుండా చూసే వారు ఆమెను.

కొద్ది సంవత్సరాలు గడిచిపోయాయి. మెల్లి గా మొదలయ్యాయి సణుగుళ్లు. పొరబాటున తను తింటున్నది ఏదో కింద పడితే "నీ గదిలో కూర్చుని తినొచ్చుగా – అక్కడయితే కింద ప్లాస్టిక్ షీట్ వేశాం – తీసి దులిపి వెయ్యవచ్చు. ఇక్కడ అయితే ఇల్లంతా చీమలు" అనేవారు.

నీళ్లు కింద పడితే "జారిపడతాం ఏ కాలో విరుగుతే అదొక ప్రోబ్లమ్"

నీళ్లు కింద పడితే తను తుడవడానికి ప్రయ త్నిస్తే "నీకెందుకు శ్రమ! నేవున్నానుగా"

ప్రతి మాటలోనూ, చేతలోనూ – 'మన మీద కూర్చుంది" అనే భావాన్ని వ్యక్తం చేసే వారు.

తను చేయగలిగింది ఏమిటి? ఎక్కడకు పారిపోగలదు? "పాపీ చిరాయువు అన్నట్టుగా దేవుడు తనను తీసుకువెళ్లడం లేదు అనుకునేది – అయితే వెంటనే "ఛీ – పిల్లలను అనుమానిం చడం తప్పు"... వాళ్లు పెద్దవాళ్లవుతున్నారు. నేను సాయం చేసేది లేదు – పైగా వాళ్లకు చాకిరీ అన్పించేది. మళ్లా ఒక ఆలోచన – అంత డబ్బుంది వాళ్లకు – పైగా తన ఆస్తంతా కూడా వాళ్లకే. ఇంకొక నౌకర్ని తన కోసం పెడితే – మళ్లీ ఒక అడ్డు ఆలోచన – నౌకర్లు సరైన వాళ్లు కాకపోతే ఏదో ఒక రోజు ఇంట్లో వున్న వన్నీ పట్టుకుపారిపోతే – అదో గొడవ – ఆలో చనలతో సతమతమవుతూ ఉండేది.

క్రమంగా రోజులు జరుగుతూంటే ఆమె ఎవరి ఇంట్లో ఎన్ని రోజులుండాలి – వంతులు వేసుకునేవారు ఇద్దరు పిల్లలూ – ముందు తనకు అర్ధం కాలేదు సరిగ్గా మూడు నెలల కొకసారి తను ఇల్లు మారేది. ఒక్కరోజు కూడా ఇటూ అటూ అయ్యేది కాదు. మళ్లీ తనలో ఆలోచన. అదీ మంచిదే – పాపం ఒక్కర్తే ఎంత కాలం చేయగలదు. వాళ్లకూ కొంత శ్రమ తగ్గు తుంది అని సరిపెట్టుకుంటూ ఉండేది. పిల్లలు కష్టపడుతున్నారంటే అదొక విధమైన జాలి.

అయితే ఒకటి రెండుసార్లు వాళ్ల ఇద్దరి మధ్యా జరుగుతున్న టెలిఫోన్ సంభాషణలు ఆమె అభిప్రాయాల్ని పూర్తిగా మార్చేశాయి.




"సరేలే - అమ్మను పది రోజులు నేను ఇక్కడ ఎక్కువ అట్టే పెట్టుకుంటాను. వచ్చేసారి నువ్వు అట్టిపెట్టుకుందువుగాని లే" అంటోంది చిన్నకూతురు పెద్దకూతురితో తన చెవుల్ని తనే నమ్మలేకపోయింది -ఖిన్నురాలైపోయింది అయినా ఆ మాటలు విననట్టుగానే ప్రవర్తిం చింది.

మరొకసారి చిన్నకూతురు అక్కతో అంటోంది ఫోన్‌లో "కిందటిసారీ అంతే చేశావు. మా ఆరోగ్యాలు అంతంతే కదా! ఇలా ప్రతిసారీ అమ్మను ఇక్కడ ఎక్కువ రోజులు వుంచేయడం బాగా లేదు".

తన చెవులకి శూలాల్లా గుచ్చుకున్నాయి ఆ మాటలు. తన పిల్లలకి తను అంత బరువైపోయానా!? నిశ్చేష్టురాలు అయిపోయింది - రంగనాయకమ్మ.

మరొక రోజు చిన్నకూతురే ఫోనులో అంటోంది - అక్కతో.

"మనమూ పెద్దవాళ్లం అవుతున్నాం. మన ఆరోగ్యం కూడా అంతంతే. ఇలా అమ్మని ప్రతి మూడు నెలలకూ పిల్లి పిల్లలా తిప్పడం బావుండదు. అందుకని ఆమెను ఏదో ఒక ఓల్డ్‌జ్ హోమ్‌లో చేర్పిస్తే బావుంటుంది అనుకుంటున్నాము".

... అవతల ప్రక్క నుంచి అక్క ఏమందో తెలీదు కానీ చిన్న కూతురే అంటోంది "ఖర్చు అంటారా!? చూద్దాంలే అంత ఎక్కువ కాకుండానే చూస్తాం. ఇద్దరూ చెరిసగం చేసుకుంటే అంత ఎక్కువ అవ్వదు".

...

"ఆ... మరో విషయం. మా చిన్నవాడి పెళ్లి స్థిరపడింది...

"ఆ... మేం ఎక్కడ వెతికాం? వాడే అక్కడే చూసుకున్నాడు. ఇక్కడి వాళ్లే. హిందువులే. పెళ్లి సంబంధం కూడా నిశ్చయించి మాతో చెప్పారు అమ్మాయి తల్లిదండ్రులు. వచ్చే నెలలోనే ముహూర్తం"

అమ్మని ఎలాగా తీసుకువెళ్లం. మీరు కూడా పెళ్లికి వస్తారు. అమ్మను ఎక్కడ పెడదామా

అని ఆలోచించాం. ఏమనుకున్నామంటే ఇది అదనుగా తీసుకుని అమ్మను ఏదో ఒక ఓల్డేజ్ హోమ్‌లో చేర్పిద్దాం".

"ఆ రేప్పొద్దునే వెళ్దామనుకుంటున్నాము - మళ్ళీ ఫోన్ చేస్తానులే".

"అమ్మా చిన్నవాడి పెళ్లి కుదిరింది'' చెప్పింది. తనకేమీ తెలీనట్టు "సంతోషం" అంది రంగనాయకమ్మ.

"పెళ్లి మళ్లీ వచ్చే నెలలోనే... రేపటి నుంచి హడావుడి మొదలవుతుంది. నేనూ అక్కా ఏమనుకుంటున్నామంటే నిన్ను మంచి ఓల్డేజ్ హోమ్‌లో పెడదామనుకుంటున్నాం. మళ్లీ పెళ్లి నుంచి రాగానే ఇంటికి వచ్చేద్దువుగాని"

"అది కాదే - వాడు మన ఇంట్లో అందరి కంటే చిన్నవాడు. ఆఖరి పెళ్లి ఆ తరంలో. నేనూ వస్తానే"

"లేదమ్మా - ప్రయాణాలు నీకు ఇబ్బంది. నీకేమైనా ఏ నలత అయినా వస్తే - అదొక ఇబ్బంది.

ఎలాగైనా పెళ్లి అవ్వగానే రిసెప్షన్ ఉంటుంది - అప్పుడు చూద్దువుగాన్లే కోడల్ని"

ఏమనలేకపోయింది రంగనాయకమ్మ.

అలా ఆరంభమయింది ఆవిడ వృద్ధుల ఆశ్రమ జీవితం...

ప్రక్క ఆఫీసు గదిలో నుంచి రెండు గంటలు విన్పించాయి... ఎప్పుడో ఒక కునుకు తీసింది.

ఆ రోజు సుబ్బలక్ష్మమ్మ రంగనాయకమ్మను పక్క గదిలో ఉన్న శాంతమ్మగారికి పరిచయం చేసింది "నీకు చెప్పాను కదా! రంగనాయకమ్మగారు..."

రంగనాయకమ్మగారితో అంది ఈవిడ "శాంతమ్మ" గారు. ఈ సంస్థకి నేనేంతో - ఈమె అంతకంటే ఎక్కువే. నువ్వు వచ్చేముందే పిల్లలతో పైవూరు వెళ్ళారు ఇవేళే వచ్చారు"

"మిమ్మల్ని గురించి సుబ్బలక్ష్మమ్మ నాతో చెప్పింది - మీరూ తన చిన్నప్పటి నుంచి స్నేహితులట" శాంతమ్మ మాటలకు...

"అవునండి" అందే కానీ ఏమీ చెప్పిందో ఊహించలేకపోయింది. తనకు అది అవసరం లేదు కూడా.

శాంతమ్మగారి వైపు ఒకసారి చూసింది పూర్తి ఏకాగ్రతతో. ఎంత ఆకర్షణ ఉంది ఆ ముఖంలో? ప్రశాంతమైన చూపులు - ఎంత అందమైన మొహం!! తల ముగ్గుబుట్ట అంటే ఆమె అందమైన కేశాల్ని అవమానించడమే. మచ్చుకైనా ఒక్క రంగు వెంట్రుక లేదు. ఆమె అందమైన ముఖానికి మరింత అందాన్ని ఇస్తున్న కళ్లజోడు - దానికి కిందకు పడకుండా ఉండడానికి బంగారు గొలుసు. తనకంటే కొంచెం వయసులో చిన్నదే అయి ఉంటుంది. ఆ వయసులో అంత అందమైన మనుషులు అరుదే. ఎనభై వసంతాలు చూసి వుంటుంది - అయినా ఆ గడిచిన సంవత్సరాల చిహ్నాలు మచ్చుకైనా లేవు - చిన్న చిన్న గాలిబీటల్లా - తల వెంట్రుక వాసిగీతలు ఉన్నాయి. ఒక్క మాటలో చెప్పాలంటే - ఎప్పుడో సాలార్‌జంగ్ మ్యూజియంలో చూసిన పాలరాయి బొమ్మ జ్ఞాపకం వచ్చింది ఆమెకు. అంత వయసులోనూ మలచిన పాలరాతి బొమ్మలావుంది. ఆవిడ జీవితంలో విషాదాన్ని చూడలేదేమో - లేకపోతే అంత వయస్సులో అంత ప్రశాంతమైన ముఖం ఉండదు.

ఒక రోజు సాయంత్రం రంగనాయకమ్మ - శాంతమ్మగారి గదిలో కూర్చుంది. వాళ్లిద్దరూ ఏదో మాట్లాడుకుంటున్నారు. అక్కడకు వచ్చింది - అయిదారు సంవత్సరాల చిన్నపాప "హేపీ బర్త్‌డే బామ్మా - అంటూ తన చేతిలో

ఉన్న ఎఱ్ఱగులాబీల గుత్తిని ఆమెకు అందిస్తూ ఆమె వళ్లో వాలిపోయింది - ఎంతో ఆప్యాయతతో...

బామ్మగారు ఆ పిల్లను ముద్దులతో ముంచేస్తోంది - ఆ గదిలో మరొక మనిషి ఉందనే సంగతి మర్చిపోయారు. అప్పటికి మెల్లిగా చేరుకుంది - ఆ పాప తల్లి - వస్తూనే "శ్రేయా - నువ్వు అలా బామ్మగారి మీద కూర్చొని తొక్కేస్తే - బామ్మగారికి వళ్లు నెప్పులు వస్తాయమ్మా"

"ఏం పరవాలేదు మమ్మీ - బామ్మనన్నేమీ అనదు కదా - బామ్మా?" బామ్మవైపు చూసింది.

"నిన్నెందుకు అంటానమ్మా? - మా వజ్రాలమూట" మరోమాటు గట్టిగా ముద్దు పెట్టుకుంది.

రంగనాయకమ్మ - ఒకసారి బామ్మ, కోడలు, మనుమరాలు ముగ్గురువైపూ చూసింది.

ఆశ్చర్యపోయింది... ఒకర్ని మించిన అందం మరొకరిది.

"మా కోడలు - శారద" పరిచయం చేసింది శ్రేయ తల్లిని రంగనాయకమ్మకి.

ఆమె విగ్రహం రంగనాయకమ్మను ఎంతో ఆకర్షించింది. శ్రేయ వైపు ఒకసారి చూసింది. రంగు తల్లిది. కన్నూ, ముక్కూ బామ్మవి. తల్లి అందం తక్కువనికాదు... అంతకంటే కోడలు కొంచెం తక్కువే.

ఆ పసి ముఖంలో తల్లి శారద ముఖంలో సౌమ్యం, నమ్రత - చదువుల సరస్వతే కన్పిస్తుంది.

ఏదో ఏదో ఆలోచిస్తోంది.

"బామ్మగారూ ఇవేళ మా బామ్మగారి బర్త్‌డే. మీరూ పళ్లు తినండి" అంటూ చేతికి ఇచ్చింది కొన్ని ద్రాక్ష గుత్తులు. ఆ పళ్లు తీసుకుని శ్రేయను ముద్దుపెట్టుకోలేకుండా ఉండలేకపోయింది రంగనాయకమ్మ. తన మనుమరాళ్లు జ్ఞాపకం వచ్చారు. ఏవేవో కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు.

శారద భర్త ఆనంద్ వచ్చాడు. వస్తూనే - ఒక షాల్ ఇచ్చాడు అమ్మకు.

"ఇవన్నీ ఎందుకు బాబూ - పళ్లు చాలవూ?

"లేదండీ మీ అబ్బాయికి అలవాటేగా".

ఆనంద్‌ని కూడా పరిచయం చేసింది శాంతమ్మ రంగనాయకమ్మగారికి. 'శ్రేయా నీ బర్త్‌డేకి నా గిఫ్ట్. ఒక చెక్కు వ్రాసి ఇచ్చింది - బామ్మ మనుమరాలికి. "ఎందుకండీ ఇవన్నీనూ" శారద అంది.

"నా మనుమరాలమ్మా" అంది శాంతమ్మ.

మళ్లీ ఆ రోజు రంగనాయకమ్మగారికి నిద్ర పట్టలేదు. కారణం... శాంతమ్మగారి సంతోషమైన కుటుంబాన్ని చూసి అసూయకాదు- అటువంటి కుటుంబాలు నిజంగా ఉంటాయా? అని ఆశ్చర్యంతో.

రోజులు గడుస్తున్నాయి. మనుమడు పెళ్లి అయివచ్చాడు - ఇంటికి తీసుకువెళ్లి కొడుకుని, కోడల్ని చూపించింది. చూపించి, "వీళ్లతో బాటు మేము సింగపూర్ వెడదామనుకుంటున్నాం. పెద్దవాడి దగ్గర ఓ నెల్లాళ్లు ఉండి వస్తాం" అంది. మళ్లీ ఓల్డేజ్ హోమ్‌లో వచ్చి పడింది రంగనాయకమ్మ.

ఆరోజు శాంతమ్మ అంది "నాలుగు రోజుల పాటు పిల్లలతో ఊటీ వెడుతున్నాం. రమ్మని ఒకటే పట్టు - వెళ్లకపోతే చిన్న బుచ్చుకుంటారు"

మర్నాడు పొద్దున్నే కొడుకు, కోడలు, మనుమరాలూ వచ్చి ఆవిడను తీసుకువెళ్ళారు.

ఒక్కర్తై గదిలో కూర్చుని, ఏం తోచక సుబ్బ

లక్ష్మమ్మను పిలిచి మాట్లాడుతూ కూర్చుంది రంగనాయకమ్మ.

'ఎంత ఆనందమయిన కుటుంబం. ఎంత సంతోషంగా కన్పిస్తారు. కోడలు కాదు... కూతురు కంటే ఆప్యాయంగా చూస్తుంది శారద అత్తగారిని... అంత అన్యోన్యం కథల్లో, సినిమాల్లోనే కన్పిస్తుంది...”

రంగనాయకమ్మ మాటలకు “ఊ” అని ఊరుకుంది సుబ్బలక్ష్మమ్మ.

“అందుకనే అంటారు మనవాళ్లు – కొరివి పెట్టడానికి ఒక కొడుకు ఉండాలి అని... కూడ బెట్టి అన్నంతింటూ – ఆఖరి రోజులు కొడుకు చేతుల్లో పోతే ఎంత బావుంటుం ది?...” తనకు కొడుకు ఉండి కూడా ఆ అదృష్టానికి నోచుకోలేదన్న బాధ ఆమె ముఖం మీద కొట్టొచ్చినట్టు కన్పిస్తోంది.

మళ్లీ రంగనాయకమ్మే అంది... “వాళ్లు అంత అన్యోన్యంగా ఉంటారు కదా! ఆమెను ఇక్కడ ఎందుకు చేర్చారు?” ప్రశ్న అడిగిందే కానీ ఎందుకు అడిగానా అని నొచ్చుకుంది.

జాలిగా నవ్వి, “ఊ” అని ఊరుకుంది జవాబుగా సుబ్బలక్ష్మమ్మ.

“నవ్వుతావు ఎందుకు?”

జవాబు లేదు.

మళ్లీ రంగనాయకమ్మ అంది

“అందుకనే అంటారు – ఒక్కచోటే ఎక్కువ కాలం కలిసి ఉంటే అత్తా కోడళ్ళ మధ్యలో మనస్పర్థలు రావచ్చు” అని...

“ఏం మాట్లాడవేం”

రంగనాయకమ్మ ప్రశ్నకు సుబ్బలక్ష్మమ్మ నోరు విప్పింది.

'ఆనంద్ ఆమె కొడుకూ కాదు – శారద ఆమె కోడలూ కాదూ – శ్రేయ మనుమరాలు అసలేకాదు. అయినా వాళ్లు ఆమెకు అంతకంటే దగ్గరవాళ్లు –ఆమెకు మూడు ప్రాణాలు – వాళ్లు ముగ్గురూను”

నమ్మలేకపోయింది రంగనాయకమ్మ “ఆ” అంది.

వాళ్ల కథ చెప్పడం మొదలు పెట్టింది సుబ్బలక్ష్మమ్మ.

అవును అదొక విచిత్రమైన సంబంధం – దేముడి లీల అనాలి – నాకూ ఆ కుటుంబం నలభై సంవత్సరాల నుంచి తెలుసు. శాంతమ్మగారు చాలా సన్నిహితురాలు. ఆమె భర్త పేరు రమణారావు. ఏదో కంపెనీకి ప్రెసిడెంట్, డైరెక్టర్. డబ్బు, హోదా – ఒకే కొడుకు – స్వంత కూతురికంటే ఆప్యాయంగా చూసుకునే కోడలు. ఒక చిన్నపాప.

కొడుకు పేరు కృష్ణ – అతనికి తల్లిదండ్రుల మీద ఎంత ప్రేమ అంటే – పైదేశాల్లో ఉద్యోగాలు వచ్చినా తల్లిదండ్రులను వంటరివాళ్ళుగా వదిలి వెళ్లలేదు. రమణారావుగారు రిటైర్ అయిపోయారు. నాలుగు బెడ్‌రూమ్‌ల ఫ్లాటు కొనుక్కొని ఇక్కడే స్థిరపడిపోయారు. ఎవరి దిష్టి తగిలిందో ఏమో వారి ఆనందమయ జీవితం – ఒక్క క్షణంలో చీకటిగా మారిపోయింది – ఏదో పిక్నిక్ వెళ్లిన కొడుకు, కోడలు, మనుమరాలు క్షణంలో శవాలుగా మారిపోయారు – రోడ్డు ప్రమాదంలో.

వాళ్ల జీవితాలు చీకటిమయం – తట్టుకోలేకపోయారు ఆ విధి వ్రాతను. అది మొదలు వారి జీవితమే మారిపోయింది. బయటకు రావడం మానేశారు.

అదే రోజుల్లో ఆనంద్, శారద ఆ బిల్డింగ్‌లో సరిగా వీళ్లకు ఎదురుగా ఉన్న ఫ్లాట్‌లోకి వచ్చారు. కొత్తగా పెళ్లయింది... ఏదో కంపెనీలో డైరెక్టర్. చిన్న వయసులో డైరెక్టర్ అయ్యా




డు. శారదది చాలా చురుకైన, ఉల్లాసమైన మనస్తత్వం. ప్రతి వారితో స్నేహం చేస్తుంది. పెద్ద వాళ్లంటే గౌరవం... పిల్లలంటే ముద్దు. ఆ ఫ్లాట్స్‌లో ఉన్న కన్పించిన పిల్లల్ని అందర్నీ ఆడించేది. కథలు చెప్పేది – పిల్లలందరికీ చాలా దగ్గరయిపోయింది.

అందరితో స్నేహం చేసింది కానీ ఎదురుగా ఉన్న ఫ్లాట్‌లోని శాంత, రమణారావుగార్లతో పరిచయం చేసుకోలేకపోయింది. ఆమె మనస్తత్వానికి అది విరుద్ధం. ఎప్పుడూ తలుపు వేసి ఉండేది. ఎలా? వాళ్లను కలసుకోవడం!?

ప్రక్కవాళ్ల దగ్గర్నుంచి తెలుసుకుంది – వారి విషాద కథ.

ఒకరోజు చొరవ చేసుకుని వాళ్ల ఫ్లాటు గంట కొట్టింది. రమణారావుగారు తలుపు తీసారు.

తన తండ్రి బ్రతికి ఉంటే ఆయన వయస్సు అనుకుంది.

'నమస్కారమండీ – మేము ఎదుటి ఫ్లాట్‌లోకి వచ్చాం. నా భర్త ఆనంద్... కంపెనీలో డైరెక్టర్" పరిచయం చేసుకుంది – నా పేరు శారద

"లోపలికి రామ్మా..."

తన కొడుకు, కోడలూ పోయి నెలలు అయ్యాయి. ఎవరూ వచ్చి పలుకరించడానికి కూడా సాహసం చేయలేదు. కారణం... వారి మరణం వాళ్ల మీద చూపిన ప్రభావం...

అంతలో శాంతమ్మ వచ్చింది అక్కడకు.

"చూడు శాంతా – మన ఫ్లాట్ ఎదుటి ఫ్లాట్‌కి వచ్చారట –పేరు శారద –భర్త ఆనంద్".

ఎందుకో శారదను చూడగానే కోడలు గుర్తుకు వచ్చింది శాంతమ్మకి. ఇంచుమించు ఒకే వయస్సు – కొంచెం చిన్నది అయ్యుండొచ్చు.

"కూర్చొమ్మా..."

"హాల్లో అన్ని చోట్లా కొడుకు, కోడలు, మనుమరాలి ఫొటోలు... తలుపు ముయ్యకుండా ఉన్న గది నిండా బయటకు కనిపించే

బొమ్మలు - చిన్న పిల్లల ఆట వస్తువులు...

వాటివైపు మళ్లింది శారద చూపు... కళ్ల లోంచి అనుకోకుండా ఒక రెండు కన్నీటి చుక్కలు.

వాళ్లెవరో ఆమెకు తెలీదు - అయినా!?

"ఇంకెవరు ఉన్నారమ్మా - ఇంట్లో" శాంతమ్మ ప్రశ్నించింది.

జవాబుగా ఒక నిట్టూర్పు - "నాకు - నా అనే దగ్గర చుట్టాలెవరూ లేరండీ... ఆయనకూ అంతే. ఆయనకు నేను - నాకు ఆయనా - అంతే"

"అంతేనమ్మా - భగవంతుడి లీలను అర్థం చేసుకోవడం కష్టం - కొడుకు, కోడలూ, మనమరాలు - ముగ్గుర్నీ పోగొట్టుకున్నాం. ఈ సత్యాన్ని జీర్ణం చేసుకోలేకపోతున్నాం - అటువంటి సమయంలో మాయింటికి ఎదురుగా మిమ్మల్ని తీసుకువచ్చాడు" ఎందుకు అలా అందో తెలీదు కాని - ఆ మాట అన్నప్పటి నుంచీ శారద ఆమెకు దగ్గరయిపోయింది. కొద్ది రోజుల్లోనే శారద ఆమెకు ఆత్మీయురాలు అయిపోయింది. ఆనంద్ రమణారావు గారికి దగ్గరయిపోయాడు. వారు నలుగురూ ఒకే కుటుంబంలా అయిపోయారు. రమణారావు గారు, శాంతమ్మ ఇంటి బయటకు రావడం మొదలుపెట్టారు. మళ్లీ మామూలు మనుషులు అయ్యారు.

శారద - "మిమ్మల్ని అత్తయ్య అనాలనిపిస్తోంది మీకు అభ్యంతరం లేకపోతే" శాంతమ్మతో అంది.

"అంతకంటేనామ్మా - నేనే అందామనుకుంటున్నాను - నన్ను అత్తయ్య అని పిలవమని" ఆవిడ మనస్తత్వానికి తగిన కోడలు - స్నేహాలు చుట్టరికాలుగా మారాయి.

కొద్ది నెలలు గడిచాయి. ఒక రోజు శారద శాంతమ్మతో చెప్పింది -"తను తల్లి కాబోతున్నా" నని.

ఒక్కక్షణం ఆగలేదు - 'విన్నారా? మన కోడలు త్వరలోనే మనకు ఒక మనువణ్ణో, మనుమరాల్నో ఇవ్వబోతోంది".

ఆ మాట వినగానే - "మనకు పోయిన మనుమరాలు మళ్లీ తిరిగి వస్తుంది - ఐ యామ్ షూర్"

ఆ రోజు శాంతమ్మగారు తన చేతుల్తో అన్నం పెట్టింది - కోడలికి - కొడుక్కి.

అది మొదలు - ప్రతిరోజూ ఒక గంటసేపు శారదకు పాఠాలు చెప్పేది - తీసుకోవలసిన జాగ్రత్తలను గురించి. ఒకరోజు ఆవిడ చెప్పింది శారదకు - "చూడమ్మా స్త్రీకి పెళ్లి కాగానే ఆమెకు సంఘంలో ఒక అంతస్తు పెరుగుతుంది. పిల్లలు కలగగానే - ఆమె అమ్మ అవుతుంది - అందర్నీ మరిపించేది అమ్మ. పిల్లల కోసం ప్రాణం కూడా ఇవ్వడానికి సిద్ధపడుతుంది అమ్మ. కానీ ఆ అమ్మ కోసం తన కూతురు ప్రాణం ఇవ్వడానికి సిద్ధ పడ్తుందా? తనకు తన సంతానం ప్రధానం - తన పిల్లల కోసం ప్రాణం ఇవ్వడానికి సిద్ధపడ్తుంది - ఆ విషయం మర్చిపోకుండా ఉండడం కోసమే మనవాళ్లు అంటారను కుంటాను "మాతృదేవోభవః". ఇది జ్ఞాపకం పెట్టుకోమ్మా. నీ కన్నతల్లిని ఎప్పుడూ మర్చిపోవద్దు. ఆమె భౌతికంగా ఇక్కడ లేకపోయినా స్వర్గంలో ఉన్న ఆమె దీవెనలు నీకు ఎపుడూ ఉంటాయి".

శారదకు ఆ మాటల్తో శాంతమ్మ మరీ దగ్గర అయిపోయింది.

నెలలు గడుస్తున్నాయి. శారద కడుపులో పాప పెరుగుతోంది. ఆమెను చూసిన వారందరూ ఆమెకు పాప పుడ్తుంది అని చెప్పినవాళ్లే.

కన్న కూతురిలా చూసుకుంది శాంతమ్మ

శారదను - పత్యాలు, జాగ్రత్తలూ... ఒకటే మిటి!?

సమయం రానే వచ్చింది - ఒక చక్కటి పాపకు జన్మనిచ్చింది శారద -

పాపకు పేరు మీరే పెట్టాలి అని వత్తిడి చేశారు - ఆనంద్, శారద. తప్పలేదు రమణా రావు, శాంతమ్మగార్లకు. నామకరణం చేశారు - "శ్రేయ".

అది మొదలు - రమణారావుగారి ఇల్లు మళ్లీ కళకళలాడడం మొదలు పెట్టింది.

ఆనంద్ ఆఫీస్‌కి వెళ్లింది మొదలు మళ్లీ తిరిగి వచ్చేవరకూ - శారద, శ్రేయ వాళ్ల ఇంట్లోనే, రమణారావుగారికి మనుమరాలితో ఆడిన ఆటలన్నీ గుర్తుకు వచ్చేవి - ఏనుగు అంబారీ అనేవారు, గుఱ్ఱపుస్వారీ అనేవారు శ్రేయ నవ్వులతో వాళ్లను మరో లోకాలకి తీసుకువెళ్లిపోయేది - శ్రేయ తుమ్మితే - డాక్టరు దగ్గరకు పరుగుపెట్టేవారు - రమణా రావుగారు. "ఆయనకి ప్రతి చిన్న విషయానికీ భయమే". చిట్కా వైద్యం చేసేది బామ్మ.

నాలుగు సంవత్సరాలు గడిచిపోయాయి.

ఆరోజు పొద్దున్న "ఆనంద్, శారదా" గట్టిగా కేకపెట్టింది శాంతమ్మగారు

పరుగెట్టుకువెళ్లారు ఇద్దరూ వాళ్ల ఫ్లాట్‌కి - తిన్నగా రమణరావుగారి బెడ్‌రూమ్‌లోకి వెళ్ళారు. ప్రక్కనే డాక్టర్ ఉన్నాడు - తలవంచేసు కున్నాడు.

"ఏమయింది డాక్టర్? - ఆనంద్ అడిగాడు - కంగారుగా"

అయామ్‌సారీ - నేను చేయగలిగింది ఏమీలేదు.

"మాసిక్ కార్డియాక్ ఎరస్ట్" - నిద్రలోనే పోయారు. కనీసం నాలుగు అయిదు గంటలయి ఉంటుంది.

అప్పుడు టైమ్ ఉదయం ఆరుగంటల యింది - అంటే ఆయన ఆఖరి శ్వాస సుమారు ఒంటిగంటకు..."

కొట్టేసిన చెట్టులా పడిపోయింది శాంతమ్మ - శారద ఆమెను వళ్లో పడుకోబెట్టుకుంది.

ఆనంద్ స్వంత కొడుకులా చేయవలసిన కర్మకాండ పూర్తిచేశాడు - శాంతమ్మ కొడుకు, కోడలూ మనుమరాళ్ల మరణాన్ని తట్టుకోగలి గింది - ఆనంద్, శారదా, శ్రేయ ఆ గాయాన్ని కొంతవరకూ మాన్పగలిగారు. కాని భర్త మరణం ఆవిడను కృంగదీసింది - ఇంక ఆ ఫ్లాట్‌లో ఉండలేకపోయింది. అదే మాట శారదతో అంది.

"అత్తయ్యా - మీరు ఇక్కడ నుంచి వెళ్లరు. వెళ్లనివ్వం. మీరు మా వాళ్లే".

"లేదమ్మా మీకు శ్రమ ఇవ్వలేనమ్మా"

"మాకు శ్రమ ఏమిటి? - నాకు తల్లి - శ్రేయకు బామ్మ - శారదకు అత్త". "మాతో పాటే మీరూను"

శ్రేయకు అర్థం కాలేదు అవన్నీ.

శారదా, ఆనంద్ ఎంతో బ్రతిమలాడారు ఆవిడను... వెళ్లొద్దని.

కానీ ఆమె ఒప్పుకోలేదు - ఫ్లాట్ అమ్మే సింది.

ఆవిడ ఆస్తులను అంతా ఒక కొలిక్కి తీసు కురావడానికి ఆనంద్ ఎంతో సహాయం చేశా డు. కొంత డబ్బు ఈ ఓల్డేజ్ హోమ్‌కి దానం చేసింది - ఆవిడా ఇక్కడ ఒక ట్రస్టీ.

తన గది తనకు కావలసిన విధంగా మార్చింది -

ఇప్పటికీ ఆనంద్, శారద ఆమెను బ్రతి మాలుతారు - వాళ్ల దగ్గర ఉండమని.

'చూడు నాయనా మీరు నాకు ఎప్పుడూ దగ్గరే. నా హృదయంలో ఉంటారు. మీరు వస్తూ వుండండి. నేనూ వస్తూవుంటాను. మిమ్మల్ని, శ్రేయనూ చూడకుండా ఒక్కరోజు ఉండగలనా?" అంటూ ఉంటుంది.

ఇదీ ఆమె కథ - ముగించింది సుబ్బ లక్ష్మమ్మ.

అర్థంకాలేదు రంగనాయకమ్మకు - నిజమా, అబద్ధమా? అన్పించింది.

అంత ప్రశాంతమైన ముఖం వెనుక ఇంత విషాద గాథ ఉందని నమ్మలేకపోయింది. మనసులో, హృదయంలో అగ్ని పర్వతాలను పెట్టుకుని ఎంత నవ్వు ముఖంతో కన్పిస్తుంది? ఆమె గుండెలు కరిగించే విషాధ కథ ముందు - తన కష్టాలేపాటి?

శాంతమ్మ కథ ఊహించలేని నిజం... ఆమె కొడుకు, కోడలూ లేరు, మనుమరాలు లేదు... అయితే కొడుకు ఉన్నాడు, కోడలు ఉంది. మనుమరాలు ఉంది - లేనిది ఒకటే నుదిటి మీద బొట్టు. తీరని లోటు.

నాలుగైదు రోజులతరువాత తిరిగి వచ్చింది శాంతమ్మ.

రాగానే విన్నమాట - "రంగనాయకమ్మ గారు ఇంకలేరు" సుబ్బలక్ష్మమ్మ చెప్పింది.

"ఏమయింది?"

"రెండు రోజులు జ్వరం వచ్చింది. మేం కూతురి ఇంటికి ఫోన్ చేశాం. అల్లుడు ఫోన్ ఎత్తాడు.

"ముసలి వాళ్లకు చిన్న చిన్న నలతలు మామూలేకదండీ - రేపొద్దున్న వస్తాం. ఈ రాత్రి ఫ్లైట్‌కి కొడుకు, కోడలూ వెళ్లిపోతున్నారు అమెరికా" అని జవాబు చెప్పారు.

"డాక్టర్‌ని పిలిచాం"

వచ్చి చూసాడు "వయస్సు - ఎటు తిరిగినా తిరగవచ్చు" అన్నాడు.

మళ్లీ ఫోన్ చేస్తే ఎవరూ ఫోన్ ఎత్తలేదు. ఎయిర్‌పోర్ట్‌కి వెళ్ళారేమో.

"రంగనాయకమ్మగారు మామూలుగా అయిదు గంటలకు లేచే మనిషి - ఆరు గంటల వరకూ లేవలేదు. నేను లేపడానికి ప్రయత్నిస్తే - లేవలేదు - డాక్టరు వచ్చి చూసాడు - అంతా అయిపోయిందని చెప్పి వెళ్లిపోయారు. వెంటనే ఫోన్ చేసి వాళ్లకు చెప్పాం - పది గంటలకు వచ్చి భౌతికకాయాన్ని తీసుకువెళ్ళారు - ఇంటికో, ఎలక్ట్రికల్ క్రిమటోరియమ్‌కో తెలీదు"

ఇటువంటి సంఘటనలను ఎన్నో చూసిన శాంతమ్మగారికి కళ్లు చెమ్మగిల్లాయి. ఎలాంటి బ్రతుకు బ్రతికింది! చివరికి ఏ విధంగా ముగిసింది ఆమె జీవితం. ఆమెకు అందరూ ఉన్నారు - కూతుళ్లు, కొడుకు, అల్లుళ్లు, మనమలు, మనుమరాళ్లు, మునిమనుమలు - కాని ఆవిడ జీవిత ఆఖరి అద్యాయంలో, ఆఖరి క్షణంలో దగ్గర ఎవరూ లేరు. ఆఖరికి దాహం తీర్చడానికి నోట్లో నీళ్లు పోయడానికి కూడా ఎవరూ దగ్గర లేరు.

. ఇటువంటివి జీవితంలో ఎన్నో చూసింది...

ఆవిడ ఆశయం ఒకటే... తన కష్టాలను తనలోనే దాచుకోవాలి. ఇంకొకళ్లతో పంచుకో కూడదు. మన కన్నీటి చుక్కలను మరొకరికి ఇవ్వకూడదు - మన సంతోషాన్ని - మరొకరికి పంచి పెట్టాలి - కళ్లు తుడుచుకుంది. మొహం కడుక్కుంది - ఆమె దినచర్య - అదే సంతోషం పంచి పెట్టడం - ప్రారంభించింది.

ఎవరికీ తెలియని రహస్యం - శాంతమ్మ గారికి ఒక్కరికే తెలిసిన నిజం - తన తరువాత తన ఆస్తంతా శ్రేయకు చెందాలని విల్లు వ్రాసిందనే విషయం. ●

# కంప్యూటర్ విజ్ఞానం

# చందాదారులుగా చేరండి!




## అంతులేని కంప్యూటర్ 'విజ్ఞానం' మీ స్వంతం చేసుకోండి...

సంవత్సర చందా
12 సంచికలు + 3 CD లు రు. **300/-**

2 సంవత్సరాలకు
24 సంచికలు + 6 CD లు రు. **575/-**

3 సంవత్సరాలకు
36 సంచికలు + 9 CD లు రు. **825/-**

---

వివరాలకు సంప్రదించండి....

క్రిసెంట్ పబ్లికేషన్స్
29-25-43ఎ, వేమూరి వారి వీధి, సూర్యారావుపేట, విజయవాడ - 520 002
ఫోన్స్: 0866 - 5562666 / 5563666. ఫాక్స్: 0866 - 2432183
109, బి-బ్లాక్, శ్రీ దత్తసాయి కమర్షియల్ కాంప్లెక్స్, ఆర్. టి.సి. క్రాస్ రోడ్స్,
హైదరాబాద్ - 520 020. ఫోన్: 040-55619277. ఫాక్స్: 040-55639277
E-mail: info@computervignanam.net



కాశ్మీరం...

అలనాడు కశ్యప ప్రజాపతి నివశించిన కశ్యపదేశం.

పార్వతీ పరమేశ్వరుల విహార భూమి.

కిన్నర – కింపురుషాది దేవజాతుల స్త్రీ పురుషులు అలసట, విరామం ఎరుగక జీవనానందాన్ని అనుభవించిన ప్రేమదేశం.

కుంకుమ పూల అరుణ, పీత (పసుపు) వర్ణం, కన్నెల పాదాలకు పారాణి పెట్టే కామ దేశం.

ఎటు చూసినా నిశ్శబ్దాల చిగుళ్లలా కొండల మొదళ్లు

బేతవనాల సిసరు రామణీయకతలు

దేవదారు వృక్షాల మౌనజపాలు

మరి ఈనాడు...

టెర్రరిస్టుల శతఘ్ని గర్జనలతో ప్రతిధ్వనిస్తోంది.

మంచు శిఖరాలు నెత్తుటి పూలు రాలుస్తున్నాయి

ఎప్పుడు ఏం జరుగుతుందో, ఎక్కడ ఏ ఉగ్రవాది ఏ పొదమాటు నుంచి ఎ.కె. 47 పేలుస్తాడో తెలీదు. అది ఏ అమాయక ప్రాణిని చంపి వేస్తుందో ఊహకే అందదు.

విచిత్రం...

భారతదేశ చరిత్రలో కాశ్మీర దేశం సుఖ శాంతులతో నిశ్చింతగా ఉన్న క్షణాలే కనిపించవు.

సౌందర్యం మార్మికమైనది. అది రక్తాన్ని ఉబికిస్తుంది. కోరికల్ని రెచ్చకొడుతుంది. రక్తాన్నే దాహంగా తీసుకొంటుంది. ఇందుకు సాక్ష్యం యిచ్చే గాథలు, వీరకథలు, విచిత్ర సంఘటనల గురించి సూరజ్ చదివాడు, విన్నాడు, చూస్తున్నాడు. కాశ్మీరులోని ప్రతి కొండ శిఖరం,

# కిన్నెర



ప్రతి వనం, ప్రతి సెలయేరు మౌనంగా ఈ ఉదంతాన్ని చెప్పక చెప్తుంటాయి.

సూరజ్ పత్రికా రచయిత. కాశ్మీరం పరి స్థితిని, పురాణ కథల స్మృతిని రంగరించి ధారా వాహికంగా వ్యాసాలు, అనుభవాలు వ్రాయడా నికి ధైర్యం చేసి ఆ ప్రాంతాన్ని పర్యటిస్తున్నాడు.

కిన్నెర ప్రాంతమంతా తిరిగాడు, శ్రీనగర్ వద్ద శంకరాచార్య శిఖరం ఎక్కాడు. టన్‌మార్గ్, గుల్‌మార్గ్ ప్రాంతాలు పర్యటించాడు. హజరత్ బాలల్ వంటి ఇస్లామిక్ పుణ్యక్షేత్రాలూ చూశాడు. ప్రస్తుతం శ్రీనగర్‌లో మకాం చేశాడు. అక్కడి హౌస్‌బోట్స్ సంస్కృతిని పరిశీలిస్తున్నాడు.

ఎక్కడ తిరిగినా, ఎవరిని కదిపినా విషాద గంభీరంగానే ఉంది. భద్రతా భావాన్ని కోల్పోయిన ప్రజల ముఖాలు నిర్లిప్తంగా ఉన్నాయి. కాశ్మీర్ సౌందర్యం అంతా భయంతో ఘనీభవించినట్లు ఉదాసీనంగా కనిపిస్తోంది.

జీలం నదిలో వయ్యారంగా కదులుతూ తిరుగాడే హౌస్‌బోట్లు అక్కడి దారిద్ర్యానికి సంకేతాలు. భారతదేశంలో ఇంత ఎత్తున ఉన్న ఈ దేవతల దేశంలో యింత దారిద్ర్యం ఉండడం ఎవరి తప్పు?

హౌస్‌బోట్లలో రాత్రిళ్లు కాశ్మీర్ కన్నెపిల్లలు చేసే శృంగార చేష్టలు విటులకు భలే పసందుగా ఉంటాయట. ప్రేమికులు, యువ దంపతులు, రసికులు అక్కడకు ప్రేమయాత్రలకై

వస్తారు. కాని అక్కడి యువతులకు అలాంటి జీవితమే లేదు. వాళ్లవి మాంసపు బొమ్మ జీవితాలు.

బేతవనచ్ఛాయల్లో వెన్నెల వెలుగు నీడలలో హౌస్‌బోట్లలోని దీపాలు జీలం నది లోతులలోకి కాంతి గునపాలు దింపే దృశ్యాలు అక్కడి రసిక సామ్రాజ్యపు మాదకతకు నిశ్శబ్ద సాక్ష్యాలు అనిపిస్తాయి. బేత వనాల నుంచి మంచుతో బరువెక్కిన విచిత్రపూల పరిమళం యువ హృదయాలలో కోరికల కెరటాల్ని సృష్టిస్తుంది.

ఆ సాయంత్రం అంత చలిగా లేదు. కానీ మంచు బిందువులు సన్నగా రాలుతున్నాయి. సూర్యుడు నునువెచ్చగా కిరణాల్ని ప్రసరిస్తున్నాడు. అలా ఎంతసేపుంటుందో తెలియదు. మరు క్షణంలో వర్షం జల్లులు పడవచ్చు. మంచులో తడిసిన సూర్యకిరణాలు మధ్యనుంచి తెల్లటి మేఘాలమీదుగా పడే వానజల్లు దృశ్యం బాగుంటుంది.

విచిత్ర వాతావరణం నుంచి కాపాడుకొందుకు సూరజ్ మంకీ క్యాప్, మఫ్లర్ కూడా దగ్గర ఉంచుకున్నాడు.

అతనిప్పుడు ఆ కొండవాలు వెంట బేతవనం అందాల్ని, దేవదారు వృక్షాల ఔన్నత్యాన్నీ చూస్తూ అడుగులు వేస్తున్నాడు. అతనికి అక్కడ స్పష్టమైన కార్యక్రమం, పనీ ఏమీ లేవు. కాళ్లు ఎటు దారితీస్తే, కళ్లు ఎటు ఆకర్షించబడితే, మనసు ఎటు ఎగిరిపోతే అటు వెళతాడు. అంతకుముందు తనకు అనుభూతిలో కాని, అనుభవంలో కాని లేని దృశ్యాల్ని, భావాన్ని పొదివి పట్టుకోవడం అతడి ఇప్పటి పని. స్థల కాలాల స్మృతి అంతా భావంలోనే ఇమిడి ఉంది అనుకొనే ప్రకృతి ఆరాధకుడతడు.

ఆ ప్రాంతంలోని నాగజాతి యువతులకు, భారతీయ జవానులకు ఉన్న లైంగిక సంబంధాల గురించి, అవి రగిల్చిన ప్రేమ తుఫానుల గురించీ అతను ఎన్నో విన్నాడు. అవన్నీ నిజమేనా? మగవాడు ఎంత కాముకుడు? స్త్రీ నిస్సహాయస్థితిని తన అవసరానికి వాడు కోవడమే పురుష జాతిలో పశుత్వమా?

పశువులు, పక్షులు కూడా మగవే ఆడజాతివి పెత్తనం చెలాయిస్తాయి. కామ తృప్తి కోసం అవి ఏమైనా చేస్తాయి. మనిషిలోనూ ఈ పశు ప్రవృత్తి కొనసాగి వస్తున్నదా?

కాశ్మీర్ సౌందర్యంలో ఈ కామ వాసన స్పష్టంగా అనుభూతికి వస్తుంది. అక్కడకు వచ్చిన స్త్రీ పురుషుల కామచేష్టలు దీనిని కళ్లకు కట్టిస్తాయి. ఇక్కడి ఆడపిల్లలు విటులకు చక్కగా శయనసుఖాన్ని పంచిపెడతారట.

స్త్రీ పురుష సెక్స్ సంబంధాలు చాలా సహజమైనవి, ఆనందప్రదమైనవి. మరి అద్దె సెక్స్ సంబంధం పశుత్వం కాదా? ఇంద్రియ సుఖంలో ఉల్లాసం ఉంది. సుగంధం ఉంది. సహజత్వాన్ని కోల్పోయిన ఇంద్రియ స్పర్శలో ఆ పరిమళం లేదు. అది కేవలం పశువాంఛ... అంతే.

ఆలోచిస్తూ నడుస్తున్న సూరజ్‌కి ఒక కేక వినిపించింది. దేశం కాని దేశంలో, మనుషులు కాని మనుషుల మధ్య అచ్చ తెలుగులో ఆ పిలుపు అతనికి ఆశ్చర్యం కలిగించింది. క్షణకాలం నివ్వెరపోయి ఆ కేక వినవచ్చినవైపు చూశాడు.

అక్కడ ఒక యువతి ఉంది. కాశ్మీర్ దుస్తుల్లో నిలబడి, చేయెత్తి తనని పిలుస్తున్నది. అతనూ మర్యాదకోసం చేయి ఊపి వేగంగా అడుగులు వేసి ఆమె దగ్గరకు వెళ్లాడు.

అల్చిప్పల్లాంటి కళ్లు మెరుస్తున్నాయి. పెదాలకు లిప్‌స్టిక్ రంగు నిగారిస్తోంది. జుట్టు విరబోసుకుని ఉంది. ఆమెను చూడగానే సూరజ్‌కి సుబ్రహ్మణ్య భారతి అలనాడు వ్రాసిన ఒక గీతం తాలూకు భావం దృశ్యమై కనిపించింది.

"ఓ సుందర తెలుగు భామ కాశ్మీరీ తిలకం దిద్దుకుని మానస సరోవర జలకాలాడినట్లు"

అతను ఆ అమ్మాయిని కనురెప్పపాటు మరిచిపోయి అలాగే చూస్తున్నాడు. అతనికి తాను గుర్తుకు రాలేదని ఆమె గ్రహించింది.

"ఏయ్, సూరజ్ నేను కిన్నెరని" - ఆమె సుతారంగా నవ్వినపుడు బుగ్గమీద పడిన చిన్న సొట్ట ఆమెను అతనికి పట్టి యిచ్చింది.

"మరచిపోయినట్లున్నావ్. ఔన్లే... మగాళ్లు పెద్దగా మారరు. ఆడవాళ్లం కదా మార్పు బాగా వచ్చేస్తుంది."

అతను పూర్తిగా ఈ లోకంలోకి వచ్చి పడ్డాడు. ఆమె కిన్నెర. కాలేజీలో తన క్లాస్‌మేట్. కాలేజి వదిలి నాలుగైదేళ్లయింది. తను పత్రికా రచనని వృత్తిగా తీసుకున్నాడు.

కిన్నెర అందమైనది. నాజూకైనది. హుషారైనది. కలుపుగోలుతనం ఎక్కువ. ఆమె ఈ విలక్షణ వ్యక్తిత్వాన్ని తప్పుగా అర్థం చేసుకొని, చనువు తీసుకున్న ఇద్దరు ముగ్గురు కాలేజి కుర్రాళ్లు ఆమె ఒంటిమీద చేయివేయకుండానే చెంప దెబ్బ తిన్నారు. కిన్నెర అన్ని యాక్టివిటీస్‌లోనూ పాల్గొనేది.

"ఆమెతో స్నేహం ఎండమావిలో నీటి కోసం ఆరాటం. నీళ్లులేని ఒయాసిస్సు వెంట పరుగు" అని తానే ఒకసారి వ్యాఖ్యానించాడు కూడాను.

కాలేజి వదిలాక ఆమె ఏమయిందో తనకు తెలియదు. తెలుసుకోవలసినంత అవసరం ఏమీ లేదు. తను మాత్రం రచయితగా, కథా రచయితగా ఈ నాలుగైదేళ్లలో బాగా పాపులర్ అయ్యాడు.

"రా మాబోట్‌కి వెళ్దాం. అదిగో అదే కిన్నెర అతని సమాధానానికి ఎదురుచూడకుండా ఒక అడుగు ముందుకు వేసింది.

"నువ్విక్కడ?" సూరజ్ ఆమె వెనుక అడుగు వేస్తూ అడిగాడు.

"ఆ ప్రశ్న నిన్ను నే వేస్తున్నాను" - అందామె ముందుకు నడుస్తూ.

"ఏం ఉంది? కథలూ, పత్రికా రచనలూ చేస్తున్నాను"

"చదువుతూనే ఉన్నాను"

ఈసారి కాశ్మీరీ నేపథ్యంలో వార్తా కథనం, కథా కథనం చేయాలని వచ్చాను. తిరుగుతున్నాను.

"నువ్వేం మారలేదు అలాగే ఉన్నావ్. అందుకే గుర్తు పట్టగలిగాను. కిన్నెర వెనక్కు తిరగలేదు. ముందుకు తన హౌస్‌బోట్ వైపు నడుస్తూనే ఉంది. మాట్లాడుతూనే ఉంది.

కాలేజి రోజుల్లో పొందికగా ఉండిన ఆమె ఒళ్లు ఇప్పుడు కొంచెం పెరిగింది. నడకలో ఆమె కదలికలు కండరాల సడలింపుని సూచిస్తున్నాయి.

"పెయింటింగ్స్ వేస్తున్నావా, మానేశావా?" సూరజ్ ప్రశ్నించాడు.

"వేస్తున్నా అందుకే ఇక్కడకు వచ్చాను. ఈ శరత్కాలంలో కాశ్మీరీ సౌందర్యం భలే గమ్మత్తుగా ఉంటుంది. పురి విప్పిన అందాల వన కిన్నెర వలె ఉంటుంది కాశ్మీరం. కిన్నెర మాటలు చురుగ్గా ఉన్నాయి.

"ఔను, అది సరే... కూడా ఎవ్వరూ రాలేదా?" సూరజ్ ప్రశ్నించాడు.

"మా వారితో వచ్చాను"

"మీ వారా?"

"ఆ చెప్పలేదు కదూ. నాకు రెండేళ్ల క్రితం పెళ్లి అయింది. ఆయన మిలటరీ ఆఫీసర్. అంబాలా కంటోన్మెంట్‌లో. సెలవు పెట్టి వచ్చాం. వచ్చిన రెండు రోజులకే కబురు వచ్చిం

ది వెళ్లారు. వస్తారు" - కిన్నెర కలుపు గోలు తనంతో ఏ మార్పూ లేదు. ఇంకా కాలేజి పిల్ల లానే అనుకొంటున్నట్లుంది.

"ఐ.సీ. సూరజ్ ముక్తసరిగా అన్నాడు."

"ఎలా ఉందిక్కడ?" కిన్నెర అడిగింది.

"ఇంత అందమైన ప్రదేశంలో యిలాంటి పేదరికం?" అని మరి ఆగిపోయాడు సూరజ్. అతని మాటల్లో కాశ్మీరీ కన్యల దీన స్థితిపై దిగులు వ్యక్తం అయింది.

"నీకింకా భావుకత్వం పోలేదన్నమాట? నువ్వింకా వాస్తవ జగత్తులోకి రాలేదన్నమాట?" కిన్నెర తేలికగా అంది.

"ఆర్ద్రతని, భావుకత్వాన్నీ కోల్పోతే మనిషికి, పశువుకీ తేడా ఏం ఉంది?" సూరజ్ తటాలున అనేశాడు.

అతని మాటలకి కిన్నెర తటాలున ఆగి, వెనక్కి మార్మికంగా చూసింది. ఏమీ మాట్లాడక నడక సాగించింది.

ఆమె వెనక్కి చూడడం వింత అనిపించలేదు కానీ ఆమె ముఖంపై ఘనీభవించిన మహా మౌనం అతనికి ప్రశ్న అయింది. కొద్ది అడుగులు వేసే సరికే హౌస్‌బోట్ వచ్చేసింది.

హౌస్‌బోట్‌లో అంతా చక్కగా ఉంది. అలంకరణలో ఆడంబరం లేదు కానీ ఆకర్షణ ఉంది. సౌందర్యం, ఆధునికతల మిశ్రమంగా ఆ దృశ్యాలున్నాయి. ఆ పెయింటింగ్‌లలో చాలా భాగం కిన్నెర వేసినవే.

కాలేజిలో కిన్నెర సామాజిక సమస్యలు, వరకట్నం చావులు, ధనిక పేద భేదాలు గురించి ఆవేశంగా మాట్లాడేది. భావ విప్లవం రావాలని, సామాజిక సంస్కరణలు జరగాలనీ వాదించేది. ఇప్పుడామె వ్యవహారణ అలా లేదు. జీవితంలోని సుఖాల్ని కౌగలించుకోవాలనే తపన కనిపిస్తోంది. బ్రతుకును అర్థవంతం చేసుకోవాలనే కాంక్ష ద్యోతకం అవుతోంది.

హౌస్‌బోట్‌లోని డ్రాయింగ్‌రూమ్ మాత్రం చాలా ఆడంబరంగా ఉంది. ఈ నాటి యువతులు కోరుకునే జీవితం అక్కడ సాక్షాత్కరిస్తోంది. అక్కడి అలంకరణ వస్తువులుగా ఉన్న చిన్ని చిన్ని సంగీత పరికరాల్ని, పుస్తకాల్ని చూసి కిన్నెర చెప్తున్న మాటలు పెద్ద హిపోక్రసీగా అనిపిస్తున్నాయి తప్ప వాటికి మనిషి జీవితంలో ఒక ఉనికి, సార్థకత ఉన్నాయనే నమ్మకం ఆమెకు ఉన్నట్లు అనిపించడం లేదు. ఆనాటి కిన్నెరకు, నేటి కిన్నెరకూ ఎంత తేడా? ఆమె గురించిన సూరజ్ భావాలు జీలం నదిలో కెరటాల వలె చెదిరి కరిగిపోతున్నాయి.

ఎలాంటి సంకోచం లేకుండా కిన్నెర తమ బెడ్‌రూమ్‌ని అతనికి చూపింది. ఆ పరిసరాల్ని అలవాటు చేసుకొనేలోగానే ఆమె వేసిన ప్రశ్న అతనికి 'చళుక్' అని తగిలింది.

"ఇంతకీ పెళ్లి చేసుకున్నావా లేదా?" ఆ బెడ్‌రూమ్ తలుపు అవతలకు వెళుతూ కిన్నెర ఈ మాట అంది.

"చేసుకున్నా, అదొక రెక్. మా ఇద్దరికీ సరిపడలేదు దట్సాల్" సూరజ్ నిరాసక్తంగా అనేసి ఆ గదిని పరీక్షించసాగాడు. కిన్నెర అక్కడ నుంచి వెళ్లిపోయింది.

ఆ గది, గదిలో బెడ్... ఇద్దరు మనుషులకు హాయిగా, ఏకాంతంగా ఉండటానికి పరిమితమైన కొలతలతో ఉంది. ఆ గది కర్రగోడలకు శృంగార భంగిమల చిత్రాలు అలంకరించి ఉన్నాయి. నిజానికి ఏ స్త్రీకాని, ఏ పురుషుడు కాని తమ పడక గదిని అంత ఓపెన్‌గా బయటి వారికి చూపిస్తారా. ఏమో, తనకు అలాంటి సందర్భం తటస్థపడలేదు. ఆ అవకాశం, అవసరం రాలేదు. మరి కిన్నెర ఎందుకు చూపిస్తోంది.

ఆమె అంతర్యం ఏమిటి?

ఆధునిక భావాలు మనిషిని శాపగ్రస్తుడిని చేశాయా? ప్రతి క్షణాన్నీ తన ప్రైవేటు ఆస్తిగా మార్చుకోవాలనుకునే స్వార్థచింతనలోకి మనిషిని నెట్టివేసిందా యీ యాంత్రిక నాగరికత? వృత్తికి, ప్రవృత్తికీ బానిస అయిన ఆధునిక మానవుడు సహజత్వాన్ని మరిచిపోయి, దొంగ వలె ప్రవర్తిస్తున్నాడు. గుట్టుగా ఉండాలనుకొంటున్నాడు. తన వైయక్తిక జీవితం ఎవరికీ తెలియకూడదనుకొంటున్నాడు. కిన్నెర అలా కాక తన ప్రైవేట్ లైఫ్ గురించి పరోక్షంగా పరిచయం చేస్తూ చాలా సహజంగా ప్రవర్తి స్తోంది. క్షణకాలమే 'నిజం' అదే తన నిజమైన ఉనికి అని ఆమె భావిస్తున్నట్లుంది.

"నిన్న లేదు

రేపు తెలీదు

నేడు నిజమైనది"

– అన్న ఉమర్ ఖయ్యామ్ జీవన తత్వాన్ని కిన్నెర వంటబట్టించుకున్నట్లుంది. అతని ఆలోచనలతో నిమిత్తం లేకుండా ఆమె టీ తయారుచేస్తోంది. సూరజ్ ఆ గదిలోంచి డ్రాయింగ్ రూమ్‌లోకి వచ్చాడు. అక్కడి టీపాయ్‌పై కొన్ని పాత పత్రికలున్నాయి. చిన్న స్టాండ్‌కి అగరువత్తులు వెలిగించి పెట్టినట్లుంది. అవి కాశ్మీరాగరు వాసనని, కుంకుమపూల పరిమళాన్నీ కలుపుకొన్న మాదకతలో – ముందుగా పొగని ప్రసరిస్తున్నాయి.

ప్రక్కగా చిన్న స్టూల్‌పై ఫ్లవర్‌వాజ్ ఉంది. వాటిలో తాజా పూలున్నాయి. కాని వాటిపై ఎవరికీ ప్రేమ ఉన్నట్టు లేదు. కాళ్లు విరిచి ఫ్లవర్‌వాజ్‌లో వాటిని బంధించినట్లు దీనంగా ఉన్నాయి.

కిన్నెర టీ తెచ్చి ఇచ్చింది. ఈసారి ఆమెలో, ఆమె చూపులలో ఇదివరకటి నైర్మల్యం లేదు. ఆమె ఏదో భావావేశానికి గురి అయినట్లు కనిపిస్తోంది.

"మరి నీకో, సూరజ్ టీ త్రాగబోతూ ఆగి అడిగాడు

"తర్వాత తాగుతాను. నువ్వు త్రాగుతుండు ఇప్పుడే వస్తా" అని కిన్నెర రివ్వున వెనుదిరిగి డెక్‌పీదకు వెళ్లే మెట్లు ఎక్కసాగింది. సూరజ్ అక్కడి కిటికీలోంచి బయటకు చూశాడు. మేఘాలు ఆవరిస్తున్నాయి. ఇంతసేపు ఆ బోట్ హౌస్‌ని చూసే ధ్యాసలో పరిసరాల్ని గమనించనే లేదు. కిన్నెర ఎందుకు తన నుంచి ఆ సమయంలో తప్పించుకుని వెళ్లిందో అతనికి అర్థం కాలేదు. తానూ డెక్‌పైకి వెళ్తే...? టీ త్రాగమని ఇచ్చి ఆమె వెళ్లిందీ అంటే తనతో రావడం ఆమెకు ఇష్టం లేదనేగా? సూరజ్ గబగబా టీ సిప్ చేశాడు. ఆమె వచ్చేవరకూ కాలక్షేపం కోసం అక్కడి అలమారాను తదేకంగా ఈసారి పరిశీలించాడు. దానిలో ఏదో ఒక ఇంగ్లీషు పత్రిక కనిపిస్తోంది. సూరజ్ ఆసక్తిగా ఆ పత్రికని బయటకు లాగాడు. అది ఇంగ్లీష్ సెక్స్ పత్రిక. స్త్రీ పురుషులు ఏకాంతంలో చూసుకొనే బొమ్మలు దానిలో చాలా ఉన్నాయి. పురుషుల నగ్న చిత్రాలకన్నా స్త్రీల నగ్నచిత్రాలు ఎక్కువగా ఉన్నాయి.

ఒక స్త్రీ వ్యక్తిగత జీవితంలోకి ఇలా రహస్యంగా ప్రవేశించడం ఒక తప్పు. అయితే అలాంటి పుస్తకాన్ని తెరవడం మరీ పెద్ద తప్పు అనుకున్నాడు సూరజ్.

ఆ బొమ్మలన్నీ యవ్వనం నిగారింపుతో, కామ భంగిమలతో మత్తిల్లిన స్త్రీల దిగంబర చిత్రాలే. అందం, ఆరోగ్యం, స్తనద్వయం, ధృఢ కటి వలయసీమలతో నిగారిస్తున్నవే. స్త్రీని నగ్నంగా చూస్తుండాలన్న పురుషుడి బలహీనత సూరజ్‌కీ ఉంది. అలాంటి బలహీనుల కోసమే ఆ పుస్తకం. కిన్నెర, ఆమె భర్త ఈ పుస్తకాన్ని...?

సూరజ్ దొంగచూపులతో దానిలోని స్త్రీల నిలువెత్తు సౌందర్య భాగాల్ని తనివితీరా చూశాడు. వెంటనే ఆ పుస్తకాన్ని తీసినచోటనే ఉంచేసి ఏమీ తెలీనట్లు అక్కడ కుర్చీలో కూర్చున్నాడు. ఇంతలో టప టప మని వాన ప్రారంభమై నిమిషం తిరక్కుండానే పెద్ద జల్లు పడ సాగింది. కాశ్మీరం ప్రకృతి వింతే అంత.

కిన్నెర డెక్ మీద నుంచి వచ్చేయాలే? వాన తగ్గితే కాని తాను తన హౌస్‌బోట్‌కి వెళ్లలేడు. చీకటి పడిపోతే అక్కడకు వెళ్లడం మరీ కష్టం.

కిన్నెర రానే వచ్చింది. ఆమె పొడవాటి జుట్టుకొసల నుంచి వాన చినుకులు ముత్యాల్లా రాలి పడుతున్నాయి. అంతగా ఆమె తడిసిందన్నమాట. చలికి ఆమె కొంచెం వణుకుతోంది. ఒంటికి అతుక్కుపోయిన బట్టలలోంచి ఆమె కండరాలు తమాషాగా కనిపిస్తున్నాయి. పెదాల మీద లిప్‌స్టిక్ కరిగిపోయింది. సూరజ్ ఆమెని ప్రశ్నార్థకంగా చూస్తూ ఉన్నాడు.

"పైన బట్టలు ఆరేశాను. తీద్దామని వెళ్లాను... ఇంతలోనే జల్లు... బాగా తడిశాను" ఆమె చాలా సాదాగా అంది.

ఆమె అబద్ధం చెబుతోందని అర్థం అవుతోంది. ఎందుకంటే ఆమె చేతుల్లో బట్టలేం లేవు. పై నుంచి ఆమె ఏం తేలేదు.

కిన్నెర బెడ్‌రూమ్ వైపు వెళ్లిపోయింది. ఒక పురుషుడితోటి ఒంటరితనం ఆమెలో అక్కరలేని భయాన్ని కలిగించింది. అందుకే ఆమె పైకి వెళ్లిపోయింది. అంటే తన సాన్నిధ్యంలో ఆమె నిగ్రహాన్ని కోల్పోతోందా? అందుకే తప్పించుకుని పైకి వెళ్లి, క్రిందకు వచ్చి అబద్ధం చెప్పానన్న భావం కలగడంతో కొంచెం సిగ్గు పడింది. ఈ భావాలేం తెలియకుండా లోపలకు వెళ్లిపోయింది. ఇదంతా కృత్రిమత్వం కాదా? సమాజం విధించిన స్త్రీ పురుష సంబంధాల పంజరంలో ఇలాంటి విషమ ఘడియ వచ్చినప్పుడు కృత్రిమత్వం పొరలు ఛేదించబడ తాయి. సహజత్వం వేయి రెక్కలు విప్పుతుంది.

సూరజ్ ఆలోచనలు పూర్తి కానేలేదు. కిన్నెర దుస్తులు మార్చుకు వచ్చింది. మొగలి రేకు రంగుచీర అదే రంగు అంచు జాకెట్‌లో ఆమె మొగల కన్యలాగానే ఉంది. స్త్రీ సౌందర్యం మొగలి పూవు వంటిదైతే సమాజ నియమాలు దానిచుట్టూ ఉన్న ముళ్ల వంటివి. ఇప్పుడు కిన్నెర స్థితి అదే అయితే ఆమెలో కృత్రిమత్వం లేదు. కలుషిత భావాల రంగులూ లేవు. వాన కడిగిన నంది వర్ధనంలా ఉందామె ముఖం. ఈసారి సూరజ్‌ని మాట్లాడనివ్వలేదామె... తానే మాట్లాడింది.

"సూరజ్... చెప్పడానికి ఎంతైనా ఉంది. కానీ నేను ఒక లతవలె చెట్టుకు అల్లుకుపోయిన దానిని. ఇప్పుడు నాలో ఆనాటి కలలు లేవు, భావనలు లేవు, కల్పనలు లేవు. ఇప్పుడు నా రూపం ఒక భార్య. నా కలలు ఒక గృహిణి అంతే. కాని నేను ఒక స్త్రీని అని ఆలోచించే అవకాశమే లేదు.

"భార్యాభర్తలు రోజులో కొన్ని గంటలు అయినా తమ దాంపత్య జీవితపు భావాల పంజరంలోంచి బయటకు వచ్చి స్త్రీ పురుషులం అని జీవించగలిగితే తమవైన కల్పనలతో జీవించగలిగితే ఆ బ్రతుకు ఎంత మధురంగా ఉంటుందో, ఇద్దరి కోరికలు చాలావరకూ తీరుతాయి. ఆత్మ వంచన నుంచి, సందిగ్ధ సంకుచితత్వం నుంచి మనం విముక్తులం అయితే ఎంత బాగుంటుందో"

తళుకు కళ్ల చురుకుతో సూరజ్‌ని, అతని మనసునీ గాయపరచి కిన్నెర మరలా ఇలా అంది.

"పురుషుడి కోర్కెల సర్పబంధం నుంచి స్త్రీ

విముక్తం అయిందనే భావన ఎంత వూరట కలిగిస్తుందో, అలాగే స్త్రీని చర్మం స్పర్మల మాంసం ముద్దగా, బొమ్మగా, కన్నీటి కడలిగా కాక ఒక ఆత్మచైతన్య వ్యక్తిగా పురుషుడు ఆరాధించగలిగితే ఆ జన్మకి ఎంత సార్ధకత? ఆ దశలో స్త్రీ పురుషులు ఏ స్వచ్ఛ గంధర్వ లోకాలలోకో ఎగిరిపోతారు. స్వర్గద్వారాలను తెరిచిన వారవుతారు. అప్పుడు జీవితం ఎంత రుచివంతం, ఎంత సౌందర్యవంతం అవుతుందో ఆలోచించు. సూరజ్... నేను అబద్ధం చెప్తున్నానా? చెప్పు... నేను అబద్ధం చెప్తున్నానా?"

కొన్నెర భావావేశంతో కదిలిపోయింది. సూరజ్ రెండు భుజాలూ పట్టుకొని కుదిపేసింది. చివరి మాటనే పదేపదే అంది. ఆమె కళ్ళు ఇప్పుడు నక్షత్ర కాంతుల్ని వెదజల్లుతున్నాయి.

బలహీనతల నుంచి బయటపడి సత్యాన్ని అంగీకరించడానికి ఎంత సంస్కారం, ఎంతటి సాహసం కావాలి? అవి కిన్నెరకు ఉన్నాయి. కిన్నెరలో ఉన్నాయి. వజ్రంతునకల వంటి ఆమె మాటల జడిలో తడిసిన సూరజ్ ఆరాధనగా, గౌరవంగా కిన్నెర ముఖాన గట్టిగా ముద్దు పెట్టాడు అంతే... వాన వెలిసింది... ఆమె శాంతించింది. సూరజ్ కెమెరా, మంకీకాప్, మఫ్లర్ తీసుకుని మసక వెన్నెల వ్యాపిస్తున్న దారుల వెంట నడుస్తున్నాడు.

ఆ వెన్నెల ఎంతోసేపు లేదు. బేతవనం అంతా చీకటి అలుముకుంది.

ఆరిపోయిన రాక్షసి బొగ్గుపొడి పామినట్లు కారుచీకటి వ్యాపించింది. ఆకాశంలో మేఘాలు బరువుతీరిన తేలికతనంతో పరుగుపెడుతున్నాయి.

చలి పెరుగుతోంది. పెద్ద పెద్ద అడుగులు వేసుకుంటూ సూరజ్ తన హౌస్‌బోట్‌ని సమీపిస్తున్నాడు.

ప్రవహిస్తున్న జీలం నది ఒడ్డున మౌనంగా నిలిచిన కొండ శిఖరాలు బేతవనం, దేవదారు వృక్షాలు, విశ్రమించిన జల పక్షులవలె హౌస్ బోట్లు. వాటిలో ఎందరో కన్నెల జీవితాలు రక్త స్థాపితాలు అవుతాయి. వారి కళ్లల్లో పవిత్రత ఒక భ్రమ వలె కన్నీటి పొరగా తారట్లాడుతోంది. ఇప్పుడు హౌస్‌బోటుల్లో కన్నెలు ఏ అజ్ఞాత కామాంధుల కౌగిలిలోనో నలిగి పోతూంటారు. అది వారికి ఇష్టంలేని తప్పని సరి మదనక్రీడ.

కిన్నెర... కోరే స్వేచ్ఛలోని అంతరార్థం ఏమిటి?

హౌస్‌బోట్ పైకి ఎక్కి సూరజ్ ఆలోచిస్తూ కలియజూశాడు. జీలం నది చీకటి మడుగుని చూశాడు.

నిద్రిస్తున్న బస్తీ...

దీపాల బంగారు కాంతిలో జీలం నది నిశ్శబ్ధం.

నదీ తరంగాలపై జీవితాల నీడలు...

నిద్రిస్తున్న మనిషి ముఖం మీది నైర్మల్యం వలె జీలం నదిని శాంతి, అమాయకత్వం ఆవరించాయి. ఇప్పుడు అక్కడ ఆ నిశీధిలో కృతకాలైన మానవ విలువలు లేవు. అంతా సహజత్వం. అంతా నిశ్శబ్ధం. ●

## గుర్తించలేమా?

కొత్తగా పెళ్లైన వసుంధర తన భర్తతో బజారు నుంచి తిరిగివస్తూండగా దారిలో చిన్ననాటి మిత్రురాలు లక్ష్మి కనిపిస్తే పలకరించింది.

బిక్కమొఖంతో దిక్కులు చూస్తున్న తన భర్తని పరిచయం చేస్తూ 'వీరే మావారు' అంది.

దానికా మిత్రురాలు 'పోదూ బడాయి! ఆ మాత్రం కనుక్కోలేనా ఏంటి?' అన్నది సమాధానంగా.

అర్ధరాత్రి. అప్పుడే రెండు గంటలు కొట్టింది గడియారం. మనోజ్ఞకు హఠాత్తుగా మెలకువ వచ్చింది. "అబ్బ... ఒళ్ళంతా నొప్పులుగా ఉన్నాయే... అమ్మో ఏమిటీ శ్వాస ఇంత వేడిగా వస్తోంది... జ్వరం వచ్చిందా తనకు...?

"అబ్బ... ఒళ్ళంతా మంటలు, వేడి. నిప్పుల మధ్య ఉన్నట్లుంది. ఎటూ కదలనివ్వకుండా ఇంత నొప్పులుగా ఉందేమిటి శరీరమంతా...?

"అమ్మా..."

ఎవరో చల్లని హస్తం తన నుదిటి మీద పెట్టారు. ఇప్పుడు కొద్దిగా హాయిగా ఉంది. ఉడుకులాన్ పట్టీకూడా పెడుతున్నారు. కళ్ళు తెరిచి వారెవరో చూడాలని ప్రయత్నించింది మనోజ్ఞ. కానీ కళ్ళు తెరిపిడి పడడం లేదు. అవి కూడా మండుతున్నాయి. చేతితో తడిమి చూడాలనుకుంది గానీ, అదీ సాధ్యమవలేదు. ఆ వ్యక్తెవరో ఇప్పుడు తన అరి పాదాలు నెమ్మదిగా రాస్తున్నారు. ఇప్పుడు కూడా హాయిగా ఉంది. ఎవరో మెల్లగా తన శిరస్సు నిమురుతున్నారు.

"ఎవరు...? ఎవరు...?"

"అమ్మ...! ఔను నిజంగా అమ్మే..."

"ఔను. ఖచ్చితంగా అమ్మదే ఆ స్పర్శ..."

"కానీ, ఎప్పుడో పన్నెండేళ్ళనాడు, తనకు ఎనిమిది సంవత్సరాల వయస్సులో చనిపోయిన అమ్మ... ఎలా తిరిగి వచ్చింది...? తనకు జ్వరంగా ఉన్నదని, చాలా బాధ పడు తోందనీ వచ్చిందా...! లేక తనే అమ్మ దగ్గరకు వెళ్ళిందా ...?"

ఉలిక్కిపడి, చటుక్కున కళ్ళు విప్పి చూసింది



మనోజ్ఞ. పైన ఫ్యాను తిరుగుతోంది. గదిలో లైటు వెలుగుతోంది. లేదు తను చనిపోలేదు. మంచం మీద పడుకుని ఉంది.

లైటు వెలుగు చూడలేక, గబుక్కున కళ్ళు మూసుకుంది మనోజ్ఞ. అనుమాన నివృత్తి కోసం అన్నట్లు, "అమ్మా..." అని పిలిచింది మెల్లగా.

"ఏమ్మా ఏం కావాలి...? నేనిక్కడే ఉన్నా. భయపడకు..." అని బదులిచ్చింది ఒక స్వరం. సందేహం లేదు. ఆ గొంతు కూడా అమ్మదే. కానీ... ఇదెలా సాధ్యం..."

"చనిపోయిన అమ్మ ఎలా తిరిగి వస్తుంది...? లేక అమ్మ మరణించడం అబద్ధమా...? మరయితే, అప్పుడు అందరి ఏడుపులు, పాడె గట్టటం, అమ్మకు దండలు వేసి దాని మీద పడుకోబెట్టడం, తీసుకువెళ్లి పోవడం, అవన్నీ ఏమిటి...?"

"మరి... ఇప్పుడూ అమ్మే..."

"అయితే, అమ్మ చనిపోవడం నిజం కాదా ...? లేక అమ్మ ఇన్నాళ్ళూ ఎక్కడో దాక్కుని ఉండి ఇప్పుడు తిరిగి వచ్చిందా...?"

"అమ్మ కోసం తను ఎంత ఏడ్చింది... ఎంతగా అల్లాడిపోయింది... ఎంత బెంగ పడింది...? అయినా అమ్మా మనూ... నీకోసం నేనున్నాను. నీకేం భయం లేదు..." అని చెప్పిన వాళ్ళు ఒక్కరూ లేరు.

"వదినకు ఎంతసేపూ అందరూ తనమాట వినాలనే పట్టుదలే తప్ప ప్రేమ, అభిమానం చూపించడమే తెలియదు. అన్నయ్యా అంతే. నాన్న కూడా అంతే. అమ్మే మంచిది. నన్ను ప్రాణంగా చూసుకుంటుంది. మళ్ళీ ఈసారి అమ్మను వెళ్ళనీయకూడదు. అమ్మ నా దగ్గరే ఉండాలి... ఔను నా దగ్గరే ఉండిపోవాలి. అమ్మ... అమ్మ..."

జ్వరం కొద్దిగా జారడంతో మత్తుగా నిద్ర పోయింది మనోజ్ఞ.

తిరిగి ఆమెకు మెలకువ వచ్చేసరికి, వళ్ళు కొంచెం తేలికగా అన్పించింది. ఎవరివో మాటలు విన్పిస్తున్నాయి.

"ఏమిటమ్మా... రాత్రంతా అలాగే కూర్చున్నావా... కొద్దిసేపు కూడా పడుకున్నట్లు లేదే ...?"

అది తన భర్త సంజయ్ గొంతు.

"లేదురా, రాత్రి తనకు జ్వరం బాగా వచ్చింది. ఒళ్లు నెప్పులు, తలనెప్పితో చాలా బాధపడింది. ఏమిటేమిటో కలవరించింది. టాబ్లెట్స్ వేశాను. మూడు దాటాక కాబోలు... కొద్దిగా నిద్ర పట్టింది తనకి.

అది తన అత్తగారి గొంతు.

"అంటే... అంటే... రాత్రంతా తనకు కణతలు రుద్ది, పాదాలు వత్తీ రకరకాల సేవలు చేసింది తన అత్తగారా...? తను మొహమైనా చూడడానికి ఇష్టపడని తన అత్తగారా...?"

"తను ఎంత పాపిష్టిది...?"

వెక్కి వెక్కి ఏడుస్తున్న శబ్దం విని, త్రుళ్ళిపడి మనోజ్ఞ మంచం దగ్గరకు వచ్చారు తల్లీ కొడుకులు.

"ఏమ్మా... మళ్ళీ జ్వరం పెరిగిందా... ఒళ్ళు నెప్పులుగా ఉన్నాయా...? అరుంధతి గాబరాగ్గా దగ్గరకు వచ్చి, నుదురు తాకి చూసింది.

"లేదన్నట్లు" తల తిప్పింది కానీ మనోజ్ఞకు దుఃఖం ఆగడం లేదు. ఆమె ఎందుకు ఏడుస్తోందీ అర్థంగాక ఇద్దరూ తెల్లబోయారు.

తనకు తనే తెప్పరిల్లిన మనజ్ఞ "వెళ్దామా...?" అని అడిగింది భర్తను ఉద్దేశించి.

"ఎక్కడికి...?" ఇద్దరూ ఒక్కసారే అడిగారు ఆదుర్దాగా.

"నర్సింగ్ హోమ్‌కి..."

"ఎందుకమ్మా... జ్వరం తగ్గిపోయిందిగా, ఒంట్లో ఏమయినా బాధగా ఉందా...?" మనోజ్ఞ ప్రక్కనే మంచం మీద కూర్చుని, ఆమె వెంట్రుకలు సర్దుతూ ఆప్యాయంగా అడిగింది అరుంధతి.

"కాదత్తయ్యా... వంద డిగ్రీల జ్వరం వచ్చినా, మా వాళ్ళు నన్ను తీసుకువెళ్ళి ఆ నర్సింగ్ హోమ్‌లో పడేసేవాళ్ళు. లేకపోతే నాకు చాకిరీ ఎవరు చేస్తారు...?" చెప్తూంటే మళ్ళీ ఏడుపు పొంగుకొచ్చింది మనోజ్ఞకు.

"పిచ్చితల్లీ... నేను లేనూ... ఈ మాత్రానికే హాస్పిటల్లో జాయినవ్వాలా... ఎలాగూ ప్రతి రోజూ డాక్టర్‌గారొచ్చి చూస్తారు గదా... ఏమంటావు..." అన్నది అరుంధతి థర్మా మీటరు తెస్తూ.

"మీ ఇష్టం అత్తయ్యా..." అన్నది మనోజ్ఞ తేటపడిన మొహంతో. ఆమెకు హాస్పిటల్ అంటే ఎలర్జీ. "వేణ్ణీళ్ళు తెస్తాను" అంటూ అరుంధతి అవతలకు వెళ్ళగానే, దగ్గరకు వచ్చిన సంజయ్‌ను చుట్టేసి, మళ్ళీ బావురు మంది మనోజ్ఞ.

"ఛ, ఊరుకో, ఈ కాస్త జ్వరానికే ఏడుస్తారా ఎవరైనా..." నవ్వుతూ అన్నాడు సంజయ్.

"జ్వరం వచ్చినందుకు కాదు నా బాధ..." అన్నది కానీ, ఎందుకో చెప్పలేకపోయింది.

హాట్ వాటర్‌తో మనోజ్ఞ మొహం కడుక్కునేందుకు సాయం చేసి, బట్టలు మార్పించి, కొద్దిగా బ్రెడ్ తినిపించి, వేడి పాలతో టాబ్లెట్స్ మింగించి, కొద్దిసేపు హాయిగా పడుకోమ్మా మనూ, లేచేసరికి పూర్తిగా తగ్గిపోతుంది..." అని చెప్పి, తలుపు దగ్గరగా వేసి వెళ్ళిపోయింది అరుంధతి.

"అంటే... రాత్రి అమ్మ రావడం, నన్ను అక్కున చేర్చుకోవడం... అంతా తన భ్రమా...? జ్వర తీవ్రతలో అత్తగారి స్పర్శనే నేను అమ్మ అని భ్రాంతి పడ్డానా...?"

"అమ్మ ఉన్నా, ఇంతకన్నా ప్రేమగా, శ్రద్ధగా చెయ్యలేదేమో...?"

"ఇన్నాళ్ళూ ఈ దేవతనా నేను దూరం చేసుకోవాలనుకున్నది...?"

మనోజ్ఞ ఎనిమిదేళ్ళ వయసులో ఉండగా, ఆమె తల్లి పార్వతి మరణించింది. మనోజ్ఞకు ఒక అన్న ప్రసాద్. పదమూడేళ్ళవాడు. రెసిడెన్షియల్ స్కూల్లో చదువుతున్నాడు. తండ్రి రాజారామ్‌గారు మళ్ళీ వివాహమయితే చేసుకోలేదు గానీ, బొత్తిగా పిల్లల మంచి చెడులు చూసేవాడు కాదు. అసలు పిల్లల్ని ఆప్యాయంగా దగ్గరకు తీసుకోవడమే ఆయనకు తెలియదు. చాలా భారీగా క్లాత్ బిజినెస్ చేసేవాడు. అందులోనే ఆయనకు ఊపిరి సలపనంత పని ఉండేది.

లంకంత ఇంటిలో మనోజ్ఞ ఒంటరిగా బిక్కు బిక్కు మన్నట్లు ఉండేది. వాళ్ళకు బంధువులు తక్కువ. అమ్మమ్మ, నాయన మ్మలను కూడా ఆమె ఎరుగదు. వంట మనిషి పెట్టింది తిని, స్కూల్‌కి వెళ్ళి వచ్చి, ఏకాకిలా తన గదిలో కాలక్షేపం చేసేది. ఏమిటో మరి... ఆ అమ్మాయికి స్నేహితులూ లేరు. చదువు మీద కూడా పెద్దగా ఇంట్రెస్ట్ లేదు. తండ్రి మాదిరే అన్న ప్రసాద్ కూడా. చెల్లెలు అని ప్రేమ, అభిమానం చూపేవాడు కాదు. ఆ ఇంట్లో ఎవరి గది వాళ్ళది. ఎవరికి ఆకలి వేస్తే వారు డైనింగ్ రూమ్‌కి వెళ్ళి, వంట మనిషిచేత పెట్టించుకు తినేవాళ్ళు. అలా సంవత్సరాల తరబడి ఒంటరితనం అలవాటయిపోయింది మనోజ్ఞకు.

అలాగే పదేళ్ళ కాలం గడిచిపోయింది. ప్రసాద్‌కు పెళ్ళి అయి, వదిన రమ్య కాపురానికి వచ్చినా మనోజ్ఞ స్థితిలో మార్పేమీ రాలేదు.

మామగారు ఇచ్చిన అలుసుతో రమ్య మనోజ్ఞపై అభిమానం కన్నా, అధికారం ఎక్కువ చూపించేది. ఆమెకు అది నచ్చేది కాదు.

మనోజ్ఞకు సంజయ్‌తో పెళ్ళి అయింది. వాళ్ళది కూడా అదే ఊరు. అతను ఇంజనీరింగ్ కాలేజిలో లెక్చరర్. అతని తండ్రి ప్రభాకర్ రైస్ బిజినెస్ చేస్తారు. ఒక చిన్న తమ్ముడు ధనుంజయ్. ఫస్ట్ క్లాస్ చదువుతున్నాడు. మధ్యలో ముగ్గురు పిల్లలు చనిపోవడంతో అన్నదమ్ముల మధ్య వయసులో అంత ఎడం వచ్చింది.

పెళ్ళి అయి మూడు నెలలు దాటింది. మంచి రోజు చూసి, కాపురానికి పంపడి అన్నారు మనోజ్ఞ అత్తవారు. ఆ సంగతి కూతురికి చెప్పాడు రాజారామ్. ఆమె ఏమీ మాట్లాడలేదు. తన డ్యూటీ అయిపోయినట్లు వెళ్ళి పోయాడు ఆయన.

ఇది జరిగిన నెల రోజులకు మనోజ్ఞ అత్తగారు అరుంధతి బాత్‌రూమ్‌లో కాలుజారి పడిపోయింది. కాలు ఫ్రాక్చరయి చాలా నెప్పి చేసింది. సిమెంట్ కట్టువేసి, ఒక నెల రోజులు ఏ పనీ చేయకుండా విశ్రాంతి తీసుకోమన్నారు డాక్టరు.

"కొన్నాళ్ళు అమ్మకు సాయంగా ఉందువు. ఇంటికి రమ్మని పిలవడానికి వచ్చాడు సంజయ్ మనోజ్ఞను. అతను గంటసేపు కూర్చున్నా వస్తానని గాని, రానని గానీ ఏమీ చెప్పలేదు ఆమె. అతనికి విసుగు వచ్చి గట్టిగా అడిగితే కన్నీరు పెట్టుకున్నది. కోపం వచ్చి వెళ్ళి పోయాడు సంజయ్.

తరువాత కొన్నాళ్ళకు ప్రభాకర్ గారు స్వయంగా వచ్చి కాపురానికి పంపమని అడిగినా ఫలితం లేకపోయింది.

చిరాకు వచ్చిన సంజయ్ ఏదో ఒకటి తేల్చుకుందామని పట్టుదలగా వచ్చాడు ఆ రోజు.

"నువ్వు నీ ఉద్యోగం వేరే ఊరికి ట్రాన్స్‌ఫర్ చేయించుకుంటే వస్తుందటయ్యా అమ్మాయి..." అని చావు కబురు చల్లగా చెప్పాడు రాజారామ్.

ఇది విని నిర్ఘాంతపోయాడు సంజయ్. విద్యుద్ఘాతం తిన్నవాడిలా విలవిలలాడేడు. చెట్టు నుంచి విరిచిన కొమ్మలా వాడిపోయేడు. ఆ తండ్రీ కూతుళ్ళ మనస్తత్వమేమిటో బోధపడ లేదు అతనికి.

ఎంతగా బ్రతిమాలి బుజ్జగించినా భార్యను ఒప్పించలేక, తల్లిదండ్రుల్ని నొప్పించలేక నలిగిపోయాడు సంజయ్. ఆఖరుకు "ఈ సంక్రాంతి పండుగ మూడు రోజులన్నా మా ఇంట్లో ఉంటే నీ కోరిక గురించి ఆలోచిస్తాను" అని షరతు పెట్టాడు సంజయ్. అతి కష్టంమీద ఒప్పుకుని, అత్తగారింటికి వచ్చిన ఆమెకు ఆ రాత్రే విపరీతమయిన జ్వరం వచ్చింది.

అప్పుడప్పుడే ఉదయభానుని బంగారు కిరణాలు భువిని ముద్దిడుతున్నాయి. ఆ మధుర స్పర్శకు పులకించిన వృక్షరాజాలు మత్తుగా ఊగాయి. పక్షి సంతతి నిద్ర వదిలించుకుని, కిలాకిలా రావాలతో ఆ లేత కిరణాలకు స్వాగతం చెప్తున్నాయి.

అప్పుడే కొద్దిగా నిద్రపట్టిన మనోజ్ఞ నుదిటి మీద చల్లని స్పర్శకు ఉలిక్కిపడి కళ్ళు తెరిచి చూసింది.

ఆరు సంవత్సరాల మరిది ధనుంజయ్ "జ్వరం తగ్గిందా వదినా..." అని అడుగు తున్నాడు.

"సారీ వదినా, రాత్రి నీకు ఫీవర్ బాగా వచ్చిందట గదా, నేను నిద్రపోయాను. నాకు తెలియదు. వచ్చి నిన్ను చూడలేదు..." పెద్ద ఆరిందాలా చెప్తున్న వాడి మాటలకు, నిజాయితీ ధ్వనించిన ఆ స్వరానికీ చలించి "రా బాబూ ఇలా కూర్చో" అంటూ తను జరిగి, వాణ్ణి తన ప్రక్కన కూర్చోబెట్టుకున్నది మనోజ్ఞ.

"నిన్న మా స్కూల్లో ఏమయిందనుకున్నావు వదినా, నా ప్రక్కన కూర్చుంటాడు చూడూ హరి, వాడి పెన్సిలేమో వెనుక కూర్చునే ఉదయ్ తీసి, తన బ్యాగ్‌లో వేసుకున్నాడు. అది నేను చూశాను. పెన్సిల్ పోయిందని హరి ఏడుస్తూంటే మిస్ అందరినీ అడిగారు. "అందరూ మేము తీయలేదు" అన్నారు. నేనేమో ఉదయ్ తీసిన సంగతి చెప్పాను. మిస్ పెన్సిల్ హరికి ఇప్పించి, ఉదయ్‌ని ఒక దెబ్బ కొట్టారు. "ఇంకెప్పుడూ దొంగతనం చెయ్యవద్దని" చెప్పి. మేమందరమూ ఉదయ్‌కి షేమ్, షేమ్ చెప్పాము. చూడు వదినా, ఆ కోపంతో వాడేం చేశాడో... గ్రౌండ్‌లో నన్ను తోశేశాడు..." అంటూ చిన్న దెబ్బ తగిలిన మోకాలిని చూపించాడు ధనుంజయ్.

"అయ్యో పాపం... దెబ్బ తగిలిందా..." అంది మనోజ్ఞ.

"ఛఛ... ఇటువంటి చిన్న చిన్న దెబ్బలను నేను పట్టించుకోను వదినా. మగాణ్ణి కదా..." మీసం మెలివేస్తున్నట్లు ఫోజు పెట్టి చెప్పాడు వాడు. వాడి ఫోజుకు ఫక్కుమని నవ్వి, "నువ్వు భలేవాడివయ్యా..." అన్నది మనోజ్ఞ.

"ఔనంట వదినా, అందరూ ఆ మాటే అంటారు. ఎందుకో నాకూ అర్థం కాదు..." కళ్ళు గుండ్రంగా తిప్పుతూ అన్నాడు సంజయ్.

వాడి చిలిపి మాటలకు నవ్వురాగా, ఆప్యాయంగా దగ్గరకు తీసుకుని, ముద్దు పెట్టుకుంది ఆమె.

"ఛ... ఏమిటి వదినా, నువ్వు కూడా అమ్మలాగా..." సిగ్గు పడ్డాడు ధనుంజయ్.

"ఏరా ధనూ, వదిన్ని విశ్రాంతి తీసుకోనీయకుండా, నీ కబుర్లతో విసిగిస్తున్నావా?... ఇలా వచ్చేయ్... అంది అరుంధతి, చిన్నవాడని గారం చేయడంతో వాడికి చిలిపితనం, కొంటె చేష్టలూ ఎక్కువ.

"లేదత్తయ్యా, ధనూని నా దగ్గర ఉండనివ్వండి. మేమిద్దరం ఇప్పుడు దోస్తులమయ్యాం ..." నవ్వుతూ అంది మనోజ్ఞ.

"నిజంగానా వదినా... అయితే మన మిప్పుడు పార్టీ చేసుకుందాం. నా దగ్గర జామకాయ ఉంది తెస్తాను ఉండు..." అంటూ తుర్రుమన్నాడు పిలుస్తున్నా విన్పించుకోక.

కొద్దిసేపటికి మామగారు ప్రభాకర్ వచ్చారు గదిలోకి. "ఏమ్మా ఇప్పుడు కొద్దిగా తేలికగా ఉందా... రాత్రి చాలా బాధ పడ్డావుట. నేనిప్పుడే వైజాగ్ నుంచి వచ్చాను. రాగానే అరుంధతి చెప్పింది. ఇప్పుడు కులాసాగా ఉన్నట్లే కదా... డాక్టరు గారు వస్తారు. నీకేం కావాలన్నా మొహమాటం లేకుండా మమ్మల్ని అడుగమ్మా. నేను నీ తండ్రి లాంటి వాణ్ణే. ఏమీ బిడియపడకు" అంటూ ఆప్యాయంగా ఆమె తలనిమిరి, షాపుకి టైమ్ అవుతోందంటూ వెళ్ళిపోయారు ఆయన.

ఆయన చూపించిన అభిమానానికి మనోజ్ఞ సిగ్గుపడిపోయింది. "హు తన కన్న తండ్రి ఒక్కనాడైనా ఇలా పలుకరించాడా...? ఆప్యాయంగా దగ్గరకు తీసుకున్నాడా... అసలు తన మొహమే చూడదు ఆయన. ఏదో కన్నాడు కాబట్టి, బాధ్యత ఉంది కాబట్టి, పెళ్ళి చేసి చేతులు దులుపుకున్నాడు.

"మీ ఇంటికి ఫోన్ చెయ్యనా. నీకిలా జ్వరంగా ఉందని" అడిగాడు సంజయ్ ఆమెకు కాఫీ తీసుకువచ్చి ఇస్తూ.

"వద్దు" అంది మనోజ్ఞ మంచం దిగబోతూ.

"వాళ్ళు కంగారు పడతారేమోనని వద్దంటున్నది..." అనుకున్నాడు అతడు.

"జ్వరమని తెలిసినా, ఒకే ఊరయినా వాళ్ళు రారు" అనుకుంది ఆమె.

ఆ పగలంతా తగ్గిన జ్వరం రాత్రి పదకొం

డు గంటలకు మళ్ళీ తీవ్రంగా వచ్చింది విపరీత మయిన చలితో. హడావిడిగా ఫ్యామిలీ డాక్టర్ కు ఫోన్ చేశారు ప్రభాకర్ గారు. అనుకోకుండా ఊరెళ్ళారట ఆయన.

"ట్యాబ్‌లెట్స్ వేద్దాం. తగ్గిపోతుంది లెండి ..." అంది అరుంధతి.

ఒక రాత్రప్పుడు వాంతులు కూడా మొద లయ్యాయి మనోజ్ఞకు. ప్రతిసారీ బెడ్‌షీట్స్, ఒంటిమీది బట్టలూ, గదీ... అన్నీ ఖరాబయినా, రవ్వంతయినా విసుగు లేకుండా బెడ్ షీట్స్ మార్చి, గది స్వయంగా శుభ్రం చేస్తున్న అత్త గార్ని చూసి అవాక్కయింది మనోజ్ఞ.

"ఈమెకు నేనేం చేశానని నాకింత సేవ చేస్తోంది? కనీసం నోరారా అత్తయ్యా అని పిలి చి కూడా ఎరుగనే... పైపెచ్చు ఆమె కొడుకుని ఆమెకు దూరం చేయాలని చూశానే... నా మీద కోపం లేదా ఈమెకు...? ద్వేషం లేదా...? కాలికి కట్టుతో మంచంలో ఉన్న తనను కనీసం చూడడానికి కూడా రాని తన మీద అసహ్యం వెయ్యడం లేదా అత్తయ్యకు...? మూగగా రోదించింది మనోజ్ఞ మనసు. ఆ జ్వరం మలే రియాలోకి దించి చాలా బాధ పెట్టింది ఆమెను. జ్వరం తగ్గే వరకూ అరుంధతి ఆమెను కంటికి రెప్పలా కాపాడుకుంది. నోటికి సహించక, మ నోజ్ఞ బ్రెడ్‌గాని, పండ్లుగానీ తినకపోతే మేమూ భోజనం చేయమంటూ, ఆఖరుకి మామగారితో సహా పట్టుపట్టేవారు.

అసలు ఆ ఇంట్లో పద్ధతులే మనోజ్ఞకు విచి త్రంగా అన్పించేవి. ఎంత టైమ్ దాటి పోయినా భోజనమైనా, టిఫినైనా అందరూ కలిసి తినవల సిందే. ఒక్కరు రాకపోయినా, మిగతావారు అలా ఎదురుచూస్తూ కూర్చునేవారు తినకుండా. ఆ ఇంట్లో సభ్యులు ఫ్యామిలీ మెంబర్లలా కాక, ప్రాణస్నేహితుల్లా మసుల్తారు.

మనోజ్ఞకు జ్వరం తగ్గిపోయింది గాని, ఇం కా నీరసంగా ఉంటోంది. పనిఅమ్మాయి తెచ్చిన తాజా గోరింటాకు రుబ్బి ఇచ్చి, మనోజ్ఞను పెట్టు కొమ్మంది అరుంధతి. నాకు రాదంది మనోజ్ఞ.

అరుంధతి ఓపికగా కూర్చుని మనోజ్ఞ రెండు చేతులకూ పెట్టడమే కాక, పాదాలకు పారాణి కూడా పెట్టింది. ఎర్రగా పండిన మనో జ్ఞ పసిమి చేతులను చూసి ఆమె ఎంత మురిసి పోయిందో. ప్రభాకర్‌గారిని కూడా పిలిచి చూ పించింది. ఇక ధనుంజయ్ అయితే ఒకటే గొడవ. "తనకు కూడా వదినకు పండి నంత ఎర్రగా కావాలని".

భర్త అనురాగం, అత్తగారి ఆప్యాయత, మామగారి అభిమానం, మరిది అల్లరి... మనో జ్ఞను ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి. ఆ ప్రేమ వాహినిలో మునిగిపోయిన ఆమెకు రోజులు ఎలా గడిచిపోతున్నాయో కూడా తెలియడం లేదు. నరకం నుండి స్వర్గంలోకి, మండుటెం డలో నుంచి చల్లని వెన్నెలలోకి వచ్చినట్లుగా ఉంది ఆమె పరిస్థితి. అత్తగారింట్లో అంత ఆద రణ పొందగలనని ఆమె కలలో కూడా అనుకో లేదు. అసలు కుటుంబ సభ్యుల మధ్య అటు వంటి అనురాగాలు, ఆప్యాయతలూ టీవీలో, సినిమాల్లో చూడడమే కానీ నిజంగా కూడా ఉంటాయని ఆమె ఊహించలేదు. ఆమె పెరి గిన ఇంటి వాతావరణం, ఆమెకు మనుష్యులం టేనే విముఖతను పెంచి, బతకడం అంటే ఆకలికి తినడం, నిద్రవస్తే పడుకోవడంలా నిస్సారంగా జీవితం గడపడమే కాబోలు అను కునేటట్లు చేసింది.

అయిన వారి ఆత్మీయతలోని అతి మధుర రుచి ఆమె ఇప్పుడిప్పుడే ఆస్వాదిస్తోంది.

ఒకరోజు కాలేజి నుంచి రాగానే సంజయ్ మనోజ్ఞ దగ్గర ఒక బాంబు పేల్చాడు. "బెంగు

ఊర్‌కి ట్రాన్స్‌ఫర్ వచ్చింది" అంటూ.

తృళ్ళిపడింది మనోజ్ఞ.

"నీ కోరిక తీరిందిగా బయల్దేరు..." అన్నాడు.

"ఏమండీ నిజం చెబుతున్నారా..." నమ్మలేనట్లు అడిగింది.

"నిజమే. బదిలీ చేయించుకొమ్మని నువ్వే గదా గొడవ చేశావు. ప్రయత్నించాను వచ్చింది..." అన్నాడు సంజయ్ చిద్విలాసంగా.

"ఎప్పుడో ఏదో అన్నానని సాధిస్తున్నారా... ఆ బదిలీ వద్దని చెప్పండి. మనం ఇక్కడే ఉందాం..." అన్నది మనోజ్ఞ బిక్కమొహం పెట్టి.

"అంతా నీ ఇష్టమేనా, కావాలనడానికి, మళ్ళీ వద్దనడానికీ అదేం మన సొంత సంస్థ కాదు..."

"మరిప్పుడు ఎలాగండీ..., ఎవరి చేతయినా చెప్పిద్దామా...?"

"ఎవరు చెప్పినా వాళ్ళేం వినరు. పిచ్చి పిచ్చి వేషాలు వేస్తే, అసలు ఉద్యోగమే పీకేస్తారు..."

"అమ్మో... అలాగయితే మీరు బెంగుళూరు వెళ్ళిపోండి. నేనిక్కడే ఉండిపోతాను. అత్తయ్య లేకుండా నేనుండలేను..."

"మరి... నువ్వు లేకుండా నేనూ ఉండలేను గదా. నాతో నువ్వు రావలసిందే. పట్టు పట్టాడు సంజయ్. మనోజ్ఞ దిగులు పడిపోయింది. ఆ విపత్కర పరిస్థితి నుంచి ఎలా బయట పడాలో ఆమెకు అర్థం కాలేదు.

చిన్నబోయిన ఆమె మొహం చూసి, అరుంధతి అడిగింది "సంగతేమి"టని...

మనోజ్ఞ చెప్పింది విని "ఏరా సంజయ్... నిజమేనా..." అన్నది అరుంధతి.

"నిజమే" నన్నాడు.

"పోతే పోయిందిలే. దిక్కుమాలిన ఉద్యోగం. ఇక్కడే ఏదో ఒకటి దొరక్కపోదు. అంతగా దొరకకపోతే, ఏదో ఒక బిజినెస్ చేసుకుందువు గాని..." అన్నది అరుంధతి చిక్కుడు కాయలు వలుస్తూ.

ఆ మాట వినగానే, మనోజ్ఞ మొహంలో వేయి దీపాల వెలుగు వచ్చింది. "అలా చెయ్యండి" అంది చటుక్కున.

"అలా చెయ్యండి..." అంటూ మనోజ్ఞను వెక్కిరించాడు సంజయ్. అప్పుడేమో బదిలీ చేయించుకొమ్మని చంపావు. ఇప్పుడు వద్దంటున్నావు. బదిలీ మాట అబద్ధమేలే. అయినా... అప్పుడు నేనెంత నరకం అనుభవించానో తెలుసా..." అన్నాడు భార్యా, తల్లీ కూర్చున్న దగ్గరకు వచ్చి వాళ్ళతో పాటే తనూ నేలపై కూర్చుని చిక్కుడు గింజ నోట్లో వేసుకుంటూ.

"సారీ అండీ... వెరీవెరీ సారీ. ఈ జ్వరం రాకపోతే నేను ఇప్పటికీ ఆ మూర్ఖత్వంలోనే ఉండేదాన్ని. ఈ జ్వరం నాకు చాలా మేలు చేసింది. నన్ను క్షమిస్తారా అత్తయ్యా..." అంటూ ఆమె వడిలో తలదాచుకుంది మనోజ్ఞ.

"అంత మాట ఎందుకు పిచ్చిదానా..., అయినా తప్పు చేయడం మానవ సహజం. దానిని దిద్దుకోవడంలోనే మన జ్ఞానం ఉపయోగించాలి..." అంటూ కోడల్ని గుండెలకు హత్తుకుంది అరుంధతి.

"అమ్మో... మీ ఆడవాళ్ళకు ఏది వచ్చినా కష్టమే. ఇప్పుడు మీరిద్దరూ ఒకటయిపోయారు. నేను పరాయి వాడినయ్యాను..." అంటూ సంజయ్ పెట్టిన బుంగమూతిని చూసి, ఫక్కున నవ్వారు అత్తాకోడళ్ళు.

ఆ దృశ్యం ఎంతో మనోజ్ఞంగా తోచింది సంజయ్‌కు. ●

# జీర్ణం..జీర్ణం.. వాతాపి జీర్ణం

ప్రాచీన కాలంలో దేశం అంతా అరణ్యాలతో నిండి ఉండేది. ఒకచోటు నుంచి మరొక చోటుకి ప్రయాణం చేయడం చాలా కష్టంగా ఉండేది. దక్షిణ హిందూ దేశపు అడవులలో వాతాపి, ఇల్వలుడు అనే ఇద్దరు రాక్షసులు ఉండేవారు. వారిద్దరూ అన్నదమ్ములు. వారిద్దరూ అడవిలో ప్రవేశించిన మనుష్యులను విచిత్రంగా చంపి తింటుండేవారు. ఇల్వలుడు బ్రాహ్మణరూపం ధరించి, అడవిలో వెళ్ళేవారిని తన ఇంటికి వచ్చి ఆతిధ్యం స్వీకరించమని కోరేవాడు. పాపం వాళ్ళు ఇల్వలుడి మాటలు నమ్మి అతని ఇంటికి వెళ్ళేవారు. ఇల్వలుడు వారిని విశ్రాంతి తీసుకొమ్మని చెప్పి వంట నిమిత్తమై వంటింట్లోదూరి తన సోదరుడు



"వాతాపి" ని చంపి ముక్కలు చేసి వాడి మాంసంతో వంటకాలు పూర్తిచేసి, అతిధులకు స్వయంగా వడ్డించేవాడు. వారు సుష్ఠుగా మాంసాహారం తినగానే ఇల్వలుడు వాళ్ళ ముందు నిలబడి "వాతాపీ! వాతాపీ! బయటకు రా!" అని పిలిచేవాడు. అతిధుల కడుపులో మాంస రూపంలో ఉన్న వాతాపి, ఆ పిలుపు వినగానే మరల ప్రాణం పోసుకుని అతిధుల పొట్టలు చీల్చుకుని బయటకు వచ్చేవాడు. అతిధులు మరణించ గానే సోదరులిద్దరూ వారి మాంసాన్ని సంతోషంగా ఆరగించేవారు.

కొంతకాలం తరువాత ఈ మోసాన్ని తెలుసుకున్న మునులు అగస్త్య మహర్షి వద్దకు వెళ్ళి, రాక్షసుల బారి నుంచి జనులను రక్షించమని ప్రార్ధించారు. అగస్త్యుడు గొప్పజ్ఞాని, మంత్రశక్తులు కలవాడు కనుక ఆ రాక్షసులను చంపి లోకులను రక్షింపదలచి, వెంటనే వారి వద్దకు బయలుదేరాడు.



మహర్షిని చూడగానే యధా ప్రకారం బ్రాహ్మణ వేషం వేసుకుని తన ఆతిధ్యం స్వీకరించమని ఇల్వలుడు అనగానే వెంటనే అంగీకరించాడు అగస్త్యుడు. ఇల్వలుడు వడ్డించిన పదార్ధా లేవో తెలిసినవాడు కనుక అగస్త్యుడు భోజనం కాగానే పొట్టతడుము కుంటూ "జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం" అనుకున్నాడు. ఈ మాట ఇల్వలుడికి వినబడక ఆయన భోజనం నుంచి లేవగానే "వాతాపీ! బయటకు రా" అని పిలిచాడు. ఎంతసేపటికీ వాతాపి బయటకు రాక పోయే సరికి ఇల్వలుడికి భయంవేసి వణుకుతున్నాడు. అగస్త్యుడు చిరునవ్వు నవ్వి "నీవు పిలిచిన నీ సోదరుడు నా పొట్టలో జీర్ణమైపోయాడు. బయటకు రాడు" అనగానే ఆయన గొప్ప మహర్షి అని గ్రహించి, ఇల్వలుడు మహాత్మా! దయచేసి నన్ను ప్రాణాలతో వదలిపెట్టండి. ఇటువంటి చెడ్డ పనులు ఎప్పుడూ చేయను. ఎవర్నీ చంపను అని ప్రమాణం చేసి మహర్షి పాదాలను పట్టుకున్నాడు. తాపసి దయతలచి, ఇట్టి ప్రాణి హింస ఎప్పుడూ చేయవద్దని శాసించి, ఇల్వలుణ్ణి క్షమించాడు. ఇల్వలుడు ఆ అడవి వదలిపెట్టి వెళ్ళిపోయాడు.

ఇప్పటికీ మన ఇళ్ళలోని పాతకాలపు స్త్రీలు చిన్నపిల్లలకు ఆముదం పట్టించి "జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం" అనే చెప్పే మాటలు మహాభారత కాలంనాటివన్నమాట! ●

**పిశుపాటి జ్ఞానానందశర్మ**

ఫోన్ మోగుతూనే ఉంది. పట్నంలో ప్రజలకు కూడా ఎప్పుడో తెల్లవారిపోయింది. రిటైరయి ఇంట కూర్చున్న నాకు మాత్రం ఇంకా బద్ధకం గానే ఉంది. పై పెత్తందార్లను మెప్పించడానికో, పదవిని పదిలంగా కాపాడుకోవడం కోసమో సరైన నిద్రకూడా పోకుండా తెల్లవారక ముందే భయం భయంగా గాబరా గాబరాగా లేచిన రోజులు కాలగమనంలో కలిసిపోయాయి. ఇప్పుడైనా ప్రశాంతంగా నిద్రపోకపోతే ఎలా అని నా సిద్ధాంతం. ఆయుర్దాయం ఇంకా పెంచేసుకొని పెళ్ళాం పిల్లలతో అగచాట్లు పడడానికి తెల్లవారక ముందే లేచి మార్నింగ్ వాక్‌కి బయలుదేరే వాళ్ళతో నేను జట్టు కట్టలేదు. నాకు తోచినప్పుడు నాకు నచ్చినట్టు చేసేదే నా ఎక్సర్‌సైజు.

రిటైర్‌మెంట్‌కి ముందు ఓ అయిదారు సంవత్సరాలు బడా ఆఫీసర్ హోదా వెలిగించడాన్న ఫోన్ ఎవరైనా అందుకొని నాకివ్వడం అలవాటయింది. ఇప్పుడా పని నా శ్రీమతి జానకి చేస్తుంది. ఏం చేస్తాం. మరి ఉన్నది మేమిద్దరమే. పిల్లలు ఎక్కడెక్కడో ఉద్యోగాలు.

ఫోన్ ఇంకా మోగుతూనే ఉంది. జానకి అందుబాటులో లేదు. తప్పనిసరయి ఫోన్ ఎత్తి 'హలో' అనకముందే చిన్ననాటి స్నేహితుడు ముకుందం "ఎంత అదృష్టవంతుడివిరా బాబూ ... చక్కని ఇల్లు, తెలివైన భార్య, పొద్దెక్కినా ఆదమరచి నిద్రపోగల ఆత్మశాంతి... అని సాగదీస్తూంటే సోది మానేసి చెప్పరా బాబూ" అన్నాను.

"తీరికగా మాట్లాడే సమయం నాకూ లేదు లే. రేపు లేదు ఎల్లుండి ఆదివారం రాత్రి ఏడున్నర, ఎనిమిది మధ్య మా ఇంటికి మీ ఉభయులూ విందు భోజనానికి వస్తున్నారు. తప్పనిసరిగా రావాలి. సమయపాలన చాలా ముఖ్యం. ఎందుకు? ఎవరెవరు వస్తారు? అంటూ ప్రశ్న



గణపతిరాజు నరసింహరాజు

లతో సాధించక తప్పనిసరిగా ఇద్దరూ వచ్చేయండి. అన్ని ప్రశ్నలకూ సమాధానం ఆవేళ దొరుకుతుంది. ఫోన్‌లో పిలిచానని ఏమీ అనుకోవద్దు" అంటూ ఫోన్ పెట్టేయబోయాడు.

"ఉండరాబాబూ. విషయం తెలియకపోతే ఈసారికి ఎగ్గొట్టేద్దామనుకుంటున్నాను" అనగానే

"ఆ పని చేయకునాయనా. మీ సిస్టర్... అదే మా ఆవిడ నా ప్రాణం తోడేస్తుంది. బుజ్జి గాడి పెళ్ళి ఆ రోజు" అంటూ ఫోన్ పెట్టేసాడు.

ముకుందానికి ఇద్దరమ్మాయిల తరువాత ఒక అబ్బాయి. వాడి అసలు పేరు నందగోపాల్. ముద్దు పేరు బుజ్జి. ముకుందం సంతానమంతా అమెరికాలోనే సెటిలయ్యింది. వాళ్లందరూ మంచి ఉద్యోగాలతో చక్కని ఇల్లు వాకిళ్లతో కళకళలాడే గ్రీన్‌కార్డ్ హోదాలతో అమెరికాని ఆదుకుంటున్నారు. ముకుందం, అతని భార్య మాలిని కూడా అక్కడే సెటిలయి ఉండేవారు కానీ ఇండియాలో వాళ్లు పెంచుకుని వస్తున్న ఆస్తులు కాపాడడానికి, పిల్లల గొప్పలు అంద రికీ చాటి చెప్పడానికీ తప్పనిసరయి ఉండి పోయేరు.

మాలిని ఎన్నో పూజలు, పునస్కారాలూ చేసింది. తీర్థయాత్రలు చేసింది. ఆఖరికి కోరిన కోరికలల్లా నెరవేర్చగలరన్నే నమ్మకం కుదిరిన ఓ గురువుగారు కూడా దొరికారు. ఇద్దరమ్మాయిల తర్వాత కొడుకు కావాలంది. కలిగేడు. వాడికి మంచి చదువు, అమెరికాలో ఉద్యోగం, అంతు తెలియని సంపద అన్నీ కోరుకున్నట్టే జరిగాయి. ఇప్పుడు ముద్దుల కొడుకు బుజ్జిగాడి పెళ్లి ఎలా జరగాలనుకున్నదో మరి.

అమెరికా వెళ్లిన అబ్బాయిల పెళ్లిళ్లు చూసి నేను వాటికి 'తత్కాల్ వివాహం' అని పేరు పెట్టేను. అనుకోకుండా ప్రయాణం చేయవలసినపుడు 'తత్కాల్ రిజర్వేషన్' అని రైల్వేవారు సదుపాయం ఏర్పాటు చేసారు. కాస్త ఖర్చు ఎక్కువకాని ప్రయాణానికి సాధారణంగా ఢోకా ఉండదు.

మధ్యాహ్నం విమానం దిగి సాయంత్రం పెళ్లి కూతురుని చూసి రాత్రికి ఏ గుడిలోనో పెళ్లి చేసుకొని మర్నాడు పెళ్లి కూతురుతో వినీలాకాశంలో తేలిపోయి, అమెరికాలో దిగక ముందే ఇటైతే మద్రాస్‌లోనో అటైతే బొంబాయిలోనో శోభనం జరిపేసుకొనే శుభ వివాహన్ని 'తత్కాల్ వివాహం' అంటుంటాను నేను. అయితే ఈమధ్య తత్కాల్ వివాహలకి ఆడపిల్ల తల్లి దండ్రులంతగా ఇష్టపడడం లేదని తెలుస్తోంది. తత్కాల్ వివాహాలు కాస్తా తాత్కా లిక వివాహాలు అవుతుండడమే కారణం.

బుజ్జి పెళ్లి ఎవరితో జరుగుతుంది, ఏ విధంగా జరుగుతుంది అని నేను ఆలోచించే లోపునే ఆదివారం వచ్చేసింది. అయినప్పటికీ వివాహ వివరాలు తెలియలేదు. నాకంటే హెచ్చు ఆత్రుత పడుతున్న జానకి రెండు మూడు సార్లు ఫోన్ చేసినా మాలిని ముద్దుల మనుమరాలు అమెరికన్ యాసలో ఇంగ్లీష్‌లో ముందుగా రికార్డ్ చేసిన మాటలు "మీరు పిలిచినవారు ప్రస్తుతం అందుబాటులో లేరని చెప్పడానికి చింతిస్తున్నాం. దయచేసి కొంతసేపాగి మరలా ప్రయత్నించండి. లేదా మీ సందేశం 'బీప్' శబ్దం వినిపించి ఆగిన తరువాత తెలపండి" అంటూ వినిపించేది. మా ఆవిడ ఆతృతకి అదొక పెద్ద బ్రేక్ కావడంతో విసుగుపుట్టి మరి ఫోన్ చేయడం మానేసింది.

సాయంత్రం ఏడు గంటలయ్యేప్పటికి ముకుందం ఇల్లు చేరాం. ఉద్యోగంలో ముకుందం బాగానే సంపాదించేడు. అందరూ మాత్రం అదృష్టమంతా మాలినిదేనంటారు. అమెరికా నుంచి అబ్బాయి పంపిస్తున్న డబ్బు దానికి తోడయింది. వాళ్లు కొన్న తోటలు, భూములు, ఇల్ల స్థలాలు కాకుండా పట్నంలో ఈ ఇల్లు

కూడా బాగానే కట్టించేడు. పెద్ద హాలు, అందు లోంచి మేడ మీదకు మెట్లు, పైన మూడు గదులు, బాల్కనీలు, ఆ పైన మరో సింగిల్ బెడ్ రూమ్, దిగువ హాలుకు అటుపక్క, ఇటుపక్క పెద్ద పెద్ద గదులు, పెరటిలోను, వీధిలోనూ పూల మొక్కలు, వీధిలో ఫౌంటెన్, పెరటిలో స్విమ్మింగ్‌పూల్, సర్వంట్ క్వార్టర్స్ ఉన్నాయి. మంచి అభిరుచి, సంపద గల వాళ్ల ఇల్లులా ఉంటుంది. గదుల్లో కూడా ఖరీదైన ఫర్నిచర్; షోకేసులలో అమెరికన్ బొమ్మలు, ఎలక్ట్రానిక్ వస్తువులు, హోమ్ థియేటర్, దిగువ నొకటి, పై గదుల బాల్కనీలో ఒకటీ కంప్యూటర్ సిస్టమ్స్; రకరకాల టెలిఫోన్లు శోభాయ మానంగా ఉంది ఇల్లు.

'మందుంటే ముందుంటాం. లేకుంటే స్టేటు గవర్నరిచ్చిన విందైనా జారుకుంటాం' అన్న తరహాలో ఉండే మా మిత్ర బృందం ఒకరూఒకరూ వచ్చి హాలు ప్రక్క మరో గదిలో చేరుకుంటూ అక్కడి డిమ్‌లైట్లలో పలకరించు కుంటూ హుషారుగా ఉన్నారు. మాలిని గొప్పతనం అదే. అలాంటి పార్టీలకు అన్ని హంగులతో కూడిన గది ఆవిడ ఏర్పాటే. హాలుకి కుడివైపున్న విశాలమైన మరో గదిలో పిల్లలు చేరారు. అక్కడ రకరకాల గేమ్స్, పెద్ద పెద్ద బొమ్మలు, సౌండ్ సిస్టమ్స్ అన్నీ ఉన్నాయి. తలుపులు దగ్గరకు వేసేస్తే శబ్దం పైకి వినిపించని ఏర్పాటుంది. మధ్య విశాలమైన హాలులో మేం చతికిలబడ్డాం. ఎంతదూరాన ఉన్నా మాలిని మాటలు, నవ్వు తెలిసిపోతాయి. మధ్యమధ్య హాలులోకి వచ్చి స్వాగతం పలుకుతూ రెండుమూడు మాటలు చెబుతూ వెళ్ళిపోతోంది. మాలిని తెలుగు మాట్లాడడం చాలా తక్కువే.

ఆమె హుందాతనం, నవ్వు, మాటకారితనం, దర్పం ప్రదర్శించే కట్టు, బొట్టు తీరు ఎవరినైనా ఇట్టే ఆకట్టుకొంటాయి. కాకపోతే ఎదుటి వారిని మాటాడనివ్వకుండా అదే పనిగా తను, తన కుటుంబం గురించే చెప్పుకునే గొప్పలు చాలామంది భరించలేరు. అవసరానికి ఆదుకునే మంచి గుణం కూడా ఉండడాన్న ఆ లోపం కూడా అంతగా ఆమెకు అడ్డుకాలేదు. అల్లుళ్ల పుణ్యమా అని కూతుర్లు సంతానవతులౌతూంటే వియ్యాల వారి కంటే ముందు అమెరికాలో ఉండేది ఆమె. విమాన ప్రయాణం చేస్తే ఎయిర్ హోస్టస్‌లు, ఫ్లైటు బర్సరులు అందరూ స్నేహితులయిపోతారు. పైలట్ కేబిన్‌లోకి రానివ్వక గాని... లేకపోతే వాళ్లతో కూడా స్నేహం చేసేసేది. ఆవిడ అమెరికా గురించి మనకు చెబుతూంటే అమెరికా ప్రెసిడెంటు ప్రెస్ సెక్రటరీకయినా అన్ని విషయాలు తెలియవేమోనని పిస్తుంది.

ముకుందం మందు పార్టీలో చిక్కుకుపోయాడు. మరి ఆవేళటికి నాకు కన్పించకపోయినా ఆశ్చర్యం లేదు. మా ఇద్దరి మధ్యా అలాంటి అవగాహన ఎప్పటినుంచో ఉంది. మేం కూర్చున్న చోట మాటి మాటికీ వస్తున్న రకరకాల స్నేక్స్, కూల్‌డ్రింక్స్‌తో మేం కూడా సరదాగానే ఉన్నాం. క్రమక్రమంగా ఇక్కడ కూడా హడావుడి పెరిగింది. అన్నిచోట్లా అమెరికా వాతావరణం. అక్కడున్న వాళ్ల పిల్లలు, వాళ్ల తెలివితేటలు;సంపాదనలు; ఇండియాకి వాళ్ల వల్ల జరుగుతున్న మేలు; మేధావులకు మనదేశం చూపుతున్న మొండి చెయ్యి... ఎంచేతో నేనుగాని, జానకిగానీ మా చిన్నబ్బాయి అమెరికాలో ఉన్న విషయం, మేం రెండు సార్లు అమెరికా వెళ్లిరావడం, అవసరాన్ని మించి ప్రస్తావించడానికి పెద్దగా ఇష్టపడం. మా ఉత్కంఠ అంతా బుజ్జి ఎక్కడున్నాడు? వాడి-పెళ్లి ఎలా జరుగబోతుందనే విషయంపైనే.

ఇంతలో మాలిని వచ్చి "యువర్ ఎటెన్షన్ ప్లీజ్". అనగానే హాలంతా నిశ్శబ్దమయింది.

"మా ఒక్కగానొక్క అబ్బాయి బుజ్జి గురించి మీ కందరకీ తెలుసు. కొందరు వాడిని చిన్నపుడు చూసి ఉంటారు కూడా. మరికొద్ది సేపట్లో వాడి వివాహం జరుగబోతోంది... ఇక్కడ కాదు... స్టేట్స్‌లో మాకాబోయే కోడలు పేరు బిందు. గుజరాతీ అమ్మాయి. కంప్యూటర్ ప్రొఫెషనల్; గ్రీన్‌కార్డ్ హోల్డర్. ఎబౌఆల్ షీ ఈజ్ ఆల్‌రడీ ఎర్నింగ్ సిక్స్టీ కే" అంటూ మళ్లీ తెలుగు తర్జుమా చేసింది. "అంటే ఆ అమ్మాయి ఇప్పుడే సంవత్సరానికి అరవైవేలు అంటే నెలకు అయిదువేల డాలర్లు సంపాదిస్తోంది తెలుసా!" అక్కడితో ఆగలేదు. "వాళ్ల కుటుంబం అంతా ఏనాడో అమెరికాలో సెటిలయింది. బిందూ ఈజ్ వెరీ క్యూట్, చామింగ్ అండ్ స్మార్ట్‌గాల్... చాలా అందమైన చలాకీఅయిన పిల్ల. మావాడు ఏది ఎంచుకున్నా తిరుగుండదు తెలుసా. వాడి అంచనాలు ఎప్పుడూ తప్పలేదు".

"ఆరంభిస్తే మరి ఆగదు కదా! ఆ గొప్పలు చూడు జీవితంలో రెండు మొట్టికాయలు తింటే ఈ గొప్పలన్నీ గాలికెగిరిపోతాయ్" మా ప్రక్కనున్న ఆయన మెల్లగా భార్యతో అంటున్నాడు.

"ఇంతకీ చెప్పవలసినదేమిటంటే మా బుజ్జి... అదే మా నందగోపాల్, బిందూ కంప్యూటర్ చాటింగ్‌లో దగ్గరై, అభిరుచులు ఏకమయ్యాక కాన్ఫరెన్స్‌లలో కలుసుకొని ఒకరినొకరు అర్థం చేసుకున్నాక పెళ్లి చేసుకుందామనుకున్నారు. అటూ, ఇటూ పెద్దలకు తెలియజేసారు. ఈ రోజు ఉదయం వాళ్లు అక్కడ సీడీలో వస్తున్న వేదమంత్రాల సాక్షిగా దండలు మార్చుకొని పెళ్లి చేసుకుందామని నిర్ణయించుకున్నారు. మా హోమ్ థియేటర్‌లో మనం అదంతా చూసి తరువాత డిన్నర్ ఎంజాయ్ చేస్తాం. పెద్దవాళ్లు కొందరు మా వెబ్ కెమెరా ముందుకు వచ్చి వాళ్లను ఆశీర్వదిస్తారు. ఇదీ ఇప్పుడు మన ప్రోగ్రామ్. పిల్చిన వారందరూ వచ్చినందుకు చాలా థేంక్స్".

ఆవిడ మాటలు పూర్తికాక ముందే సస్పెన్స్ తీరిపోయినందుకు ఊపిరి పీల్చుకొని అందరూ కబుర్లలో పడిపోయారు. ఆన్‌లైన్ పెళ్లి విందు అన్నమాట అని అర్థం చేసుకోగల వాళ్లు అనుకున్నారు. హాలులో లైట్లు మరింత డిమ్ అయ్యాయి. పక్క గదుల్లో వాళ్లు కొందరు మధ్య హాలులోకి వచ్చి కూర్చున్నారు. హోమ్ థియేటర్ తెరవైపు అందరి దృష్టి మళ్లింది. ఉత్కంఠ పెరుగుతోంది. టీవి తెర రొద తప్ప బొమ్మలు రావడం లేదు. బుజ్జిది టైమంటే టైమ్ అన్న మనస్తత్వం అంచేత ఫోన్ చెయ్యక్కర్లేదనుకున్నారు ముకుందం, మాలిని. ఆత్రుతగా సిస్టమ్స్ అన్నీ చెక్ చేసారు. గడియారాల వైపు పదే పదే చూసారు. అప్పటికే ఆకలనిపించిన కొందరు ఫుడ్ కౌంటర్స్‌వైపు దారి తీయడం మొదలుపెట్టారు. పిల్లలు ఆడుకునే గదుల్లోకి వెళ్లిపోయారు.

మాలిని మరి ఆగలేక బుజ్జికి ఫోన్ చేసేసింది. బుజ్జి ఫోన్ ఎత్తగానే అందరూ ఆత్రతగా ఉన్నారని వెంటనే తెరమీదకు రమ్మని చెప్పింది. నందూ వెంటనే తెరమీద క్లోజప్‌లో కనపడి "సారీ! మామ్, డేడ్. సారీ గైస్". అని ఆవలించేడు. ఓ పెద్ద లాగూ వాడూను. వెంటనే టీషర్ట్ వేసుకుని వచ్చాడు. వాడి వాలకం చూసి జరుగవలసిన కార్యక్రమం ఏదో జరిగిపోయే ఉంటుందనీ, పెళ్లికూతురు కెమెరా ముందుకు రావడానికి సిగ్గుపడుతోందనీ గుసగుసలు, ముసి ముసి నవ్వులు.

అమెరికన్ యాసలో అబ్బాయి అంటున్నాడు. "ఓకే! ఓకే! అసలు విషయమేమిటంటే బిందూ ఓ ఎసైన్‌మెంట్ మీద వాషింగ్టన్ వెళ్లింది. ప్రజంటేషన్ ఇవ్వాల్సి ఉంది. షీవిల్‌బి బేక్ బై ట్యూజ్‌డే. అంచేత చిన్న పోస్ట్‌పోన్ మెంట్. సారీ! ప్లీజ్ ఎంజాయ్ ద పార్టీ. బైయూ గైస్. బై డేడ్. కిసెస్ మామ్... ఒన్ మినిట్. ఒన్

మినిట్ ఐవిల్ ప్లే బిందూస్ రిగ్రెట్స్ ఆల్సో" అంటూ తెరనుంచి తప్పుకున్నాడు. ముందుగా రికార్డ్ చేసి ఉంచిన బిందూ పలకరింపు వేయ డానికి.

కొద్ది సేపట్లో పెళ్లి కూతురు బిందూ తెర పైకి వచ్చింది. పెద్ద అలంకరణలేమీ లేవు. సాదా సీదాగానే ఉంది. వయసు పాతికేళ్ల పైనే ఉండొచ్చు. బుజ్జిగాడి నిద్ర మొహంలా కాకుం డా ఫ్రెష్‌గా ఉంది. "హలో ఆంటీ! హలో అం కుల్! హలో ఎవ్వెరీబడీ. సారీ ఫర్ ద డిసెప్పా యింట్‌మెంట్. బై దిస్ టైమ్ ఐ విల్ బిజీ ప్రజం టింగ్ మై... సారీ! అవర్ ప్రోజెక్ట్ బి ఫోర్ గ్రేట్ పీపుల్ ఇన్ వాషింగ్టన్. ఇఫ్ వుయ్‌ఆర్ లక్కీ వుయ్‌నీడ్ నాట్ లుక్ బేక్ ఇన్‌లైఫ్. ప్లీజ్! ఆలా ఫ్ యూ విష్ మీ గుడ్‌లక్. అంకుల్, ఆంటీ ప్లీజ్ డూ మేక్ ఏన్ ఎర్లీ ట్రిప్ టు స్టేట్స్. బై! బై!" అంటూ పూర్తి చేసింది.

వచ్చిన వాళ్లలో కొందరు ఇంగ్లీష్ సంభాష ణలకి విసిగిపోతారేమోనని మాలిని తెలుగులో మాట్లాడింది. "అదేంటీసంగతి మా కోడలు పెళ్లి అనుకోకుండా వాషింగ్టన్‌లో చాలా పెద్ద ప్రోజెక్ట్ ప్రయత్నాలు చేయడానికి వెళ్లింది. అదే ప్రజెం టేషన్ అంటే వాళ్ల అనుభవం గురించి చెప్పి, ఇదివరకు చేసిన ప్రోజెక్ట్‌లు ఎలా విజయవం తంగా చేసారో చెప్పి, ఇప్పుడు ఈ కొత్త ప్రోజెక్ట్ వాళ్లకే ఇస్తే ఎంత చురుకుగా ఎంత తొందరలో పూర్తి చేసి ఇవ్వగలరో చెప్పి ఆ పని తమకే ఇ చ్చేటట్టు చేసుకోవడం. అది సాధిస్తే మంచి పేరు, బాగా డబ్బు వచ్చి తిరుగు లేని విధంగా జీవితంలో స్థిరపడవచ్చంటోంది. మనందరి ఆశీర్వాదం కోరుకుంటోంది. పిచ్చి పిల్ల. ఎంత అభిమానమో చూసారా. అత్త మామల్ని ఆహ్వాని స్తోంది. అదే మనదేశంలో పెళ్లికాబోతున్న ఆడ పిల్లల కంత అణకువా? ఏమైనా గుజరాతీల పెంపకం తీరేవేరు" మాలిని తెలివితేటలు మా లో చాలామందికి అర్ధమయిపోయాయి. వాళ్ల బ్బాయి తెలుగు వాడయ్యుండి గుజరాతీ అమ్మా యిని చేసుకుంటున్నాడని ఎవరూ కామెంట్ చేయకుండా ఉండడానికి ఆ ప్రయత్నం. ఆక్షే పించినా లెఖ్ఖ చెయ్యనిదే అయినా అదొకత త్వం.

"రండి... రండి... ఫ్రీగా మీకు నచ్చినవి భోంచేసి... ఫ్రూట్స్, సేలడ్స్, ఐస్‌క్రీమ్స్... ఏవీ వదిలివేయకండి. ప్లీజ్" అంది మర్యాదగా మాలిని.

అందరం భోజనాలకి బయలుదేరాం. అప్ప టికే చేసేసినవాళ్లు సోఫాల్లో చతికిల బడుతు న్నారు. మా ప్రక్కనవెళ్తున్న భార్యా భర్తలలో ఆవి డ అంటున్నది. "రాను మొర్రో అంటే గొప్పగా వర్ణించి తీసుకొచ్చారు. అంతా ఇంగ్లీష్ స్పీకిం గే. ఒక్కక్షరం ముక్కనాకు అర్థం కాలేదు". వాళ్లా యన "ష్ గట్టిగా వాగకే తల్లీ! అందుకే ఆ దేశాల్లో తెలివితక్కువ పెళ్లాన్ని ఇంట్లో వదిలేసి మరెవరితోనో ఇలాంటి ఫంక్షన్స్‌కి వెళ్తారట" అంటున్నాడు. ఆయన మరె వరో కాదు ఎన్ని ప్రయత్నాలు చేసిన అమెరికా వెళ్లలేక అదృష్టం కలసిరాక ఎప్పుడూ బాధపడే మోహన్ అయి ఉంటాడనుకున్నాను. డిమ్‌లైట్ల వెలుతురులో వెళ్తుండడాన్న అతడు అవునో కాదో తేల్చుకో లేకపోయాను. "మారదు, మారదు. ఈ దేశం ఎప్పటికీ మారదు" అంటూ నసిగాడు అతను.

పక్కనున్న వాళ్లావిడ మెల్లగానే నసుగుతూ "మారుతుందండీ, మారుతుంది. ప్రపంచం అంతామారుతూంటే మన దేశం ఎందుకు మా రదు. భర్త ఎవర్తినో విందు భోజనాలకి తీసుకు వెళ్తూంటే, భార్య మరెవరితోనో మరోచోట విందు వినోదాలకు వెళ్లే రోజులు వస్తవి. లేక పోతే ఏంటి మీ వాలకం? మగవాళ్లయితే తప్పుకాదా. ఆడవాళ్లు అదే పని చేస్తే తప్పా?" అని ప్రశ్నిస్తోంది. ●

చిన్ననాటి నుంచీ ఉన్న ఆ కోరిక అతనితో బాటే ఎదుగుతూ వస్తోంది. ఎవరినైనా బాగా గదురుకోవాలని, తప్పులుపట్టి... బుద్ధి చెప్పి బాగా సాధించాలనీ... వీలైతే చడా-మడా తిట్టేయాలనీ (పరుషంగా కాదు) పెద్దరికం వెలగపెట్టాలనీ ఒక విచిత్రమైన కోరిక శంకర మూర్తికి.

ఎవర్ని గదురుతాడు?! ఇద్దరు అన్నలు, ఒక అక్క, అమ్మ, నాన్న, బామ్మ, వదిన, బావ అందరూ తనకన్నా పెద్దవారే మరి!... మరి...?

అందరూ తనని ఒక కూచిలాగే చూస్తారు గాని... ప్చ్... తన అభిప్రాయం అడగరు, చెప్పినా కొన్నింటినైనా పాటించరు. తనవరకూ అసలు ఏ సమస్యారాదు... రానివ్వరు. ఇంట్లో ఏదైనా సమస్య వచ్చినా - వాళ్ళు చర్చించు కుంటూండగా తను కలిగించుకుని అడిగినా నాన్చేస్తారు. సరైన జవాబివ్వరు. పైగా "నీకెందు కొచ్చిన గొడవరా ఇదంతా? నీ మనస్సు పాడు చేసుకోకు. ఫ్రండ్స్‌తో సినిమాకి వెడతానన్నావు గా... వెళ్ళిరా. డబ్బుందా? కావాలా?" అంటూ మరిపించేసి అక్కడి నుంచి దాటిం చేస్తారు.

తనేమైనా తప్పుచేస్తే మాత్రం చిన్నన్నయ్య



అవకాశం దొరికింది కదా - అని పిలక... పిలక... ఓ మైగాడ్ పిలకలేదు కనుక సరి పో యింది గాని, ఉంటే అది పట్టుకుని వీళ్ళందరూ - వీళ్ళందరూ ఏమోగాని - పిలక ఝాడిం చినట్లు సాధించేస్తాడు.

పెద్దన్నయ్య మాత్రం ఏ తప్పు చేసినాసరే "పోనిద్దూ కుఱ్ఱవెధవ" అని "మ్చ్" అని చులాగ్గా తేల్చేస్తాడు. పెద్దన్నయ్యకి పిల్లల్లేకపోవడం కూడా అందుక్కారణమేమో! పెళ్ళై వచ్చిన దగ్గర్నుంచీ తన సంరక్షణంతా పెద్దవదినే చేసే ది. తనని చాలా ప్రత్యేకతగానూ, అపు రూపం గానూ చూసేది. ఇప్పటికీ అమ్మకన్నా కూడా గారాబంగా చూస్తుంది.

చిన్నన్నయ్య తనని లోకువచేసి సాధిం చినందుకు కోపం వస్తే - పెద్దన్నయ్య తనని మరీ కుఱ్ఱవెధవలాగ జమచేసి మాట్లాడతాడని కోపం వస్తుంది. ఈమధ్యవరకూ తను గ్రహిం చుకోలేకపోయాడుగాని, తనకి... పరస్పర విరుద్ధంగా ఉన్న ఈ రెండు విషయాలకీ కూడా ఎందుకు కోపం వస్తోందో? విచిత్రమే సుమా!" ఆశ్చర్యంగా అనుకున్నాడు శంకరమూర్తి.

తనకోపం చూసిన చిన్నవదిన కొంటెగా నవ్వుతుంది. మూసిననోట్లో కొంతగాలి చేర్చి, బుగ్గలు పూరించి పక్కలకి కదిపి పుక్కిలిస్తుంది. ఆమె తనకంటే ఏణ్ణార్థం చిన్నది. చిన్నన్నయ్య పెళ్ళిచూపులైనప్పుడు - తను కూడా వెళ్ళాడు. వధువు అందరికీ చాలా బాగా నచ్చింది.

"ప్రస్తుతం నేను పెళ్ళి చేసుకోదల్చుకోలేదు" బింకగా అన్నాడు చిన్నన్నయ్య.

చదువుకున్న అందమైన పిల్ల. సంప్ర దాయకమైన కుటుంబం. పైగా... పూర్వం ఎరిగున్న కుటుంబానికి మిత్రులు కావటం కూడా కొంత కారణమైనా చక్కని సంబంధం కావటమే ముఖ్యకారణం. ఈ సంబంధం వదిలే యటం ఇంట్లో ఎవరికీ ఇష్టంలేదు. చిన్నన్నయ్య "ససేమిరా" అంటున్నాడు.

"నాకన్నా చిన్నదేగా! అన్నయ్య చేసుకో కుంటే పోన్లే! నేను... నేను... చేసుకుంటాను" అనుకున్నాడు. ఆ విషయమే పైకి చెప్పాడు ఆ రోజు. ఇంట్లో వచ్చిన దుమారం ఇంతా- అం తా కాదు. అందరూ వ్యంగ్యంగా మాట్లాడారు. చిన్నన్నయ్య అందరికంటే ఎక్కువగా దులిపి పారేశాడు.

ఉద్యోగం పర్మనెంట్ అయితే జీతం పెరుగు తుంది. అంతదాకా వాళ్ళాగితే నాదేం అభ్యం తరం లేదు. నేనిలా ఆలోచిస్తూంటే... ఇప్పు డిప్పుడే డిగ్రీ పూర్తిచేస్తున్న వెధవ్వి... అప్పుడే నీకు పెళ్ళికి అంత తొందరొచ్చిందిరా రాస్కె ల్?!" అంటూ పూనకం వచ్చినట్లూగి పోయా డు. మీదమీదకొచ్చి కొట్టినంత పనిచేశాడు. అమ్మ అడ్డుకుని సముదా యించింది.

ఇవన్నీ చిద్విలాసంగా చూస్తున్న గృహస్తు గారు మాత్రం విషయాలు వివరిస్తూ "మరీ అర్జంటు లేకపోతే... పెళ్ళికి ఒక్క ఆరునెలలు మీరు ఎదురుచూడగలిగితే - నిశ్చయ తాంబూ లాలు పుచ్చుకుందాం!" అంటూ కన్యాదాత గా ర్కి లేఖ వ్రాశారు. దాని అంగీకారంగా జాబు వచ్చింది.

మూతి వంకరగా తిప్పి, మీసం మెలేస్తూ సవాలు గెల్చినట్లు తనవైపు చూసి నవ్వాడు చిన్నన్నయ్య. నెలన్నర తర్వాతగాని నిశ్చితార్థా నికి మంచి ముహూర్తంలేదు. ఈలోగా పట్టుద లతో రాత్రింబగళ్ళు పనిచేసి, మెప్పు పొందటం వల్ల "కష్టే-ఫలీ" అన్నమాట సార్థకమై నిశ్చి తార్థంనాటికే ఉద్యోగం పర్మనెంటైంది వరుడు గార్కి తరువాత నెలలో రెట్టింపు జీతం చేతికం దింది. అందరూ 'అమ్మాయి అదృష్టవంతు రాలు" అని పొగిడారు.




ఆరునెలలు ఆగక్కర్లేకుండానే రెండు నెలలు దాటకుండానే వాళ్ళ పెళ్ళైపోయింది. సునీత కాపురానికి వచ్చింది.

తనకన్నా చిన్నది కదా – అని ఆమెను గదరటానికి కుదరదుకదా? వదిన హోదాలో వచ్చి ఇంట్లో కూచుంది. ఏదో... పే...ద్ద దాని లాగ అన్నిటికీ తప్పులు పడుతుంది. తను కని పెట్టిన ఆమె తప్పుల విషయం మాత్రం "పోవో య్" అన్నట్లు చప్పరించేస్తుంది.

"పొగరుమోతు రాకాసి. పెడసరపు పెంకి వదిన" మొదలైన బిరుదులు తన అంతరంగం లోనే ఆమెకు ప్రసాదించి సన్మానిస్తూంటాడు. సునీత తనని వెక్కిరించి వేధించినప్పుడు కక్షగా ఇలాంటివే అనుకుంటూంటాడు.

మొదట్నుంచీ కొంటెతనంపాలు కొంచెం ఎక్కువే సునీతలో. చొరవ మరికాస్త ఎక్కువే. ఒక్కొక్కప్పుడు మోతాదు మరీ మీరుతూంటుంది కూడా! ఇంకా కాలేజీ వాతావరణపుగాలి దూరం కాలేదేమో ఆ పిల్ల ప్రవర్తన పెద్దవాళ్ళకి 'ఔరా' అనిపించక మానదు. పెద్దతరం వాళ్ళు "హాళ్ళూ-పెళ్ళూ మరీ ఎక్కువ ఈ పిల్లకి. కొంత దింపాల్సిందే నింపాదిగా!" అనుకొనే ప్రమాదం లేకపోలేదు. సరిపెట్టుకునే మనస్త త్వాలు గల కుటుంబం అవటంవల్ల "ఇంకా కుర్రతనం పోలేదు" అనుకుని ఇంట్లో అందరూ సర్దుకుపోతున్నారుగాని లేకపోతే కష్టమే! కాని శంకరమూర్తి మాత్రం "ఏమిటీవిడ గొప్ప?" అని చిరాకు. అందరిలా సరిపెట్టుకోలేకపోతు న్నాడు.

"నిన్ను మూర్తి చేసుకుంటానన్నాడు తెలు సా? తక్కువ జీతం... అని నేను మొహమాట పడుతూంటే..." ఏదో మాటల సందర్భంలో అకస్మాత్తుగా చెప్పేసి నాలుక కొరుక్కున్నాడు.

సునీత భర్త ఎదురుగా మాత్రం ఆశ్చర్యంగా చూసి ఊరుకుంది. బిడియంగా అక్కడినుంచి వెళ్ళిపోయాడు శంకరమూర్తి. పుస్తకంలో తల దూర్చాడు. నిశ్శబ్దంగా అతనివెనకే వచ్చిన సు నీత శంకరమూర్తి తలవెనకాల తేలిగ్గా ఒకదెబ్బ

కొట్టింది. "నువ్వు... నువ్వు... నన్ను... నన్ను చేసుకుందామనుకున్నావా?... హ్హు... నా చెవిదగ్గరకొస్తావ్...? ...!" ఎకసక్కెంగా అని, కిసుక్కున నవ్వింది.

"ఏంలేదు...నీకంటే నేను కొంచెం పొడుగే! నిజంగా నువ్వే బాగా పొడుగైనట్లు... ఊహూ... సంబరపడిపోకు" ఉక్రోషంగా అన్నాడు – శంకరమూర్తి. సునీత తనని అలా తలవెనకాల కొట్టడం చాలా అవమానకరంగా అన్పించింది. ఎవరూ చూడకపోయినా అమర్యాద ఫీలై మనస్సు ఉడికిపోవటం మొదలుపెట్టింది. ఆ కోపంలో అతని ముఖం, చెవులూ ఎఱ్ఱగా కంది పోయాయి. ముక్కుపుటాలు వేడిగాలితో అదర సాగాయి.

ఆ క్షణంలో ఎవరితోనైనా చెప్పి ఉపశమనం పొందాలని తీవ్రంగా అన్పించింది కాని... కొంచెం ఆలోచించిన తరువాత "అతి సామాన్య విషయం ఇది. సీరియస్‌గా తీసుకోకు" అంటారు. "ఆ పిల్ల చిలిపితనం నీకు తెలుసుకదా! కొత్తగా విలువిస్తావెందుకు?" అంటారు. "సునీత చెప్పింది నిజమే! సునీత కంటే నువ్వు ఒక అంగుళం పొడుగైనా పొట్టిగానే కన్పిస్తావ్!" అని కూడా అనేయగలరు. అందుకే "ఎవరికీ చెప్పొద్దులే!" అనుకున్నాడు తనలో శంకరమూర్తి.

"ఛీ... ఏమిటింత లోకువ కట్టేసింది తనని?" ఇంకానయం... ఆ మహాతల్లినే చేసుకున్నానుగాదు! తను చిన్నగా కన్పించి ఇంకెంత హీనంగా చూసేదో... పెళ్ళి జరిగిఉండక పోనులే... తనేదో కుఱ్ఱతనం వల్ల ఈవిడగారి అందం చూసి అలా అనుకున్నాడుగాని... ఇంట్లో పెద్దవాళ్ళకి తెలియదేమిటి? పెద్దవాళ్ళు – పెద్దవాళ్ళే! అందుకే తనకోరిక ఆటకోటితనంగా తేల్చేశారు" అనుకుని తేలిగ్గా నిట్టూర్చాడు శంకరమూర్తి. సునీతతో మాట్లాడడం తగ్గించి గంభీరంగా ఉండడం మొదలు పెట్టాడు.

రకరకాల వ్యాయామాలు చాలా దీక్షగా సాధన చేయడం మొదలెట్టాడు. మరికొంత పొడువు కాగలిగాడు. శరీరం కూడా బాగాదృఢంగా తయారైంది. దరహాసమిళిత స్ఫురద్రూపంతో ఆకర్షణీయంగా తయారయ్యాడు శంకరమూర్తి.

ఎమ్.కామ్. పాసై, సి.ఏ పూర్తి చేసి చార్టెడ్ అక్కౌంటెంట్‌గా రెండు చేతులా ఆర్జిస్తున్నాడు శంకరమూర్తి. ఒక మనిషిగా నిలబడగల సామర్థ్యం సంపాదించుకోగలిగాడు గానీ అతని అసంతృప్తి మాత్రం పోలేదు.

చిన్ననాటి నుంచీ ఉన్న అలవాటు వల్ల తలవంచుకుని తనపని తాను చేసుకుపోవటమే గానీ ఇంకొకరి జోలికి వెళ్ళడు. అతని పనిలో తప్పులు లేకుండా చూసుకొనేసరికే అతనికి గగనమై పోతోంది. తన తప్పుల్లేకుండా చూసుకుని గదా ఇంకొకరిని తప్పుపట్టాలి? అవతని వాళ్ళ తప్పు కన్పిస్తేగదా తిట్టటానికి అవకాశం దొరుకుతుంది? ఇంత చక్కని మనస్తత్వంగల శంకరమూర్తికి ఆ చిన్న అసంతృప్తి కొండంతలై అతడిలో తిష్టవేసి పీడిస్తూంటుంది తరచూ వింతగా.

శంకరమూర్తికి పెళ్ళి కుదిరింది. సుముహూర్త నిర్ణయం కూడా అయింది. స్నిగ్ధ సుకుమారమైన 'వినయ' శంకరమూర్తి మనస్సుని పూర్తిగా ఆకట్టుకుంది. పూర్వం సునీత విషయంలో అనుకున్నంత ఆత్రంగా లేదు.

తొందరపడకుండా బాగా ఆలోచించి తన అంగీకారం తెలిపాడు. అతని ఎన్నిక అందరికీ నచ్చింది.

అడుగడుగునా మరదలు, బావమరిది

చేసిన కొంటె పనులకి తెలివిగా తప్పించుకుని మళ్ళీ వాటిని వాళ్ళకే ఎదురుతిప్పి అందర్నీ ఆశ్చర్యపరచాడు. వినయ కళ్ళల్లో "మరేమిటను కున్నారు?... నా విభుడంటే!" అనే గర్వంతో కూడిన తృప్తిని చూసి శంకరమూర్తికి ఆనందం కలిగింది. "ఈమె నా ఆజ్ఞ, నా అంగీకారాల తోనే కదా నడుచుకోవాలి... అంటే నాకు లోబడే కదా ఉండాలి?! అబ్బ ఇన్నాళ్ళకి గదా నాకు అనుకూలమైన కాలం సమకూరింది?" అనే ఆలోచనలో మునిగి, ఆ ఆనందంలో తేలుతూ వధూవరులచేత ఆడిస్తున్న 'సరి-బేసి' ఆటలో ఇరవై రూపాయలు కోల్పోయాడు.

ఒకేసారి అందరూ ఘొల్లున నవ్వేసి చప్ప ట్లు చరిచేసరికి ఈలోకంలోకొచ్చి పడ్డాడు - శంకరమూర్తి.

నవదంపతులకి నిరాశగా ఆషాఢమాసం, హడావిడులతో శ్రావణమాసం నోములూ పూర్త య్యాయి. వినయని కాపురానికి తీసు కొచ్చారు. వినయతో ఏదైనా కొంచెం గట్టిగా మాట్లాడి తే... ఇంట్లో పెద్దవాళ్ళందరూ పరు గెత్తుకొచ్చేసి "ఏమైందిరా చంటీ" అంటూ పరామర్శలు మొదలు.

ఎంత ఆలోచించినా వేరింటి కాపురానికి పెద్దవాళ్ళు ఒప్పుకుంటారని నమ్మకం కుదర లేదు శంకరమూర్తికి. "అది బాగుండదు కూడా! తను అంత స్వలాభపరుడు కాదు. మరి ...? మరొక ఊరిలో ఉద్యోగమైతే...!" అంతే. అదే నెరవేరబోతోంది. చెన్నైలో కాపురం పెట్టడానికి చక్కని అవకాశం వెతుక్కుంటూ వచ్చింది.

శంకరమూర్తి ప్రాణ స్నేహితుడు చెన్నైలో ప్రాక్టీస్ చేస్తున్నాడు. అతడికి అమెరికాలో చదు వుకి అవకాశం వచ్చింది. అది పద్దెనిమిది నెల ల కోర్సు. అతడు వెనక్కి తిరిగి వచ్చేలోగా ప్రా క్టీస్ పడిపోకుండా ఆ పద్దెనిమిది నెలలు తన పని చూసిపెట్టమని శంకరమూర్తిని కోరాడు.

అంతే! ఎగిరి గంతేశాడు శంకరమూర్తి. మొదట్లో ఒప్పుకోకపోయినా చివరకి ఇంట్లో అందరినీ ఒప్పించగలిగాడు. పెద్దవాళ్ళొచ్చి కొత్త సంసారం పెట్టించి వెళ్ళారు.

ఇక శంకరమూర్తి స్వాతంత్ర్యం సంపూర్ణం గా సిద్ధింపజేసుకోవాలి.

వెంటనే మొదలెడితే "పురుట్లోనే సంధికొట్టి నట్లు"... బాగుండదు కదా! మొదటి వారం రోజులూ హాయిగా ఊరంతా తిరిగి, బయటే భోజనం చేసి సరదాగా గడిపేశారు.

బట్టలు ఇలాగా సర్దటం? కూరలో ఇంత ఉప్పు తగలేశావేమిటి? ఇది ఇస్త్రీ చేసిన షర్ట్ అంటే ఎవరైనా నమ్ముతారా... ఇన్ని ముడ తలతో... చేసేవన్నీ తప్పులు... పశ్చాత్తాపమ న్నదే కన్పించదేం నీలో?" ఇలా రోజుకొక తప్పు పట్టి, విసుక్కుని గదిరేస్తున్నాడు శంకర మూర్తి.

అలా గదరగానే "అమ్మయ్య! బలేగా గదిరే శాను" అనుకొని నిట్టూరుస్తున్నాడు. అదేదో బాధ్యత తీరినట్లు ఫీలవుతున్నాడు. "తప్పులు పట్టగలుగుతున్నాను గదా! అనుకుంటూంటే పట్టరానంత సంతృప్తిగా ఉంది" అనుకుని స్థిమిత పడుతున్నాడు కూడాను.

ఈమధ్య వినయని తిట్టటానికి కుదరటమే లేదు. అన్నీ చాలా శ్రద్ధగా చేస్తోంది. నోట్లో మాట నోట్లో ఉండగానే జరిగిపోతోంది. ఫ్రీగా తిట్టటం అలవాటైన శంకరమూర్తికి తిట్టక పోవటం వెల్తిగా అన్పిస్తోంది.

"తప్పించుకుంటున్నానని మురిసిపోకు. ఇవేళ కాబోతే రేపు - దొరుకుతావు. నువ్వు నాచేత తిట్లు తినటానికే పుట్టావు తెలిసిందా?" సవాలు పూర్తి చేస్తూ "ఇది సరికొత్త సాధింపు. బలే బాగుందే" అనుకుంటూ ఉత్సాహంగా మన

స్సులోనే నవ్వుకున్నాడు శంకరమూర్తి.

కళ్ళనిండా నీటితో గుటకలు మింగుతూ వంటింట్లోకి వెళ్ళిపోయింది వినయ. ఆమె కన్నీరు చూసిన శంకరమూర్తి మనస్సు కొంచెంగా మెత్తపడింది. "ఇవేల్టి ఈ గొడవ అనవసరమేమో సుమా!" అన్పించింది.

తప్పు చేస్తే తిట్లు తప్పవు. సరే! తప్పులు చెయ్యకపోవటమే ఒక పె...ద్ద... తప్పుగా భావిస్తే గత్యంతరం??? భర్త మనస్తత్వాన్ని గురించిన ఆలోచనలతో అన్యమనస్కంగా పనులు చేస్తోంది వినయ.

ఆ పరాకులో ఖరీదైన తెల్లచొక్కాని, రకరకాల రంగుల బట్టలతో కలిపి నానేసి ఉతికేసింది వినయ. ఆ చొక్కా ఎంతగా పాడవటానికి అవకాశం ఉందో... అంతా పాడయింది.

వినయ భయపడినట్లే శంకరమూర్తి ఉగ్రుడైపోయాడు.

వినయని చడా-మడా తిట్టేశాడు. అతడికి చాలా ఇష్టమైన ఆ షర్ట్ స్థితి చూసేసరికి నిజంగానే బాగా కోపం వచ్చింది అతడికి. ఆ రౌద్రం చాలాసేపటివరకూ తగ్గలేదు. అతని తిట్లు భరిస్తూ వినయ "సార్ధక నామధేయుడు" అనుకుంది. అతడి కోపం ఎలా తగ్గించాలో బోధపడలేదామెకు.

అతడి భీకరకోపానికి బిక్కచచ్చిపోయి ఏడుస్తూండిపోయింది వినయ. భర్త కోపం తల్చుకుని-తల్చుకుని బాధపడుతోంది వినయ. ఓదార్చే ప్రయత్నం కూడా చేయలేదు శంకరమూర్తి. ఏడ్చి, ఏడ్చి ఆ రాత్రి తొమ్మిదయేసరికి విపరీతమైన జ్వరం వచ్చేసిందామెకు. ఉలికి - ఉలికి పడడం, కళ్ళు పెద్దగా చేసి భయంగా చూడటం, ఏవేవో కలవరింతలు, హైరానతో బాగా రొప్పుతోంది.

అర్ధరాత్రి దాటేసరికి వినయ జ్వరం మరింత పెరిగింది. ఆ పరిస్థితి చూసి హడలి పోయాడు శంకరమూర్తి. నిజంగానే శంకర మూర్తి సార్ధకనామధేయుడు. మాయామర్మాలెరుగడు. పొగిడితే ఉబ్బిపోతాడు. తేడావస్తే క్రుంగిపోతాడు.

గాబరాపడ్తూ పరుగెత్తుకెళ్ళి డాక్టరుని తీసుకొచ్చాడు. వినయ కలవరింతలు చూసిన డాక్టరు "ఆడవాళ్ళని ఎంత సున్నితంగా చూసుకోవాలో" వివరంగా సుత్తికొట్టాడు. అవన్నీ శంకరమూర్తికి తెలియనివా? "... కాని ... ఏమిటో...ఇలా..."

ఆ రాత్రంతా మందులిస్తూ శుశ్రూష చేశాడు. తెల్లవారు ఝామున జ్వరం దిగజారి జరిగినది జ్ఞాపకం తెచ్చుకుంది వినయ. ఎదర కుర్చీలో తూలుతూ కూర్చున్న భర్తను చూసి ఆశ్చర్యపోయింది. ఆనంద పడింది - కూడా! అతడిని - తట్టిలేపి మంచమ్మీద పడుకోమంది.

వాడిన గులాబీలా నీరసంగా ఉన్న వినయని చూసి "ఈ బాధకి కారణం నేను" అనుకున్న అతని మనస్సు ఆర్ద్రమైంది. ఆత్రంగా ఆమెను అక్కున చేర్చుకున్నాడు. వినయ వెచ్చని కన్నీరు అతడి గుండెని తడిపింది. గువ్వలా అతని బాహువుల్లో ఒదిగి కరిగిపోయింది వినయ.

"నిన్నుకాక నేనింకెవర్ని తిట్టగలనే? మా ఇంట్లో అందరూ నాకన్నా... పెద్దవాళ్ళే! నీమీద నా అధికారం ప్రదర్శిద్దామని నేనేదో తిడితే మాత్రం... నువ్వింత బాధపడి ఏడ్చి జ్వరం తెచ్చుకుంటావా? నీకేదైనా అయితే... నేనేమైపోవాలే... నువ్వు... నువ్వు లేకుండా... నేను... నేను"

నన్నపురూపంగా చూసేవాళ్ళెందరున్నా నా స్వంతానివి, నా ప్రాణం, నా సర్వస్వం నువ్వే కదే!" అతని గొంతు గద్గదికమైంది. ఎంత ఆపుకున్నా అతనిక్కూడా కన్నీరాగలేదు.




నా మనసు అర్థం అయేలా చెప్పలేక పోతు న్నాను విన్నూ...! ఎలా చెప్పను? ఏమని చెప్ప ను...?

భర్తని చూస్తూ అతని ఆక్రోశం వింటున్న వినయకి శంకరమూర్తిలో ఏనాటినుంచో బలపడి నిలిచిపోయిన వెర్రి పూడుతున్న భావం అవగతమైంది. ఆమె మానసాకాశంలో ఒక తటిల్లత మెరిసింది. తలపై నున్న పెద్ద బరువు దించేసిన భావం కలిగి తేలిగ్గా నిట్టూర్చిందామె.

"ఇది కఠిన సమస్య కానే కాదు. అతి చిన్న ది కాని... సున్నితమైన విషయం. ఓర్పే విజయా నికి ముఖ్యసూత్రం" అనుకుంది తనలోనే వినయ.

అర్థం లేని ప్రశ్న అయితే జవాబుండదు గాని... ఇప్పుడు ప్రశ్న అర్థం అయింది. దానికి జవాబు నాకు తెలుసు. సమస్యా చిన్నదే... పరి ష్కారం సులభసాధ్యమే!

"అర్థమైంది" గుసగుసగా అంది వినయ శంకరమూర్తితో.

"థ్యాంక్స్...!" ఆమె పెదవులు చుంబించాడ తను.

కార్యక్రమం పూర్తయి వాళ్ళకి కునుకు పట్టే లోగా పాలకుర్రాడొచ్చి తలుపు తట్టాడు.

ఆ తరువాత శంకరమూర్తి కోపానికి ఏనా డూ బాధపడలేదు వినయ. ఇష్టంగానే భరిస్తుం ది. భర్తని పొగుడుతుంది. అభిమాని స్తుంది.

అతడి కోపానికి మనస్సులో నవ్వుకునేది. పైకి మాత్రం భయభక్తులు చూపించేది. చెన్నై నుంచి స్వంత ఊరు వెళ్ళాకకూడా అతడి గౌర వం కాపాడుతూనే తన మనసులో కోరికలు తీర్చుకుని లాభమే పొందుతోంది.

"ఆయన సర్వస్వం నేనే అయినప్పుడు, నా మాట ఆయన జవదాటనప్పుడు ఇంక నాకు కొదవేమిటి?" ఈ పాయింట్ చాలా తృప్తి నిచ్చిం దామెకు.

అందరి దృష్టిలోనూ శంకరమూర్తి కోపదారి మనిషి, వినయ "సార్థకనామధేయ"... అంతే గదా మరి? –! ●

# ప్రతి అవసరానికీ... ఎన్నో...



## తెలుగులో రైమ్స్

(పిల్లల పాటలు)
అమ్మమ్మ, నానమ్మ లాలి
జోలపాటలు, ముద్దు లొలికే
చిన్నారుల ముద్దుమాటల
కూర్పు నాలుగు భాగాలు
(KG,1,2,3)
ఒక్కొక్కటీ రు. 99/-



## సుమతి పద్యావళి

సు (మంచి) మతికి
'బద్దెన' కవి నీతి

రు. 49/- (ఆడియో సీడి)



## ది బ్యూటీ

ఇక మీ ఇల్లే బ్యూటీపార్లర్ -
మీరే బ్యూటీషియన్

రు. 99/-



## ఉపనిషద్దర్శనము

దశోపనిషత్తులు పూర్తి
వివరణతో 12 గంటల
43 ని॥లు ఏకధాటిగా
MP3 ఆడియో

రు. 99/-



## యోగా ఫర్ డయాబెటిక్స్

డయాబెటిస్ తగ్గించుకోవడానికి
ఖర్చులేని ఏకైక మందు యోగా
మీకోసం ప్రత్యేకంగా

రు. 99/-



## ఫ్యాబ్రిక్ పెయింటింగ్

చిన్న పిల్లల డ్రస్‌ల నుంచి
చీరల వరకు...
పిల్లో కవర్స్ నుంచి కర్టెన్స్,
దుప్పట్లు వరకూ...
నింపేయండి... ఆకర్షణీయమైన
బొమ్మలతో...

రు. 149/- (3 సి.డి.లు)



## ది మేజిక్

మీరూ మేజిక్ చేయొచ్చు...
సాధారణ వస్తువులతో అతి సులభమైన ట్రిక్స్...

రు. 99/-

**PC VCD DVD**

**తెలుగులో కంప్యూటర్ జాతకం**

పేరు, పుట్టిన తేది, సమయం, పుట్టిన ఊరు వివరాలు వ్రాసి
రు.50/- + పోస్టేజి/కొరియర్ ఛార్జీల నిమిత్తం రు.20/-
కలిపి మొత్తం రు.70/- ఎం.ఓ. చేయండి. సాఫ్ట్‌వేర్ ధర: 1250/-
పూర్తి ప్రిడిక్షన్స్‌తో ❖ 50 పేజీల ప్రింటవుట్స్ కేవలం రు.50/-

69

# నేటి మహిళ




"హల్లో..."

"హల్లో...!"

"బావగారేనా? నమస్కారాలు"

"మస్కారాలు!"

"ఇదేమిటి...? వెటకారం... బావగారెందుకో కోపంతో ఉన్నట్లున్నారు"

"అదేం లేదు కానీ విషయమేమిటో చెప్పవయ్యా మహానుభావా"

"మీ కూతురు..."

"మీ కోడలు..."

డా|| మలయశ్రీ

అదే - నా కోడలు"

"నా కూతురు"

ఆ - నీ కూతురు, నా కోడలు... వసంత - "

"వసంతా-ఏమిటి? బాగుంది కదా. సంగతేమిటో చెప్పవయ్యా"

"బాగున్న తర్వాత బాదెక్కడిది?"

"బాగులేదా? ఏమైందయ్యా అమ్మాయికి? జ్వరమా?"

"ఇదుగో మీ చెల్లె లికిస్తున్నా ఫోను"

"అల్లో - రామ నాధం అన్నయ్యేనా?"

"ఇప్పుడు కొత్తగా రంగనాధంనైపోతానా చెల్లెమ్మా? ఏమిటమ్మా సంగతి? నీ పెనిమిటి వసంత... అని మాట ఆపేసి ఏదో విషయం నానుస్తున్నాడు".

"నా నోట ఎట్లా చెప్పేదన్నయ్యా?"

"పోనీ, నీ పెనిమిటిని చెప్పమను"

"ఆయన నోట్లో నాలుకలేని మనిసి"

నీకైతే ఉంది కదా... నువ్వే చెప్పు"

"వసంత కనిపించుతూలేదు"

"కనిపించుతూ లేదా? ఎప్పటి నుంచి"

"రొండు రోజులైంది"

"రెండు రోజులకు ఇప్పుడా చెప్పేది? ఏ మైంది? ఎటు పోయింది మరి?"

"మా యింటి పక్క రవి కూడా లేడు"

"అంటే నీ ఉద్దేశం?"

"వాళ్ళు ఇద్దరూ కలిసి ఎటైనా వెళ్ళి పోయా రేమో అని అనుమానం."

"నువ్వు బావగారిని లేపుకొని పోయినట్టా"

"ఏమిటా మాట? అది ఇప్పుడెందుకు? లేచి వచ్చినా పెళ్ళి చేసుకున్నాం కదా?"

"అదీ నిజమే. ఇంతకూ ఆ రవి ఎవరు? నీ పెద్ద కూతురుతో తిరిగిన కుఱ్ఱాడేనా?"

"అదేం మాట? పెళ్ళయిన పిల్ల మీద ఉత్త అభాండాలు వేయకు".

"ఉన్న సంగతే కదా అది. అందరికీ తెలిసిందేనాయె".

"అదంతా అబద్ధం. ఈ మాట వింటే దాని మొగుడు ఊకోడు".

"ఈ నువ్వన్న మాట వింటే దీని పెనిమిటి,



అదే నీ కొడుకు ఊర్కుంటాడా?"

"ఏమో - జరిగిన సంగతి చెప్పిన. మనం మనం కావల్సినోల్లం. జరుగకూడని పని జరి గింది అనే నా బాధ".

"నీకు రాకూడని కష్టం వచ్చింది".

"మాకువచ్చినా మీకు వచ్చినా ఒక్కటే కదా. మీరు వేరు, మేం వేరా? మనమంతా ఒక్కటే నాయె."

"అహ! ఎంత చక్కని మాట! నిజం చెల్లె మ్మా... నువ్వన్నమాట. ఇదుగో ఫోన్ నీ కోడలి కిస్తున్న-"

"ఎవరు? వసంతా! అక్కడే ఉన్నావా బిడ్డా? కాసంత చెప్పిపోవద్దా? మీవోళ్ళను చూడాలని ఉందంటే నా కొడుకునో, మీ మామనో తోడిచ్చి పంపించకపోదుమా"

"ఎక్కడికి? పై లోకానికా?"

"అదేం మాట బిడ్డా! అట్లంటావే. ఏమైనా పీడకల కన్నావా?"

"లేదత్తా! నువ్వు మామతో మాట్టాడిందం తా విన్నానంతే. నా మొగుడు..., అదే నీ కొడు కు... ఉత్త గంగిరెద్దు. అందుకే మీకు ఎవరికీ చెప్పకుండా తప్పించుకొని వచ్చేసా - రవి నాతో రాలేదు. నన్ను బస్సెక్కించి వాళ్ళ సొంతూరికి వెళ్ళాడు. కోర్టులో కలుద్దామత్తా. నాకు మొగు డూ వద్దు, మీ యిల్లూ వద్దు. నా కట్నం డబ్బు తో ఒక బిడ్డ పెళ్ళి చేసావ్. ఇప్పుడు నన్ను చం పి, కొడుకి మరో పెళ్ళి చేసి, ఆ కట్నం సొమ్ము తో మరో కూతురి లగ్నం చేయాలని చూస్తున్నా వు. మూడో కుమార్తె పెళ్ళో మరి?"

"రెండో కోడల్ని చంపితే సరి" అన్నాడు తండ్రి.

"పాడు ముండ. 'నా చెల్లె. మేన సంబం ధం' అని ముదనష్టపు ఇంటికి అంటగట్టాదు నా బిడ్డను" వసంత తల్లి అంది.

"నువ్వూర్కో కాస్త" రామనాథం అంటే,

"చాల్లెండి" అని కోపంగా చూస్తూ వెళ్ళి పోయింది అతని భార్య.

"అల్లో - వసంతా" అత్త పిలుపు ఫోన్‌లో.

"ఫోన్ పెట్టేస్తున్న కోర్టులో కల్సుకుందాం. నా రెండు లక్షల రూపాయలు సిద్ధంగా ఉం చుండి."

ఫోన్ పెట్టేసింది వసంత.

రామనాథం పెద్దమ్మ కూతురు వసంత అత్త. అబ్బాయి బాగున్నాడు, మంచి ఉద్యోగ ముంది - అని సంబంధం ఒప్పుకున్నాడు. దగ్గరి చుట్టరికం కాబట్టి కూతురు సుఖపడు తుందని అనుకున్నాడు. కాని, ఇప్పుడేమో ఇట్లా యె. అతనికి బాధగా ఉంది. వసంత తల్లి కి బాధ కోపంగా మారి భర్తపై దాడికి దిగింది.

"మనుషులను చూస్తిమి కాని, వాళ్ళ గుణా లు చూస్తిమా? మంచి కోరితే చెడు జరిగె-" తనను సమర్థించుకున్నాడు రామ నాథం.

"అన్నీ చూసే అవునవాలయ్యా. తొందర పడితే ఇట్లాగే అవుద్ది".

"అమ్మా... మీరు ఊరుకోండి. చేసింది చాలు. ఇక నా సంగతి నేనే చూసుకుంటా-" అని లోపలికి వెళ్ళింది వసంత.

రామనాథం వీధిలోకి వెళ్ళాడు.

మళ్ళీ ఫోన్ మోగింది. తల్లి రిసీవర్ ఎత్తింది.

అవతలి వైపు మాట విని "అమ్మాయి! ఫోన్ నీకే. అల్లుడు-" అంది

"ఫోన్ పెట్టెయ్యి" అంది కూతురు.

అటు ఆ యింట్లో -

"ఏమంటుందిరా?"

"ఏమీ అనలేదు"

అతని తల్లి మళ్ళీ ఏమో అనబోయింది. కాని, అది కొడుకు వినిపించుకోలేదు. బయ టకు నడిచాడు.




"ఏం చేద్దామయ్యా?"

"నేను ఏనాడైనా నీకు సలహాలు ఇచ్చానా, నువ్వు అడిగావా? ఎప్పుడూ నువ్వు చెప్పిన మాటనే వినుడాయె. ఏంచేస్తవో నువ్వే ఆలోచించుకో" అని భర్త మాట ఆపేశాడు.

అవతలి గదిలో వీరి ముగ్గురు కూతుళ్ళూ మాట్లాడుకుంటున్నారు. పెద్ద కూతురు సరోజ అత్తవారింట్లో ఉంది.

"వనజక్కా! నీ పెళ్ళికి భళే ప్లాను వేసిందే అమ్మ" అంది గిరిజ.

"వదిన చావలేదు కదా... పరిస్థితి వికటించె. ఇప్పుడెలాగా?" అంది చిన్న చెల్లి జలజ.

"అమ్మ మరో ప్లాను వేస్తుందిలే"

"ఏం ప్లాను? ఏం చేస్తుంది మళ్ళీ? మనకే విషం పెడుతుందా?"

"అంత మాటనకే. అమ్మకు మన మీద ప్రేమేనే–"

"కూతుళ్ళ మీద ప్రేముంటే అందుకు కోడళ్ళ చంపాలా? వాళ్ళూ ఓ తల్లి కన్నబిడ్డలే! తన కూతుళ్ళ వంటి వాళ్ళుకారా".

"ఎక్కడ చంపిందే? అదంతా ఉత్తది" అంది గిరిజ.

"అదేం కాదు! నిజం నేను విన్నా" జలజ.

"నువ్వే చెప్పావా వదినకు?"

"లేదు. ఆమె విన్నది"

"అబద్ధం"

"అమ్మతోడు నిజం"

"చెప్పి మంచి పని చేశావ్" అంది వనజ.

"అమ్మకు జైలు శిక్ష పడుతుందేమోనే–"

"మొదట కట్నం డబ్బు తిరిగి చెల్లించాలి కదా."

"సరోజక్క భర్తనడిగి తెస్తుందిలే"

"ఏం తెస్తుందో... వాళ్ళెందుకిస్తారు మళ్ళీ? అయినా వాళ్ళకు ఇచ్చింది లక్షే కదా. మరో లక్ష?"

"అవి అన్న పెళ్ళికే ఖర్చయ్యె"

"వదిన వాళ్ళకు కాలేదా పెళ్ళి వ్యయం?"

"అన్నయ్య పెళ్ళికి వదిన వాళ్ళు మనకు మంచి చీరెలు కట్నం పెట్టిరి. మళ్లా ఇమ్మంటారో ఏమోనే!"

"ఇదొకతి. ముక్కుపోగా ముక్కు పుడకకు ఏడ్చినట్లుంది దీని తీరు".

"ఇప్పుడు ముక్కు పుడకలు ఎవరూ పెట్టుకుంటూలేరు. చెవి పోగా చెవి పోగుకు ఏడ్చినట్టు అను-"

"పోగులు కూడా పెట్టుకుంటూ లేరు తెలుసా?"

"మీరాగండే" అంది వనజ.

"ఇంతకు నీ పెళ్ళి ఎలాగే వనజక్కా?" అంది జలజ.

"మీరు నోరు మూసుకుంటారా కాస్త" ఆమె కసిరింది.

"నోరు మూసుకుంటే ప్రాబ్లం సాల్వ్‌కాదు కదా!" అంది గిరిజ.

"దానికేమిటే...? - అది రవి బావను లవ్ చేస్తోంది"

"రవి బావ సరోజక్కను కదా లవ్ చేశాడు?"

"పెద్దక్కకు పెళ్ళయింది కదా. లైన్ క్లియర్... అందుకని -"

"అంత అందంగా లేదు కదా వనజక్క?" జలజ అంది

"వ్యక్తికి అందం ఒక్కటే ముఖ్యం కాదే వెర్రి దాని -" అంది గిరిజ.

"ఏమో బాగా ముచ్చట్లు పెడుతున్నారు?" అటు వస్తూ అంది తల్లి.

"పోలీసు కేసంటే భయం వేసి..." చిన్నది అన్నది.

"ఏమిటే దొంగ చాటుగా ఫోన్ వింటున్నారా మీరు?"

"అబ్బే, అదేం లేదమ్మా మీరు మాట్లాడు కొంటూ ఉంటే- " గొణిగింది జలజ.

"చాల్లే దొంగ మొగాలూ మీరూను" అంటూ వెళ్ళింది.

"అంతా అమ్మ పోలికే అన్నమాట మనది" మెల్లగా అంది గిరిజ.

"ఏమిటే?" తల్లి వెనుకకు తిరిగింది.

"ఏమీ లేదమ్మా - " గిరిజే అంది నాలుక కరచుకొని.

"నోర్లు మూసుకొని పడి ఉండుండి" అని తల్లి ముందుకు కదిలింది.

"నాన్నవలె!" జలజ అంది మెల్లగా, ఆ మాట తల్లికి వినరాకుండా. ఆమె లోపలికి వెళ్ళింది.

మరునాడు తమకు కావల్సిన ఒక పెద్ద మనిషిని కోడలింటికి మధ్యవర్తిగా పంపించింది. అతడు నానా మాటలు పడి, గోడకు విసిరిన బంతివలె తిరిగి వచ్చాడు. అవన్నీ వివరంగా వినిపించి తానే తన చెంపలు వాయించుకొని వెనుదిరిగి చూడకుండా వెళ్ళాడు.

"ఇప్పుడేం చేద్దామయ్యా?"

"ఆలోచించు-"

"నువ్వేమంటావ్‌రా?"

"నేననేది ఏమీ లేదు"

ఆమే సలహా ఇచ్చింది భర్తకు, కొడుక్కు. తమ బంధువు ఒకాయన రాష్ట్ర మంత్రి అయినాడు. ఆయనకు పదవిపోయినా పరపతి పోలేదు. అధికార పార్టీ ఎం.ఎల్.ఏ.గా ఉన్నాడిప్పుడు. అతని దగ్గరికి వెళ్ళమంది. వెంటనే బయల్దేరాడు భర్త.

అతడు ఏ లోకాన ఉన్నాడో - ఎంత ముట్టిందో కానీ సరే అన్నాడు.

ఫోన్‌లో మాట్లాడినాడు రామనాథంతో. "కేసు వద్దు. ఉభయులూ కూర్చుని మాటాడు




కొని, సమస్యను పరిష్కరించుకుంటే మంచి" దని సూచించాడు.

సరే - అన్నాడు రామనాధం.

అబ్బాయి వాళ్ళ ఇంట కూర్చుందాం అంటే అమ్మాయి వాళ్ళు ఒప్పుకోలేదు. అమ్మాయి వాళ్ళింటికి అబ్బాయి వాళ్ళు రామన్నారు.

మాజీమంత్రిగారింటనే ఓ దినం ఉభయులూ సమావేశమైనారు. వరుని తల్లి రానంది. వధువు తల్లి వస్తానంటే భర్త వద్ద న్నాడు. వసంత వాఙ్మాలమంతా విన్నాడు మధ్యవర్తి. తీర్పు కోసం ఎదురుచూడలేదామె. "నాకీ భర్త వద్దు. కట్నంగా తీసుకున్న డబ్బు మాది మాకు ఇస్తే చాలు. అదనంగా ఏమీ వద్దు" అన్నది స్పష్టంగా, మాజీగారి నోట మాటరాలేదు. ఓటమివేళ ఓర్మి చూపితేనే కదా గెలిచినట్టుగా గుర్తింపు? ఆయన రాజకీయ నాయకుడు. ఇటువంటివి ఎన్ని చూడలేదు? తనను ఆ యువతి లక్ష్యపెట్టనిది అతడు గుర్తించినా పట్టించుకోలేదు.

"ఏమంటావ్?" అన్నాడు అమ్మాయి తండ్రితో.

"నేను అనేదేం లేదు? అన్నాడు రామనాధం.

"మీరేమంటారయ్యా" బంధువు వైపు చూశాడు.

ఆ తండ్రి తన కొడుకు ముఖం వైపు చూశాడు.

"ఇప్పుడే వస్తాం" అని ఇద్దరూ కొంత దూరంగా వెళ్ళారు.

"ఎట్టారా?" తండ్రి.

"మీరే చెప్పండి" కొడుకు

"కోడలు మంకు పట్టు పట్టింది"

"ఆమె అన్నమాట నిజమేనా?"

"అవన్నీ ఇప్పుడెందుకు?"

"నాకు నిజం తెలువాల"

మాట మార్చి "మనింటికి రానంటున్నది" అన్నాడు.

"అంతే కదా... తనకు భర్తే వద్దని అన్నప్పుడు అత్తవారింటికి ఎలా – ఎందుకు వస్తుందింకా?"

"కట్నం డబ్బు ఇవ్వమంటుంది కదా".

"అదే కదా న్యాయం?"

"డబ్బులేదామె. అది నీ పెళ్ళికి, అక్క పెళ్ళికే ఖర్చయ్యె"

"అది మన తప్పు"

"ఏం చేద్దాంరా మరి ఇప్పుడు?"

"డబ్బయితే ఇవ్వలేం కదా"

"ఊ"

"అయితే నేనే ఆమెను బతిమిలాడి–"

"పెండ్లానికి లొంగిపోతే తలవంపులు కాదా?"

"మీకంటేనా?"

"ఇంకా ముగ్గురు ఆడపిల్లలున్నారైరి. వాళ్ళ సంగతి ఎట్లారా?"

"అది మీ బాధ్యత. పోషించలేని వాళ్ళు సంతానాన్ని కనకూడదు".

"నీ కోసం చూస్తే ఇద్దరు ఆడవాళ్ళైరి"

"కొడుకొక్కడు. వీడు చస్తే ఎట్లా? మరొక్కడైనా ఉండాలి – అని ఎదురు చూస్తే మరిద్దరూ కూతుళ్ళు అయిరి. అంతేనా"

"అదంతా మీ అమ్మ దౌర్జన్యంరా."

"నీ బలహీనత కూడా"

"ఏమంటావ్ చివరిమాట."

"అక్కడ విందురు పదండి" ఇద్దరూ కదిలారు.

"ఏం నిర్ణయం?" అన్నట్లుగా చూశారు మాజీమంత్రి.

చిన్నగా నవ్వాడు వరుదు – అదే... వసంత వద్దన్న మగడు. కొడుక్కు నవ్వెట్లా వస్తుందో ఆ తండ్రికి అర్థం కాలేదు.

"ఆమె మా యింటికి రావలసిన అవసరం లేదు".

విడిపోతరా? అనబోయి మాటాపినాడు మాజీ.

"మా ఇంటి సంగతులు ఏవీ నాకు తెలియవు. ఇన్నాళ్ళూ వాళ్ళ కొడుకుగా బతికాను. ఇక నా భార్య కోసం బతుకుతా. ఆమె ఇష్టం ఏమిటో తెలుసుకోండి."

మాజీమంత్రి వసంత దిక్కు చూశాడు. ఆమెకు భర్త ఇష్టమే అనే భావాన్ని ఆమె ముఖ వైఖరిలో గమనించాడు.

"ఎక్కడుంటాడో అడగండి. మా యింటికి వస్తాడా?" అందామె వెంటనే.

"రాను. అది నాకు అగౌరవం" అడుగక ముందే చెప్పాడు ఆమె మొగుడు.

ఈమె వారింటికి పోదు, అతడు వీరింటికి రాడు... ఇక ఈ సమస్యకు పరిష్కారం ఎట్లాగో ఆ పెద్దమనిషికి అర్థం కాలేదు. అతడు రాజకీయనాయకుడు. సమస్యలను తేల్చడం కాక, తెగకుండా నాన్చడమే కదా రాజకీయం.

భార్య భర్తవైపు చూసింది.

"వేరే ఉందాం. మనకు ఎవరి ఇల్లూ వద్దు. మనం ఇద్దరమే ఒకరికి ఒకరం తోడుగా వేరే ఇంటిలో ఉందాం" అన్నాడు ఆమె భర్త. ఆమె మనసునిండుగా నవ్వింది.

వసంత మామ దిగులుగా కనిపిస్తే తండ్రి సంతృప్తిగా కన్పించాడు. గెలుపు మాజీ మంత్రిది అయింది. అయినా ఆ జంట ఒక్కటైంది. ఆమె, ఆమె భర్తా కలిసి అటునుంచే ఎటో వెళ్ళారు. వేరు కాపురం ఏర్పాట్లు చూసు కోవడానికి కావచ్చును... ●

**సిపాయి కథలు**

# డార్లింగ్

"మేజర్‌సాబ్" – ఆ పిలుపుకి తలతిప్పి చూసాడు మేజర్ రాజేష్.

"మీకు ఉత్తరం వచ్చింది" అంటూ సుబేదార్‌సింగ్ ఒక కవరు అతని చేతిలో ఉంచాడు. చీకట్లు ముసురుకుంటున్న ఆ సమయంలో కేవలం ఉత్తరం మీద చిరునామా చదవగలిగాడు మేజర్ రాజేష్. అది తన అర్ధాంగి కిరణ్ రాసిన ఉత్తరం. పది నెలల క్రితమే తమ వివాహం అయింది.

ఒక్కమాటు మల్లెపూల గుబాళింపులా, ఆ స్మృతులు మనసును తాకాయి.

ప్రేమగా, అమాయకంగా, దీనంగా తన కళ్లలోకి చూస్తు వీడ్కోలు చెబుతున్న భార్య మొహం కళ్లముందు కదలాడింది.



**కాటూరు రవీంద్ర త్రివిక్రమ్**

"త్వరలో వస్తారు కదూ?"

"తప్పకుండా వస్తాను..."

"నన్ను మీతో తీసుకెళ్తారు కదూ?"

"తప్పకుండా తీసుకెళ్తాను..."

"నాకు ఢిల్లీ అంతా చూపిస్తారా?"

"ఆగ్రా కూడా చూపిస్తాను..."

"ఆగ్రాలో తాజ్‌మహల్..." అంటూ ఆగి పోయింది.

నవ్వి "ముందు అదే చూపిస్తాను... ఎందు కంటే - నువ్వు నా హృదయరాణివి..." ఆమె సిగ్గులమొగ్గ అయింది. ఆమెను గాఢంగా హృద యానికి హత్తుకున్నాడు. ఆమెకు ఆ క్షణం ఉక్కు కోటలో సురక్షితంగా ఉన్నట్లనిపించింది. మెల్ల గా కౌగిలి వదులు చేస్తూంటే, పట్టుదప్పి శిఖరం మీద నుంచి లోయలోకి దొర్లిపోతు న్నట్లుంది.

"మేజర్‌సాబ్..." ఆ పిలుపుకి తృళ్లిపడి ప్రస్తుతంలోకి వచ్చాడు రాజేష్. 'ఏమి'టన్నట్లు చూసాడు.

"మీకు వైర్లెస్ కాల్..." అంటు ఫోన్ చేతికి చ్చాడు సుబేదార్‌సింగ్. అందుకుని మాట్లా డాడు.

"టోలోలింగ్ శిఖరం మీద శత్రువు తిష్టవేసి ఉన్నాడు. ఆ స్థావరాన్ని ఈ రాత్రికి మీరు పట్టుకోవాలి" - ఆపరేషన్స్ కమేండర్ ఆదేశం.

"తప్పకుండా పట్టుకుంటాం సార్" ధృడం గా అన్నాడు మేజర్ రాజేష్.

"పరిస్థితిని ఎప్పటికప్పుడు మాకు తెలుపు తూండండి"

"అలాగే సార్..."

"విష్‌యూ ఆల్ ద బెస్ట్..."

"థాంక్యూ సర్... జైహింద్..."

"జైహింద్..."

సిపాయిలు దేశమాతకి ముద్దు పాపాయిలు. ప్రాణాలను పణంగా పెట్టి, మన సరిహద్దుల్ని సదా రక్షిస్తూంటారు. వారి వీరగాథలు యువతకి ఆదర్శం, స్ఫూర్తిదాయకం కావాలి.

ఈ కథలు వాస్తవ సంఘటనల నేపధ్యంతో రచించబడ్డాయి. రచయిత శ్రీ కాటూరు రవీంద్ర త్రివిక్రమ్ 1964 నుంచి 1980 వరకు (16 సం॥లు) వైమానిక దళంలో పనిచేసిన కాలంలో స్వయంగా రెండు యుద్ధాలలో పాల్గొన్నారు. మిలట్రీ ఆస్పత్రిలో చికిత్సపొందుతున్న అనేక మంది యుద్ధ వీరుల విజయగాథల గురించి వివరాలు సేకరించారు. యుద్ధరంగం వేదికగా, దేశభక్తి ఊపిరిగా, త్రివిధ దళాల యుద్ధవీరులు సజీవ పాత్రలుగా వెలువడుతున్న ఈ ప్రత్యేక కథలు 'కథాకేళి' పాఠకులకు ప్రత్యేకం.

ఫోను సుబేదార్‌సింగ్ చేతికిస్తూ "మన వాళ్లందరూ రెడీయేనా?" అడిగాడు మేజర్ రాజేష్.

"అందరూ రెడీగా ఉన్నారు సార్"

"ఒకసారి పిలవండి" - భార్య ఉత్తరాన్ని చదవకుండానే జేబులో పెట్టుకున్నాడు.

సుబేదార్‌సింగ్ పిలవగానే అందరూ క్షణల్లో వచ్చి ఎదురుగా నిల్చుని 'శాల్యూట్' చేసారు. తను కూడా శాల్యూట్ చేసి "మిత్రులారా! మరికొద్ది నిమిషాల్లో మనం ఎదురుగా ఉన్న 'టోలోలింగ్' శిఖరం ఎక్కబోతున్నాం. దీని ఎత్తు 16,000 అడుగులు. మన గ్రెనెడియర్ దళ సభ్యులకిలాంటివి కొత్తేమీ కాదు. ఎటొచ్చీ మనం ప్రతి అడుగూ ఎంతో జాగ్రత్తగా ముందు కుసాగాలి. అధికభాగం నేలబారుగా పాకాల్సి ఉంటుంది. శత్రువుల దగ్గర అత్యాధునికమైన, చీకట్లో సైతం చూడగల బైనాక్యులర్స్ ఉన్నా యి. మన కదలికల్ని పసిగట్టే ఎలక్ట్రానిక్ సెన్సర్లున్నాయి. అలాగని మనం భయపడా ల్సిందేమీ లేదు. ఎందుకంటే మన దగ్గర మాతృ




దేశభక్తి అనే మహత్తరమైన ఆయుధం ఉంది. శత్రువుల దురాక్రమణ నుంచి మన మాతృ భూమిని రక్షించుకోవటం లో ఏ త్యాగానికైనా మనం సిద్ధం. అవునా, కాదా?"

"అవును! మనం ఏ త్యాగానికైనా సిద్ధం..." అందరూ ముక్తకంఠంతో అన్నారు. "శభాష్!" అని ప్రశంసగా చప్పట్లు కొట్టాడు.

"విజయమో వీరస్వర్గమో! రెండూ మనకి ఒకటే... ఒక్కొక్కరం కనీసం పదిమంది శత్రువుల్ని చంపాలి... ఈ రాత్రికే టోలోలింగ్ స్వాధీనం చేసుకోవాలి..."

"మేమందరం సిద్ధంగా ఉన్నాం సాబ్"

"సరే – ప్రయాణానికి సిద్ధంకండి" అంటు తను కూడా సిద్ధమయాడు మేజర్ రాజేష్.

టోలోలింగ్ పర్వతం మీద క్రమంగా మంచువాన పెద్దదయింది.

ఉష్ణోగ్రత మైనస్ ఆరు డిగ్రీలకు పడి పోయింది.

మేజర్ రాజేష్ దళసభ్యులు మొత్తం పదిమంది. వారికి అతనే కమేండర్. సభ్యుల్లో వివిధ ర్యాంకుల వాళ్లున్నారు. యుద్ధరంగంలో ఉన్నప్పుడు అందరూ ఒక కుటుంబ సభ్యుల్లా ఆత్మీయంగా మెలుగుతారు. కమేండర్ ఆదేశాన్ని సుగ్రీవాజ్ఞలా తలదాలుస్తారు. అనుక్షణం ఒకరి క్షేమాన్ని ఒకరు ఆకాంక్షిస్తూంటారు. కర్తవ్య నిర్వహణలో కరుగ్గా, కఠినంగా ఉంటారు.

మేజర్ రాజేష్ స్వస్థలం నైనిటాల్.

చిన్నతనం నుంచీ అతనికి సాహసకృత్యాల పట్ల మక్కువ ఎక్కువ. ఆటల్లో, వ్యాయామ క్రీడల్లో, ఎన్.సి.సి.లో మెరిట్ విద్యార్థిగా ఉండేవాడు. ఆర్మీలో చేరి ప్రత్యక్ష యుద్ధాల్లో పాల్గొనాలని కలలుకనేవాడు. అతడి మిత్రుడి తండ్రి ఆర్మీలో బ్రిగేడియర్‌గా రిటైరయ్యాడు. ఆయన తన గతానుభవాలను ఆసక్తికరంగా చెబుతూంటే, రాజేష్ చెవులప్పగించి, కన్నార్పకుండా వింటూండేవాడు. అతని ఆసక్తిని గమనించి బ్రిగేడియర్ ఇంకా ఉత్సాహంగా చెబుతూండేవాడు. ఆర్మీలో ఎలా చేరాలి, ట్రయినింగ్ ఎలా

ఉంటుంది, ఎన్నాళ్లుంటుంది - వగైరా వివరాలన్నీ తరచి తరచి తెలుసుకునే వాడు.

చివరకి అతని స్వప్నం ఫలించి, ఆర్మీలో సెలక్టయ్యాడు. అక్కడ కూడా మెరిట్‌లోనే ఉత్తీర్ణుడయ్యాడు. విధుల నిర్వహణలో మంచి పేరు తెచ్చుకుని మేజర్‌గా పదోన్నతి పొందాడు.

కార్గిల్ దురాక్రమణదారుల్ని తరిమి వేయడానికి 'టోలోలింగ్' శిఖరం మీదున్న స్థావరాన్ని పట్టుకొనే బాధ్యత అతనికి అప్పగించడం జరిగింది. మొత్తం మూడు దళాలు అక్కడ నియమించబడ్డాయి. ఒక్కోదళంలో పదిమంది సభ్యులున్నారు. రాజేశ్ దళం పురోగమించిన తరువాత మరొక వైపు నుంచి రెండవ దళం పురోగమిస్తుంది. ఇంకొక వైపు నుంచి మూడవ దళం పురోగమిస్తుంది. శత్రువు ఏకాగ్రతని భగ్నం చేసి, తాము ఎంతమందో, ఎటు వైపు నుంచీ వస్తున్నారో తెలియని అయోమయం కల్పించి, మెరుపుదాడులతో శత్రువుల్ని మట్టుబెట్టి, స్థావరాన్ని కైవసం చేసుకోవడం ప్రధాన వ్యూహం.

కార్గిల్ యుద్ధం ఇంతవరకూ భారత-పాకిస్థాన్‌ల మధ్య జరిగిన అన్ని యుద్ధాలకంటే భయంకరమైనది. కారణం - దుర్గమ శిఖరాలు, ప్రాణాలు తీసే చలి, ప్రతికూలమైన యుద్ధ రంగం. శత్రువులు శిఖరం మీద - మనం నేల మీద! పైకి ఎగబ్రాకుతున్న సైనికుల్ని మట్టుబెట్టడం బహు సులభం. అలా ఎందరో ప్రాణాలు కోల్పోయారు.

కార్గిల్‌ని కైవసం చేసుకోవడం ద్వారా పాకిస్థాన్, వాస్తవాధీన రేఖని బలప్రయోగంతో మార్చడానికి, వ్యూహపరంగా కీలకమైన శ్రీనగర్ - వే జాతీయ రహదారిని ధ్వంసం చేయడం, కాశ్మీర్ లోయలోకి చొరబడడానికి కొత్త మార్గాలు సృష్టించుకోవడం - ప్రధాన లక్ష్యాలుగా పెట్టుకుంది.

ఈ లక్ష్యాలు నెరవేరకుండా చేయడమే భారత సైన్యం బాధ్యతగా తయారయింది. ఒక ప్రక్క 'లాహోర్'లో శాంతి సమావేశం, మరొక ప్రక్క కార్గిల్‌లో సమరం - పాకిస్థాన్ కుటిలత్వానికి నిలువెత్తు నిదర్శనంగా నిలిచింది.

మాతృదేశ రక్షణ కోసం భారతసైన్యం ఉక్కుపాదంతో ముందడుగు వేసింది. శిఖరాగ్రాల మీద తిష్టవేసుకున్న చొరబాటు దారుల్ని, పాక్ సైనికుల్ని తరిమికొట్టడానికి పూనుకుంది.

మేజర్ రాజేష్‌కి ఆ విధంగా 'టోలోలింగ్' శిఖర విముక్తి బాధ్యత అప్పగించబడింది.

"మేజర్ రాజేష్! ఎక్కడున్నారు మీరు?" - వైర్‌లెస్‌లో కమేండర్ పిలుపు.

"శిఖరాన్ని సగం వరకూ ఎక్కాముసార్. మెల్లగా ముందుకుసాగుతున్నాం"

"వెరీగుడ్... ముందుకు సాగండి! మధ్య మధ్య సమాచారం ఇవ్వండి"

"అలాగే సార్..."

మేజర్ రాజేష్ వైర్‌లెస్‌ని సర్దిపెట్టు కుంటూండగానే, శిఖరం పైనుంచి తూటాల వర్షం మొదలయింది. రాళ్లచాటున నక్కి కదలకుండా ఉండిపోయారు కొద్ది క్షణాలు. తూటాలు తగిలి, రాళ్లు ముక్కలుగా పేలి పోతున్నాయి. మంచు పొగ చెలరేగుతోంది.

ఇక లాభం లేదని "ఫైర్" అంటూ కేకవేసి, శిఖరం వైపు ఏకే - 47 గురిపెట్టి కాల్పులు ప్రారంభించాడు. అతని దళ సభ్యులు కూడా గురి పెట్టి, కాల్పులు వస్తున్న దిశగా తూటాలు గుప్పించారు.

కొద్దిసేపు అలా తూటాల సమరం సాగాక, కాస్సేపు నిశ్శబ్దం ఆవరించింది. "ఫాలోమీ"




అంటు మేజర్ రాజేష్ శిఖరం మళ్లీ ఎక్కడం ప్రారంభించాడు. అతి కష్టం మీద వెయ్యి అడుగులు ఎక్కారు. మళ్లీ పైనుంచి కాల్పులు - క్రింద నుంచీ ప్రతి కాల్పులు - కాస్త విరామం. మళ్లీ ఎక్కడం. ఇలా ఆ చలి రాత్రిలో మేజర్ రాజేష్ దళ సభ్యులు 'టోలోలింగ్' శిఖరం వైపు వెళ్తూనే ఉన్నారు.

శత్రువుల తూటాలకు మొదట సుబేదార్ సింగ్ వీర స్వర్గమలంకరించాడు. అది గమనించిన సహచరులు మనసులోనే అతనికి నివాళులర్పించి, కర్తవ్యపాలనలో ముందుకు సాగారు. ఆ తరువాత ఒకరి తరువాత ఒకరుగా ముగ్గురు మరణించారు. మేజర్ రాజేష్ తన దళ సభ్యులకి మూడు మీటర్ల ముందుగా, ఎలాగైనా సరే శిఖరం కైవసం చేసుకోవాలనే పట్టుదలతో ముందుకు సాగాడు. సహచరులు అనుసరిస్తూనే ఉన్నారు. ఇంక ఇరవై మీటర్ల దూరంలో ఉండగానే రాజేష్ ఛాతీలో శత్రువుల తూటాలు దిగబడ్డాయి.

వైర్‌లెస్ మ్రోగింది.

"సార్! శత్రుస్థావరానికి ఇరవై మీటర్ల దూరంలో ఉన్నాం. మేము సాధించాం సార్..." అంటూండగానే అతని శ్వాస ఆగిపోయింది.

"మేజర్ రాజేష్..." కమేండర్ ఆదుర్దాగా అరవడం ఆ నిశీధిలో స్పష్టంగా వినిపిస్తోంది. వెనుకగా వస్తున్న సహచరులు శత్రుస్థావరం మీద గ్రెనేడ్లు విసిరి ధ్వంసం చేసారు. శత్రువులు పూర్తిగా నాశనమయ్యారు. అత్యంత కీలకమైన 'టోలోలింగ్' భారత సైన్యం వశమైంది. అక్కడ త్రివర్ణ పతాకం రెపరెపలాడింది.

ఆ మర్నాడు మేజర్ రాజేష్ భౌతికకాయం అతని స్వస్థలం నైనిటాల్‌కి చేర్చబడింది.

నదీ తీరంలో బంధువులు, మిత్రులు, అభిమానుల నివాళులతో పెద్దన్నగారి సమక్షంలో 'మేజర్ రాజేష్' అంత్యక్రియలు జరిగాయి. ఆయన ఇప్పుడు వీరస్వర్గంలో ఉండి, మరొకసారి భరతభూమిలో జన్మించడానికి నిరీక్షిస్తున్నాడు. ●

ఆఫీసులో అడుగు పెడుతూండగానే బల్ల మీద పసుపురాసిన కవరు ఒకటి కంట పడ్డది. దాన్ని చూస్తుండగానే ఛెళ్లున వీపు నెవరో చఱచినట్టు జ్ఞాపకం వచ్చింది నాకు. రఘునాధరావుకు మాట యిచ్చాను. మర్చిపోయాను. నామీద నాకే అసహ్యం వేసింది.

"బాబ్బాబూ!" అంటూ బ్రతిమాలిన పెద్దమనిషికిచ్చిన మాట మర్చిపోయాను. మంచి స్నేహితుడ్ని అనుకుంటూ నా మీద గంపెడాశ పెట్టుకున్న మిత్రుడికి చేసిన వాగ్దానం మర్చిపోయాను. గానుగెద్దు బ్రతుకు. గాడిలో పడిపోయిందీ బ్రతుకు! నేను బదిలీ అయి రావడం, యిక్కడాఫీసులో 'జాయి'నవడం అన్నీ అయిపోయి మూడు వారాలపైమాట!

వీధివీధిలోనూ శ్రీరామనవమి ఉత్సవాలు అయిపోతున్నాయి. హై రోడ్ల మీద శ్రీరామ నవమి పందిళ్ళకు గుంజలు టెలిఫోన్ కేబిల్‌లు తెగేలా గోతులు తవ్విపారేశారు. పెళ్ళి పందిళ్ళు కూడా వేసేస్తున్నారు చాలా చోట్ల. ఝుమ్మని వేసంకాలం, పెళ్ళిళ్ళకాలం కూడబలుక్కొని వచ్చేస్తున్నాయ్!

అయ్నా నేను రఘునాధరావుకిచ్చిన మాట మర్చిపోయాను. ఇప్పుడెవరిదో ఈ శుభలేఖ చూసేదాకా నేను శ్యామల్నీ, వసుంధర్నీ కూడా మర్చిపోయాను.

మర్చిపోయానా?... మర్చిపోలేదు!

చూద్దాం... చూద్దాం అనుకుంటూనే బద్ధకించాను. వైశాఖం అల్లంత దూరానికొచ్చేస్తోంది.

నేను బదిలీ అయి వచ్చేస్తోవుంటె... పాపం. రఘునాధరావు, శ్యామలా దంపతులు యిద్దరూ పిల్లల్తో సహా స్టేషన్‌కు వచ్చారు. రైలు కదిలేదాకా ఉండి మరీ నన్ను దిగబెట్టారు. పెళ్ళీడు పిల్ల వసుంధర. దాన్ని నాకు చూపించి

## పాత బంగారం

'ఓల్డ్ ఈజ్ గోల్డ్' అనే సామెత అందరికీ తెలిసిందే. ఆ బంగారం విలువను నేటి పాఠకులకు రుచి చూపించడం కోసం మా ఈ ప్రయత్నం.

*1971 లో అంటే 35 సంవత్సరాల క్రితం వ్రాయబడిన 'వీరాజీ గారి' కథ ఇది. అప్పట్లో ఇది 'స్వాతి'లో ప్రచురించబడింది.*

అస్వాదించండి... మీరు కూడా...

\- ఎడిటర్

"గుండెల మీద యీ కుంపటి దిగాలి". అప్పుడు ఈ కంటినిండా నిద్దర అన్నయ్యగారూ" అన్నది శ్యామల. శ్యామల యెంత మంచిది! సొంత అన్నదమ్ముడికి ట్రాన్స్‌ఫర్ అయి వెళ్ళిపోతున్నట్లు బాధపడ్డది! కానీ నేనే 'ఉత్తమ యిల్లాలు, ఆ పిల్లకు మాట యిచ్చి అన్యాయం చేశాను. ఈ వూరొస్తూనే ఆ వూసే మర్చి పోయాను.

వెంటనే లోపలికెళ్ళి మేనేజర్ని చూసి, శలవడిగి 'ప్రకాశం' అనే కుర్రవాడి గురించి వాకబుచేద్దామనుకున్నాను. కాని అప్పుడే ప్రక్కనే కూర్చున్న సుభద్రాచార్యులు చిటికెడు నశ్యం ముక్కులోకి దట్టించి 'అచ్చి'మన్నాడు పెంకులెగిరేలా. 'ఛీ! శుభం కోర్రా, అంటే!' అని లోపలే విసుక్కుని రేపు పోదాంలే అనుకున్నా.

ఇలాగే అక్కడ ఆఫీసులో నా ప్రక్కనే కూర్చునేవాడు రఘునాధరావ్. కానీ ఇలాంటి వాడు కాదు. మంచివాడు. పిల్లలవాడు, మర్యాదస్తుడు. నిజంగా నేనంటే ఆ మొగుడూ పెళ్ళాం కూడా ప్రాణం పెట్టేవారు. కానీ నేనో! 'మా' వసుంధరకు అంటే రఘునాధరావ్ దంపతుల జ్యేష్ఠ పుత్రికకు పండంటి వరుడొస్తాడమ్మా అంటూ చెప్పి మరీ యిలా యీ వూరు బదిలీ

అయివొచ్చి మర్చిపోయాను.

శ్యామల భర్తకన్నా మంచిది. "అన్నయ్య గారూ!" అంటూ నోరారా పిలిచేది – "వొదినె గారు పురిటికి వెళ్ళారు, మీకేమో యిలా బదిలీ అయింది. పాపం! ఆ పాడువూళ్ళో మీకు హోటేలు మెతుకులు ఎలా వొంటిని పడతాయో నని" – బాధపడ్డది. ఆవకాయ 'హార్లిక్స్ సీసా' నిండా పెట్టియిచ్చింది. కందిపొడుం స్వయంగా విసిరి, గ్లూకోజు డబ్బానిండా పోసియిచ్చింది. అవి నేనెక్కడ మర్చిపోతానో అని చెప్పి; రైలు కదిలేదాకా హెచ్చరిస్తూనే ఉంది.

ఓ ముక్కా యింత వూటా, సిగ్గుపడక హోటేలుకి పట్టుకుపోయి, వేసుకోండి అన్నయ్యగారూ! అని చెప్పింది.

వసుంధరను చూపించి, "మీ మేనకోడలే ఆ ఆవకాయ పెట్టింది. ఎలా ఉందో రాయండి" అన్నది. అంతమంచి శ్యామల తన కూతురికి వరుణ్ణి వెతకడానికి నేను బద్ధకించుతానని ఎలా అనుకుంటుంది? పైగా నేను రైలు కదిలే ముందు వసుంధర బుగ్గమీద చిన్న చిటికెవేసి, 'దీనికేం? బంగారు బొమ్మ. రాజాలాంటి వరుణ్ని యిస్తాడు దేవుడు" అన్నాను.

రఘునాధరావు చెప్పాడు... అతని దృష్టిలో నున్న ఒక అబ్బాయి గురించి. పేరు ప్రకాశం. బియ్యే ప్యాసైనాడట... ఆర్.టి.సి. ఆఫీసులో వెయ్యి నూట యాభై వరకూ తెచ్చుకుంటున్నాడట. పైగా 'బాదరు బందీ' లేనివాడు. గ్రంథం వారి మేడ అని లచ్చీపేట ప్రాంతంలో ఎవర్ని అడిగినా చెబుతారట. అక్కడ "బాచులర్స్" చాలా మంది ఉంటున్నారట. కుర్రవాడు బుద్ధిమంతుడనీ పాతికపైచిలుకు వయసనీ విన్నా! వీలైతే ఆ వూరు పోంగానే నువు కాస్త కనుక్కొని నాకు రాయి". ఈ వైశాఖం వూరికే వెళితే "నేను ఉరిపోసుకుంటా"నంటూంది మీ చెల్లెలు. కన్నెధారపోసేస్తాను. దాని పోరైనా తీరుతుంది"... అన్నాడు.

నేను తలూపాను. తప్పకుండా అలాగే చూస్తాను అన్నాను. నాకు మాత్రం బాధ్యత లేదా? అన్నాను.

కాని యిదే నా? బాధ్యత?

చైత్రమాసం యెండే ఐనా ప్రచండంగా ఉంది. అయినా సరే రేపు వెళ్దామనుకున్నాను, వసుంధరకు దాచకుండా చెప్పినా యింకా పదిహేడు సంవత్సరాలు. స్కూలు ఫైనలు పరీక్షలు – పాపం! బాగానే రాసింది. ఒక్క మార్కులో పోయింది వెధవ పరీక్ష – మా శ్యామల చాదస్తంకానీ యీ రోజుల్లో మరీ యిలా పెద్ద మనిషి కాంగానే అలా మూడు ముళ్ళూ యెవడు వేయిస్తున్నాడూ అంటా!

ప్రకాశం అనే కుర్రవాడి గురించి మా రఘునాధరావుకు యెవరు చెప్పారో కాని, మా వాళ్ళిద్దరి మనస్సుల్లోనూ తమ పిల్లకు అతగాడే తగిన వరుడు అని బాగా నాటుకుపోయింది. నేను కూడా ఎంచేతనో "అవుతుందమ్మా! అవుతుంది" అన్నాను శ్యామలతో.

"ఆ నాలుగక్షింతలూ నువ్వేవేయాలి అన్నయ్యా" అన్నది వెర్రిబాగుల్ది. శ్యామల తొందర్లో నోరుజారినన్ను "అన్నయ్యగారూ" అనడానికి మారుగా "అన్నయ్యా" అని, బహువచనానికి బదులు 'నువ్వు' అనీ కూడా అనేసింది. రైలు కదిలిపోయింది. ఆ దంపతుల బేలతనానికి నా హృదయం కదిలిపోయింది.

రైలు కదలంగానే, మొదట వాళ్ళు ఆప్యాయంగా తెచ్చియిచ్చిన సంచి చూసుకున్నాను. అందులో శ్యామల వసుంధర 'చేసినట్లు' చెప్పిన అవకాయ, కందిపొడుం వగైరా ఉన్నాయి. చేగోడీలు, జంతికలూ ఉన్నాయి. నేను ప్రకాశం అనే కుర్రవాడు అదృష్టవంతుడనుకున్నాను. వసుం




ధర కాస్త చామనచాయ కాని, 'కళ' ఆ అమ్మాయి మొహంలో మూర్తీభవించి ఉంటుంది. గుణవంతురాలు, పనిమంతురాలు.

నేను జరిగిపోయిన అన్యాయాన్ని లెంపలు మనసా వేసుకున్నాను. మర్నాడు శలవుకోసం చీటీ రాశాను.

గ్రంథం వారి మేడకదూ అన్నాడు.

ప్రకాశం గురించి, అతని "పత్తాసత్తా"ల గురించీ రఘునాధరావు చెప్పింది జ్ఞాపకం తెచ్చుకొంటున్నాను. నెమరువేసుకుంటున్నాను.

పాతికేళ్ళు పైచిలుకే వుంటాయట అబ్బాయికి. రఘునాధం చెప్పినదాన్ని బట్టి ప్రకాశాన్ని ముందూ వెనుకా ఎవరూ లేరు. పైగా తల్లీ దండ్రీ కూడా స్వర్గస్థులైనారల్లే ఉంది. ఒంటరిగా పట్నవాసాన పొట్టపోసుకుం టున్నాడు. హోటలు మెతుకులు తినలేక కాస్త వంటా వార్పూ వచ్చినపిల్ల దొరికితే చాలు – కాపురం పెట్టేసుకుందామని అనుకుంటున్నాడని రఘు. నాధరావుకు ఎవరో చెప్పారట.

"వంట వండే యిల్లాలు చాలూ; వైజయంతి మాల లాగా డాన్సూ, లతామంగేష్కర్ లాగా పాటా అక్కర్లేదూ అంటే మా వసుంధర కన్నా ఎవడికైనా మరో చక్కని యిల్లాలు దొరకదు". ఆ సంగతి నేను చెప్పగల్ను.

నేరుగా నేను మండుటెండ అయినా లెక్క చేయక చెమటలు వొత్తుకుంటూ ఆర్. టి.సి. ఆఫీసుకి పోయాను. పాతికేళ్ళవాడు, ఫలాని వారి అబ్బాయి, వాళ్ళవూరు కంకిపాడు కాబోలు... అంటూ ఎంక్వయిరీ చేశాను. అతని తండ్రి పేరు తెలియదు, తల్లిపేరు తెలియదు. కానీ పట్నవాసంలో ఉద్యోగాలు చేసే మొహాల్ని పట్టుకోడాన్కి అమ్మా, నాన్నల పేరు అక్కర్లేదుగా!

కర్మకాలి యిద్దరు ప్రకాశాలున్నారట. ఒకడు అక్కౌంట్స్ సెక్షన్‌లో ఉంటున్నాట్ట. రెండోవాడు జనరల్ డిపార్టుమెంటుట!

అదృష్టవశాత్తు రెండో ప్రకాశానికి మూడేళ్ళ క్రితమే పెళ్ళైపోయింది. అంటే మనకు కావాల్సిన ప్రకాశం యితడు కాదన్నమాట.

ఎందుకంటే నేను రఘునాథం దగ్గర మాట యిచ్చి యీ వూరు - అంటే 'బదిలీ' అయ్యే అనుకోండి - వచ్చి రెండు నెలలెక్క డయిందీ? మూడు వారాలేగా!

ఆ "పెళ్ళికాని ప్రకాశం" అనేవాడు కావా లని వాకబు చేశాను. ఎవరికెవరు? తన ప్రక్క సీటులో కూచుని పనిచేస్తున్నవాడు శలవుమీద ఉన్నాడో, బర్తరఫ్ అయే వెళ్ళాడో, వున్నాడో వూడేడో తెలీదు అనేవాళ్ళున్నారు. కానీ చివరికి అప్పారావుట అతనిపేరు... అతను చెప్పాడు. ప్రకాశం కొంచెం నల్లగా, కాస్త లావూ అని లావుగానూ గాక; సన్నంగా అని సన్నమూగాక సుమారు తనంత ఎత్తు (అతను నా అంత ఎత్తు న్నాడు) వుంటాడట. అయిదారు రోజులైందిట. శెలవు పెట్టినట్లుం దిట. కారణం అప్పారావుకు తెలియదట. ఇక యీ 'ట' కారాలతో లాభం లేదని నేను లబ్బీ పేట - అంటే ఆ అబ్బాయి ఉండే నివాసస్థలా నికే ప్రయాణం అయ్యాను. రిక్షావాణ్ణి పిలిచాను. అరఫర్లాంగు దూరంలో నిలబడి, 'కావాలంటే' నువ్వే యిక్కడదాకా రా అన్నట్లు గంట కొడ తాడేగానీ దగ్గరికి రాలేదు. ఎండ అలా ఉంది! కాకులు కూడా సోలిపోతు న్నాయి!!

కానీ రఘునాథరావు, శ్యామల వాళ్ళ రుణం ఎలా తీరుతుంది? తెల్లవారు ఝామునైనా, అర్ధరాత్రియైనా సరే లేచి విసుక్కోకుండా నాకు కాఫీ కలిపి తెచ్చియిచ్చే శ్యామల. భోజనాల వేళ వెళ్తేచాలు... విస్తరి వేస్తేనే కానీ కదల్నిచ్చేవాడు కాదు ఇంటాయన. పిల్లలంతా మావయ్యా అం టూ నాతోనే ఉండేవారు. మా ఆవిడను పురిటికి పంపిన మూడు మాసాలూ నాకు రఘునాథ రావుగారి ఇంటనే యించుమించు గడిచిపో యింది.

ఆ గ్రంథం వారి మేడ యీ 'రఘు' అన్నట్టు నిజంగా 'పాపులరే'! దానిగోడల మీద ఎలక్ట్రిక్ తీగెలకు వేళ్లాడే గబ్బిలాల్లాగ అక్కడా అక్కడా గుడ్డలూ తువ్వాళ్ళూ అవీ వ్రేలాడుతున్నాయి. గదుల పెట్టెలో అరలలాగున్నాయి గదులు. వరసాగ్గా వున్నాయి.

ఎండ! ప్రాణాలు పోయాయి. అది చూసే సరికి కాస్త కుదుటపడ్డాయి. అక్కడే ఉన్న "పాకలో" చెరుకు రసం అమ్ముతున్నారు. మరి న్ని నీళ్లు పోసియిమ్మని అది యింత త్రాగా యీదురోమంటూ మూడో అంతస్తుదాకా యెక్కాను.

అంతా బ్రహ్మచారుల్లాగే వున్నారు! సిగరెట్ ధూమం వరండాలోకి నా ముక్కుపుటాల్లోకి దూరి వస్తోంది. గది కిటికీలకు రీటా హేవర్త్ నుంచి జ్యోతిలక్ష్మి బేతింగ్ సూటు వేషం దాకా ఉన్న అన్నిరకాల బొమ్మలూ రంగురంగుల్లో అతికించి ఉన్నాయి.

ఒక గది మీద ప్రకాశమూర్తీ యల్.యల్. అని సుద్దముక్కలతో "రాసి, రాసి, రాసి" స్పష్టం గా వుండేలా చేసిన పేరుంది. ప్రక్కనే రంగు సుద్దతో ఆర్.టి.సీ అని ఉంది, బ్రాకెట్‌లో. కానీ ఏం లాభం?

గది గుమ్మంకో గొళ్లెం, దానికో తాటికా యంత తాళం కప్ప వేసి ఉన్నాయి. ప్రక్క రూము లో నుంచి యీల వినపడుతోంది. మిట్ట మధ్యా హ్నం లాగే ఉంది అవతలెండ. కానీ గంట నాలుక్కావస్తోంది. తలుపు కొట్టాను. మళ్లా సాయంకాలం అయితే సినిమాలకు పోతారుగా కుర్రాళ్ళు.

"కమిన్" లోపల్నించి ఒక కంఠం!

"ఈ ప్రక్క రూమ్‌లో ప్రకాశం అనీ..."

"హీయీజ్ గాన్..." మళ్ళీ యీల వేసు కుంటున్నాడా యువకుడు.

ఎక్కడికి వెళ్ళాడండి?

'డోంట్ నో సార్!' మళ్లీ యీల...

"సారీ" అంటూ యివతలి వేపు రూమ్‌లోకి తొంగి చూసాను.

"ఎవరూ?" అన్నాడు కొంచెం పీలగావున్న యువకుడొకడు.

"ఈ ప్రక్క రూమ్ అబ్బాయి ప్రకాశం...?"

"ఓ...అతనా? వూరెళ్ళాడండీ..." అన్నాడు. లుంగీ ఒకటి మాత్రం కట్టుకున్నాడు. ఉక్క చంపేస్తోందిగా మరి! గుండెల మీదకు ఓ తువ్వాలు పడేసుకుంటూ చెప్పాడతను పడక మంచం మీద పడుక్కునే.

"మీరేమీ అనుకోపోతే, మే అయి కమిన్?" అన్నాను లోపలికి వెళ్లిపోయి.

"షూర్! షూర్! రండి" లేచి కూచుని ఓ స్టూలు నాకేసి తోశాడు.

ఈ అబ్బాయినీ ప్రకాశం గురించి అడగవల్సినవీ, అడగరానివికూడా అన్నీ అడిగాను. ప్రకాశమూర్తి వాళ్లవూరు కంకిపాడేగాని, అతనికి అక్కడ ఎవరూ లేరట. ఒక యిల్లు ఉంది. దాని మీద అద్దె వస్తుందిట. ప్రస్తుతం వాళ్ల దూరపు బంధువులెవరో వుంటే అక్క డికి... అంటే బందరుకి వెళ్ళాడట.

నాకు పూర్తిగా ఆశ నిరాశైపోయింది.

"ఇక లాభం లేదు" అనుకున్నాను. అయినా ప్రయత్నం ఎందుకు వదిలేయాలి? ఆ అబ్బాయినే మరికొన్ని ప్రశ్నలు వేశాను.

నిజమేనట! ప్రకాశం చాలాసార్లు తనతో చెప్పాడట. 'వొంట వొండి కాస్త వుప్పుకారం సరిగ్గా వేసి పెట్టేటందుకేనా ఒక అమ్మాయిని తను పెళ్ళిచేసుకోబోతున్నట్టు.

కట్నం 'ఆశా' అంటూ లేదు కానీ కనీసం పాతికవేల నూట పదార్లేనా ఉండొద్దా? అని ఈ అబ్బాయి అన్నాడు (ఇతని కోర్కె కాబోలు)

ఆ మాత్రం మా రఘునాథం యివ్వగలదేమో! అనుకున్నాను. సరే... పెళ్ళి కొడుకు కోర్కెలు యింకా యేమున్నాయోనని ఆరా తీయబోయాను. స్కూల్ ఫైనల్ ప్యాసు అయిన పిల్ల అయితే మంచిదని, అలాంటిదే ఓ సమ్మంధం చూడటాన్కి తన స్నేహిడుతు వెళ్లాడనీ యీ లుంగీ అబ్బాయి చెప్పాడు.

నాకు ఉత్సాహం నీరు గారిపోతోంది. ఒక మార్కులోపోయింది వసుంధర పరీక్ష.

అయినా! యితగాడేం ఉద్యోగం యివ్వడు కదా? పెళ్ళిచేసుకుంటాడు. కాపురం చేస్తాడు. అంతేగా! ప్యాసైంది అంటే సరి. సర్టిఫికెట్ తేండి చూస్తాను. అనడుగా! అమ్మాయిలకి అంతకన్నా చదువేం చేసుకోనూ? చాదస్తంకానీ...

పిల్ల తెల్లగా అని దంతం బొమ్మలాగ లేకపోయినా నల్లగా ఉండకూడదట! తనేం మహా తెల్లగా ఉన్నాడని? అని నేను లోపలలోపలే విసుక్కున్నాను. మా వసుంధరను చూస్తే అతనే నచ్చుకుంటాడు లెమ్మనుకున్నాను.

"మీ నేస్తం వస్తే కాస్త నాకు ఫోన్ చేస్తారూ? నేను అతనికి చాలా కావాల్సిన వాణ్ని' అంటూ ఆ యువకుణ్ణి కోరాను. మా ఆఫీసు "నెంబర్" కాయితం ముక్క మీద రాసి అందిస్తూ...

"ఆఫ్‌కోర్స్, ఐవిల్ ట్రాయ్" అన్నాడు అతగాడు

"థాంక్యూ... థాంక్యూ" అంటూ లేచాను.

★ ★ ★

బయటకు వచ్చాను. నిక్షేపం లాంటి సంబంధం. వెనకాముందూ యెవరూ లేని సంబంధం. నేను రఘునాథం చెప్పినట్లు ఒక్క వారం రోజుల ముందు రావాల్సింది. వచ్చి వుంటే యీ కుర్రవాడు యిటు బందరెందుకూ సముద్రంలోకి? యించక్కా అటు గోదావరి (గోదావరి స్టేషన్‌లెండి) కే వచ్చేవాడు.

శ్యామలకు నేనేమని చెప్పను?

ఏం చేస్తాం? కల్పవృక్షం లాంటి సంబంధం పోగొట్టాననే నాలుగు అక్షింత గింజలూ నా నెత్తిన పడే ప్రారబ్ధం ఉన్నప్పుడు. అనుకుంటూ నేను నా 'బస' మొహం పట్టాను. కానీ ఆశపోలేదు.

రఘునాధరావు ఉత్తరం రాశాడు. ఆ వుదయమే వచ్చిందట. మా కొత్త యిల్లు గలాయన యిచ్చాడు. ఏం రాయను? – పాపం! 'నువ్వు తీసుకుని రమ్మంటే, పిల్లను ఆ వూరే తీసుకుని వస్తా. మీ యింట్లోనే ఏర్పాటు చేద్దాం. కుర్రవాణ్ణి వొచ్చి చూసుకోమను' – అని రాశాడు.

నేను జవాబు రాయలేదు.

వారం రోజులు పోయాక మరింత ఫెళ్ళున యెండకాస్తున్న వేళ నేనే కాళ్లీడ్చుకుంటూ గ్రంథం వారి మేడ 'పరవస్తువారి వీధి'కి పోయాను. ప్రకాశం ప్రక్కనున్న గదిలోని యువకుడు ఫోన్ నెంబరు పారేసుకున్నాడు కాబోలు! ఏ కబురూ లేదు.

ఈసారి యీ 'నైబర్ పక్షి' కూడా లేదు.

ఎక్కడో పెళ్లిచూపులకని చూడ్డాన్కి వెళ్ళాడేమో? ఇవతల ప్రక్కనున్న యీలగానలోలుణ్ణే పట్టుకున్నాను. నాలుగు యింగ్లీషు ముక్కలు నేనుకూడా 'ఝునా'యించే సరికి తెనుగులోకి దిగాడు అతగాడు.

ప్రకాశం కంకిపాడు వెళ్ళాడన్నాడు.

ఎందుకూ?

మాచ్ ఏదో ఉందిట? అని చెప్పాడు.

నాకు ఇంకా ఆశ వుంది. పోలేదు.

ఏం మ్యాచ్? చెడుగుడా? బాడ్మింటనా? అన్నాను ఆశగా!

నవ్వాడు ఆ యువకుడు. నన్ను అదోలా చూసి, మీలాంటివాడే ఎవరో పెద్ద మనిషి ఒకరు వచ్చి తీసుకెళ్ళారు – అని మళ్లీ నవ్వాడు.

నాకర్థమయింది... చివరికి కన్నవూరే గతి అయిందా?

ఇకరాడా? – అడిగాను దీనంగా.

వస్తాడు కాని 'యిట్ మే టేకే మంత్ – నెల్లాళ్ళవుతుందేమో?

'సరి... సరి...' అన్నాను కసిగా.

ఆ వూళ్లో అతని మేనమామగారి ఇంటికి వెళ్లాడు. లాంగ్ లీవ్ మీద – 'చెప్పాడు' ఈలగానలోలుడు.

'థ్యాంక్స్' చెప్పాను.

లేచాను. తిన్నగా కంకిపాడు వెళ్లాల్సిందే; ఎవరి కోసం వెళ్తాను? 'దేవుడనే వాడున్నాడా?' మనిషికి కలిగెను సందేహం... అంటూ ప్రక్కనే వున్న ఒక పెళ్ళి పందిట్లోంచి మాంచి ఎండవేళ పాట దంచేస్తోంది!

ఇన్ని యుద్ధాలూ ఇంత కరువూ ఇంత కలికాలం మండుతున్నా ఏభై గజాలకో పెళ్ళి చొప్పున ఝూమ్మని అయిపోతున్నాయి.

ఇంతకీ ఈ ప్రకాశమనేవాడున్నాడా? మా వసుంధరకు కూడా యీ సీజన్‌లోనే ఆ మూడు ముళ్ళూపడేనా? అన్న అనుమానం కలిగింది నాకు.

బస్సులో చాలామంది యెక్కడికీ అంటే 'మా వాళ్లింట్లో పెళ్లికి' అంటున్నారు. నేనూ మా వసుంధర పెళ్లికి యిలానే అంటాను. నాకు సంతోషంగా ఉంది ఆ మాట తల్చుకునేటందుకు. మా పెద్దమ్మాయికి యింకా నాలుగో ఏడు. రెండోదో, రెండోవాడో యింకా పుట్టాలి. పురిటికెళ్ళిందిగా మా యావిడ!

ఆ చిన్న పల్లెటూళ్ళోకూడా ఝూమ్మని నిర్మోహమాటంగా బెజవాడ ఎండలాగ, గ్రామఫోన్ రికార్డులతో, లౌడ్‌స్పీకర్‌లను బ్రద్దలు

కొడుతూ రెండు పెళ్ళిళ్ళు అయిపో తున్నయ్!

నా గుండెలు గుబగుబలాడాయి.

ఒక ప్రక్క గాడ్పు గూబగుంయ్‌మని కొడు తోంది.

నన్నంతా కొత్త మృగాన్ని చూసినట్లు చూస్తు న్నారు. మళ్ళీ ప్రకాశం అంటూ 'వాకబు' చే సాను. "ఆ నాలుగోసందు" అన్నారు. అక్కడికి వెళ్ళాను. పెళ్ళిపందిరుంది. నాకు ధైర్యం చాల లేదు. అయినా ఒక పెద్ద మనిషిని అడిగాను.

"ఎవరిది బాబూ ఇక్కడ వివాహమూ?"

"చిన్నా వుటా = పల్లోరి పెద్ద బుల్లబ్బా యిది" అన్నాడు ఒకడు.

"బ్రతికాం" అనుకున్నాను.

ఈ పందిరి మీద లౌడ్‌స్పీకర్ 'గోలను' తల దన్నుతూ మరిన్ని లౌడ్‌స్పీకర్లతో గోలచేస్తో మరో ఫర్లాంగు దూరంలో మరో చిన్న పంది రుంది.

ఫలనా అబ్బాయి అని అడుగుతూ వుంటే అందరూ ఆ పందిరికేసే చూపెడుతున్నారు. నాకు దుఃఖం లాంటిది ఏదో లోపల కలుగు తోంది. అక్కడకు చేరుకునేసరికి గొంతెండి పోయింది. ఆ పందిరి, పచ్చతోరణాలు... అన్నీ చూస్తూవుంటే ఇక నాకీ జన్మలో మా శ్యామల మొహం చూసే యోగ్యత లేదన్నది స్పష్టమయి పోతోంది.

భగవంతుడా! ఎంత పనిచేశావురా? ప్రకా శం అనడానికి బదులు దాహం అన్నాను నేను పందిట్లో చేరి! ·ఎవరో యిచ్చారు. ఆడపెళ్లి వారా? మగపెళ్ళివారా? అన్నారు మరెవరో – నీళ్లుతాగి తేరుకొని.

ఇది ఫలానీ యల్.యల్. ప్రకాశమూర్తి బి.ఎ (ఆర్.టి.సీ ఆఫీస్) బెజవాడ అబ్బాయి పెళ్ళేనా? అని భోగట్టాచేశాను.

"ఔను... తమరు మావాడి ఆఫీసులో పని చేస్తారా?" అంటూ ఓ పెద్ద మనిషి నా చేతిలో ఓ కర్పూరపు పేరూ తాటాకు విసనకర్రా పడేశాడు.

ఇంకెక్కడ నేను?... ముచ్చెమటలు పోస్తు న్నాయి. ఎండచేతకాదు. ఆ చెమట వేరు. ప్రకాశం అన్న వాడెవడో, ఎలా ఉంటాడో కానీ – ఆ కుర్రాణ్ని ఒక్క గ్రుద్దుకు చంపేద్దామని పించింది. కానీ పచ్చని పెళ్ళి పందిట్లో అంత దారుణంగా ఆలోచించలేకపోయాను అతనేం చేస్తాడు?

బహుశా యీ అమ్మాయి తెల్లగా వుందేమో దంతం బొమ్మలాగా...

బహూశా యీ అమ్మాయి స్కూలు ఫైనల్ డిస్టింక్షన్‌తో పాసయిందేమో! తెలివైంది కా బోలు...

బహుశా ఈ అమ్మాయి వయస్సు ప్రకాశం అనే శాల్తీ కోరినట్లు 19 సంవత్సరాలేనేమో.

కనీసం కట్నమేనా దండిగా పలికిందేమో... ఏమో!... ఏమో...

ఇవన్నీ నా కుతూహలాలు! నా దుఃఖాలు! భోగట్టా చేయకుండా ఎలా వుంటాను? చేశాను.

మేనమామ కూతురేనట? మొదటి నుంచీ వద్దూ అంటూనే చివరికి హోటలు కూడు తిన లేనో అని మొత్తుకొని కుర్రాడు దారి కొచ్చాట్ట! ఎంతమాట?

'కట్నమా?' బ్రతికి బాగుంటే తన తదనం తరం కుర్రాడికి రెండెకరాల "మెట్ట" యిస్తానని అన్నాడట (మేన)మామగారు.

ఎవరో అంతలో వచ్చారు... ఇన్ని అక్షిం

తలు నాచేతిలో పోశారు. లౌడ్ స్పీకరులో 'పయనమయే ప్రియతమా' పాట మానేసి వాయిద్యాలు, మంత్రాలు రుపేస్తున్నాయి.

పెళ్ళయిపోతోంది! గ్రుక్కతిప్పుకోకుండా ఐపోతోంది. నేనాపలేను ఈ పెళ్ళి? మా వసుంధరది కాదు ఎవరిదో!

కానీ! ప్రకాశం అన్న ఆ కుర్రాణ్ణి మొదటిసారీ ఆఖరిసారీ, యింత దూరమూ ఎలాగా వచ్చాను కనుక ఓసారి చూడాలీ అనుకున్నాను.

ఉక్కుముక్కలా ఉన్నాడు. మా వసుంధరకు దీటురాడు. పెళ్ళి కూతుర్ని చూశాను. రామ రామ తెలుపుకాకపోతే అదేపాయె కృష్ణమ్మే! పైగా చిన్నకళ్లు, పెద్ద చెవులూ.

ఎనిమిదో క్లాసు దాకా బళ్లోకి వెళ్ళిందట! మా వసుంధరను చూస్తేనా? యీ కుర్రాడు

సాష్టాంగపడి మరీ చేసుకుంటానని అడిగేవాడు... ప్చ్...ప్చ్... అక్షింతలు అరచేతి చెమటకి నానిపోతున్నాయి. వేయనా? మానినా?

ఏమొహం పెట్టుకుని వేస్తాను?

శ్యామల బేలమొహం, ఆ నుదట ఎర్రని కానీ కాసంతబొట్టూ, ఆర్ద్రమైన కనులతో "అన్నయ్యగారూ" అంటూ కనబడ్డది.

అన్నయగారినా? నేనా! ఛీ...

ఈ అక్షింతలు మా వసుంధరకు వేయాలి. ఈ ప్రకాశం ఎవడు మనకి? అనుకున్నాను. వెనుదిరగబోతున్నాను. మంగళ వాద్యాల మధ్య మంత్రాల మధ్య అక్షింతలు వేయండి వేయండి – అంటున్నారు.

మంగళసూత్రధారణ జరుగుతోంది.

చూశాను మరోసారి వెనుదిరిగి –. పెళ్ళి కూతురు ఎవరైతేనేం? శోభాయమానంగా ఉంది. ఈ పచ్చని పందిరికి క్షణం క్రింద నిప్పంటుకోరాదూ? అనుకున్న నాకు యిప్పుడు పశ్చాత్తాపంగా ఉంది.

పెళ్ళికూతురు ప్రక్కనే ఆ పిల్లతల్లి కాబోలు ఉన్నది. తను నవమాసాలు మోసి కన్న ప్రాణి! పెంచిన కన్నె! తనలో నుంచి వచ్చిన తన తపన –తన భాగం–తనే వేరై పెరిగిన ప్రాణి! పరాయిదైపోతూంటే... ఆ తల్లి పడే వేదన ఒక చెంప–తన బాధ్యత తీరుతున్నది అనే తృప్తి, రెండో చెంప ప్రతిబింబిస్తూ వుంటే మాతృమూర్తి అచ్చం మా శ్యామలలాగే ఉంది!

మా శ్యామలకు, ఈమెకూ భౌతిక రూపంలో పోలికలు లేవేమోకాని, నాకు ఆమెలో శ్యామల కనబడ్డది.

అక్కడ పెళ్ళిపీటల మీద కూర్చున్నది. మా వసుంధరా?... కాకపోవచ్చును...

కాదు... కానీ అవుతున్నది సామాజికమైన శుభకార్యం.

మంగళతూర్యారావాల మధ్య ఈ ఇద్దరికీ యిలా ముడి పడవల్సి వుంది కాబోలు. ఇది ఘటన... నేనెవర్ని?

'దీర్ఘ సుమంగళీభవ' అంటూ పెళ్ళి కూతురుమీద, దీర్ఘాయుష్మాన్‌భవా అంటూ వరుని తలమీదా అక్షింతలు అప్రయత్నంగా ఏదో అభూత శక్తి ప్రేరణ క్రింద పనిచేస్తున్న యంత్రంలా వేసేను. ఆ పందిరికేసి, ఆ పైనున్న మండుటెండాకాశంకేసీ చూశాను.

తిరుగుముఖం పట్టాను.

ఎండ అలాగే మండిపోతోంది.

నా గుండెల్లో కూడా అలాగే వుంది.

కండువాతీసి నెత్తిన కొంగువేసుకున్నాను. ●

## నమ్మాల్సిందేనండోయ్!

# అద్భుత ద్వారక

సాధారణంగా ఎవరేమి చెప్పినా మనం నమ్మం సరికదా అదంతా 'ట్రాష్' అని కొట్టి పారేస్తాం. అంతేకాదు... రామాయణం, మహాభారతం ఇవన్నీ ఎవరో కాలక్షేపానికి వ్రాశారనీ అంటాం. భగవద్గీత అంత తక్కువ సమయంలో కృష్ణుడైనా ఎలా చెప్పగలడూ? అసలూ కృష్ణుడున్నాడా? – ఇలా సాగుతుంది కొందరి ధోరణి. తీరా ఏ విదేశీయులో నిర్ధారించాక "అడ్డెడ్డె, నే ముందే అనుకున్నాస్మండీ! కానీ..." అంటూ నాలికకర్చుకొని "కరెక్ట్! కరెక్ట్" అంటారు. ప్రపంచంలో అనేక సంగతులు ఇలా నిర్ధారించాక కానీ మనం నమ్మడం లేదు. శ్రీకృష్ణుడు, ఆయన నిర్మించిన ద్వారకానగరం అన్నీ యదార్థాలే. ఈ ద్వారకా నగరం నేడు సాగర గర్భంలో ఇప్పటికీ ఉందని కనుగొన్నారు కూడా. ఈ ద్వారక నగరం గురించిన కొన్ని సంగతులు టూకీగా తెలుసుకొందాం. అపుడు తప్పకుండా నమ్మాల్సిందేనండోయ్ అంటారు మీరు.

తాము ఉంటున్న మధుర నగరంపై ఎప్పటికైనా జరాసంధుడు, కాలయవ్వనుడూ దాడి చేసే ప్రమాదం ఉందని, ద్వారకానగరం

**డా॥ సాయి అయితిక**

పేరున సముద్రతీరంలో కొత్తగా ఒక శత్రు దుర్భేధ్యమైన నగరాన్ని నిర్మించుకొని పాలించడం మంచి దని గుర్తించిన శ్రీకృష్ణుడు సముద్రుడ్ని కోరిన పిమ్మట సముద్రుడు కొంత స్థలాన్ని శ్రీకృష్ణుడికి ఇచ్చినట్టు, మయుడ్ని పిలిచి 'ద్వారక' నగరాన్ని నిర్మింపచేసినట్టు పురాణ కథనం. 12 యోజనాల భూమిలో నిర్మించిన ఈ

ద్వారక నగరంలో త్రవ్వకాల్లో దొరికిన భిన్నమైన విష్ణుమూర్తి విగ్రహం



నాటి కంచుగంట



కోట బురుజు

ద్వారకానగరాన్నే 'ద్వారవతి', 'ద్వారమతి', 'కుశస్థలి' అని కూడా పిలిచేవారు. ఎంతో వైభవం గల ఈ నగరం అప్పటికే వ్యాపా రవాణిజ్యాలకి పెట్టింది పేరు. శ్రీకృష్ణుడు తన అవతారాన్ని చాలించిన రోజే ఈ ద్వారకా నగరం సాగరగర్భంలో కలిసిపోయిందని విష్ణు పురాణం చెబుతోంది. నేడు ఇది 'సత్యం' అని శాస్త్రజ్ఞులు, పరిశోధకులూ అంటున్నారు.

వాసుదేవుడు ఉండినట్టు క్రీ.పూ. 4వ శతాబ్దంలో చంద్రగుప్త మౌర్యుని కాలం లో మెగస్తనీస్ అనే గ్రీకు రాయబారి తొలిసారిగా ప్రస్తావించాడు. క్రీ.పూ. 2వ శతాబ్దానికి చెందిన అగథోకిల్స్ అనే గ్రీకు మహారాజు భాగవతపథాన్ని అంటి పెట్టుకొని పరిపాలన చేసాడు. ఆఫ్ఘని స్థాన్‌లో ఆమధ్య అల్– ఖనురమ్ అనేక చోట్ల జరిపిన తవ్వకాల్లో ఈ రాజు కాలం నాటి నాణాలు దొరికాయి. వాటి కి ఇరువైపులా శ్రీకృష్ణ, బలరాముల బొమ్మలుం డడం విశేషం.

నిజానికి సాగర గర్భంలో నేటికీ నిల్చిఉన్న ద్వారక నగరం గురించి 1980 దశకంలోనే తొలిసారిగా అనేక విశేషాలు వెలుగులోకి వచ్చాయి. అయితే భారతీయుల్లో ఎలాంటి ఉత్సుకతా వెల్లడికాలేదు. 1983 నుంచి నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఓషనోగ్రఫీ సంస్థకి



అలనాటి రాతి లంగరు

ద్వారకా నగర కోట గోడ

చెందిన మెరైన్ ఆర్కియాలజీ విభాగం ఈ పరిశోధనలకు నడుం కట్టింది. 1988లో తమ పరిశోధనల ఫలితాలను ప్రచురించింది. ఈ పరిశోధనల వెనక డా॥ ఎస్.ఆర్. రావ్, తదితర శాస్త్రజ్ఞుల, పరిశోధకుల కృషి ఎంతో ఉంది. 1990 దాకా జరిగిన పరిశోధనల్లో ఆసక్తికరమైన విషయాలు వెల్లడయ్యాయి.

ద్వారకా నగరం - బంగారు నగరం అని విష్ణుపురాణం, స్కాంధపురాణం, మహాభారతం వంటి గ్రంథాలే కాక హరివంశం వంటి రచనల్లో కూడా పేర్కొనడం జరిగింది. ద్వారక నిజంగా బంగారు నగరమే కావచ్చున్నది పరిశోధకుల భావన, నమ్మకం కూడా. ఈ ద్వారకా నగరపు అతిపటిష్టమైన రాతిగోడను కనుగొన్నారు మన పరిశోధకులు. ఈ గోడ 2.5 మీటర్ల మందంలో ఉంది. వీరు 1.5 మీటర్ల ఎత్తు గోడను కొలిచారు. ఈ గోడ కనీసం 3 మీటర్ల ఎత్తు ఉండవచ్చున్నది వీరి నమ్మకం. ఆ కాలంలో వ్యాపారవాణిజ్యాలు ఎంతో అద్భుతంగా జరిగాయని, నాటి ఓడరేవు ఎలా ఉండేదో చిత్రకారుల ఊహా చిత్రాలూ



నాటి ఓడరేవు - చిత్రకారుని ఊహాచిత్రం

మనకు అందుబాటులోకి వచ్చాయి. ఆనాటి ద్వారకా నగరం రేఖాచిత్రం, ఓడరేవు ఊహా చిత్రం, ఆనాటి ద్వారకా నగరపురాతి గోడ, గంట, లంగరు – ఛాయా చిత్రాలు ఈ పేజీల్లో చూడండి. ద్వారక నగరం సాగరంలో దాదాపు 40 అడుగుల లోతుల్లోకి వెళ్ళిపోవడం పెద్ద వింతకాకపోవచ్చేమో కాని, ఆ నగరం గురించిన విశేషాలు, అవశేషాలూ ఎంతో ఆసక్తిని రేకెత్తిస్తున్నాయి. శ్రీకృష్ణుడు, ద్వారక, మహాభారతం – ఇవన్నీ సత్యాలే. ద్వారక నగరం క్రీ.పూ. 17వ శతాబ్దం నాటిదనేది నిర్ధారించడం, అది మహాభారతంలో వర్ణించిన ద్వారక కావడం – మన దేశం ఎంత గొప్పదో నిరూపిస్తోంది. ఆధ్యాత్మికతకు ఆదిమూలం మన దేశం అని చెప్పకనే చెబుతోంది. రాబోయే కాలంలో గుజరాత్ తీరంలో సాగరగర్భంలోని ద్వారక నగరి ఒక మ్యూజియంలా తయారయి, పర్యాటకులను, పరిశోధకులనూ ఆకట్టుకొంటుందనటంలో ఆశ్చర్యమేమీ లేదు. ●




ముంపుకు గురియైన ఓడరేవు మ్యాపు



నేటి ద్వారకాధీశ దేవాలయం



మ్యాపులో ద్వారక

అర్ధరాత్రి 12 గంటలకు 10 నిమిషాలే తక్కువ. ఊరంతా గాఢ నిద్రలో ఆదమరచి ప్రశాంతంగా ఉంది. కీచురాళ్ళరొద. ఎక్కడో కుక్కల అరుపులు, చల్లనిగాలుల అలలు ప్రకృతి నిండా ప్రతిధ్వనిస్తున్నాయి. సుప్రజకు ఎంతసేపటికీ నిద్రరావడంలేదు. నిరీక్షణలోనే నిమిషాలు గంటలుగా మారిపోతున్నాయి. ఒంటరితనం ఓ శాపంగా తోస్తోంది. ఆ నిర్మల నిశ్శబ్ధ ప్రశాంత వాతావరణాన్ని చీలుస్తూ గోడగడియారం టిక్, టిక్ మంటూ చేసే శబ్దం తన గుండెలపై కొడుతూ బాధిస్తున్నట్లుంది. ఛీ... ఇక లాభం లేదు. ఈ మనిషి ఇక రాడు... చీటి



కీ మాటికీ చిన్న చిన్న విషయాలకు పోట్లాడి కోపంతో ఇలా వెళ్తే ఏం లాభం? అయినా నూతన దాంపత్యంలో ఇవన్నీ పరిపాటే అని అమ్మమ్మ చెప్పింది. తను మగాడు కాబట్టి అలా హాయిగా వెళ్ళగలిగాడు. మరి నేనెక్కడికి వెళ్లగలను? ఛీ... ఈ మగా ళ్ళంతా ఇంతే... అంతవరకూ తనొస్తాడు... బుజ్జగిస్తాడు... ఓదార్చి, లాలించి, బుజ్జగించి ఒళ్ళో చేర్చుకొంటాడు... అని ఆశగా ఎదురుచూసిన సుప్రజ నిరాశ, నిస్పృహ, నిరుత్సాహంతో నీరుగారుతూ బెడ్ రూమ్‌లోకెళ్ళి మంచంపై వాలిపోయింది.

కిటికీ తెరిచి బైటికి చూస్తే పుచ్చపువ్వులా విచ్చిన చల్లని తెల్లని వెన్నెల్లో విరిసిన పొగడ పారిజాత రాతికరాణిసుమాల వాసనలు గుప్పుమంటూ వచ్చి ముక్కు పుటాలను అదరగొడుతూ మనసును మత్తులో ముంచెత్తి మరో లోకాల్లో విహరింపజేస్తున్నాయి. దూరంగా చూస్తే పెద్ద పెద్ద వేప, చింత, రావి, మట్టి చెట్లు జడలు విరబోసుకొన్న కొరివి దెయ్యాలా కనిపిస్తున్నాయి. అసలే ఒంటరితనమంటేనే భయం... అందులో అర్ధరాత్రి... అనుకోగానే మనసు పొరల్లోని అంతరాంతరాలలో ఎక్కడో ఏదో తెలియని భయం... కంటి మీద కునుకు రావడం లేదు. ఒకవేళ అతను రాకపోతే? ఈ రాత్రి శివరాత్రే, పక్కవాటా వాళ్ళు ఆదమరచి హాయిగా నిద్రపోతున్నారు. మనస్సు నిండా ఏవేవో అడ్డమైన ఆలోచనలు... "మానస సంచరరే... అన్నట్లుగా మనస్సె క్కడెక్కడో తిరిగొస్తోంది. ఏవేవో ఊహలతో మనస్సు కీడుని శంకిస్తోంది. కోపం, ద్వేషం, పగ, కసి, చికాకు, చీదరింపు, అసహ్యం, అసహనం... అతనొస్తే మాట్లాడవద్దు... పోట్లాడాలి... రోజులు, నెలలు, కాదు... కాదు... సంవత్సరాల తరబడి మౌనపోరాటమే.

అంతలోనే ఎవరో తలుపు తట్టిన శబ్దం. టక్...టక్...టక్... ఉలిక్కిపడిన సుప్రజ ఆనందంగా, ఆత్రంగా వెళ్ళి గట్టిగా ఎవరు? ఎవరు? అంది. మౌనమే రాజ్యమేలింది తప్ప మనిషి అలికిడి, ఆచూకి కనబడలేదు. పైకి చూస్తే ఆకాశంలో చందమామ మబ్బుల మాటు నుంచి మందహాసం చేస్తూ మబ్బులతో దోబూచులాడుతూపరుగులు పెడుతున్నాడు. కిందంతా చెట్ల నీడలు, మసక చీకటి. సుప్రజ గుండె వేగంగా కొట్టుకొంటోంది. శిశిరం కావడం చేత రివ్వున వీచేగాలికి, ఎండిన చెట్ల ఆకులు టప్, టప్ అంటూ క్రింద రాలిపడుతున్న శబ్దం. శరీరమంతా చెమటపట్టి ఆపాదమస్తకం వణుకు ప్రారంభమయింది. తలుపులన్నీ బంధించి, అమ్మా నాన్నలను, అన్నయ్యనూ గుర్తు చేసుకొంటూ అంజనేయదండకం మననం చేసుకొంటూ ముడుచుకు పడుకుంది.

ఆమె శ్వాస ఆమెకే భయాన్ని గొల్పుతూ ఉంది. ఆ నిశ్శబ్దంలో ధబేల్‌మనే పెద్ద శబ్దం. సుప్రజ పైప్రాణాలు పైనే పోయాయి. కొద్దిగా ముసుగు తొలగించి చూసింది. తనను ఇలా చేసి వెళ్ళిన అతనిపై అమితమైన కోపం... కళ్ళముందుంటే కత్తితో కస్సునపొడిచి చంపెయ్యాలన్నంత కసి... అంతలోనే వంట గదిలో పాలు త్రాగేసిన పిల్ల మ్యావ్...మ్యావ్... అంటూ కళ్లు మిటకరిస్తూ సుప్రజవైపు కొంటెగా చూసి కిటికీలో నుంచి దూకివెళ్ళిపోయింది. సుప్రజకు ఏడుపొక్కటే తక్కువ. అంతలోనే ఓ బొద్దింక రయ్‌మంటూ ఎగిరి సుప్రజ మీదకి వచ్చింది. కెవ్వుమంటూ రెండు కళ్లూ మూసుకొని ముందు గదిలో కురికుంది. మళ్ళీ తలుపు తట్టిన శబ్దం...

. ఎవరు? ఎవరు? నన్నెందుకిలా క్షణక్షణానికీ భయపెట్టి ఏడిపించి చంపుతున్నారు?

నేనే... సుప్రజా...నేనే... నీకేమైంది? అంటున్న రాకేష్ మాటలకు తలుపు తెరుస్తూ అమితమైన ఆనందంతో సుడిగాలిగా దూసుకెళ్లి రాకేష్ ఒడిలో పువ్వులా వాలిపోయింది. ●

## ప్రవాహస్పర్శ (కవితా సంకలనం)

రచన: పోతగాని సత్యనారాయణ

**పుస్తక సమీక్ష**



వెల: రు. 30/-

ప్రతులకు: ప్రజాశక్తి బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలలో

ఈ సంకలనంలో 38 కవితలున్నాయి. ఇవన్నీ జీవనగానాలే!

అమ్మ పోసిన జీవన తీర్థమే, అనుభవాల అక్షరనాదమే, కవి'పోతగాని'కి ఆత్మస్పర్శతో భావలహరిని ప్రసాదించింది. 'ప్రవాహ స్పర్శ' శీర్షిక ఎంపికలో కూడా ప్రత్యేకత ఉంది. సమకాలీన ప్రపంచ దృశ్యమాలికను ఈ కవితలోని ప చిత్రాలలో కవి సమర్థవంతంగా ప్రదర్శించాడు. మరిచిపోతున్న పల్లెజ్ఞాపకాలను మళ్లీ తట్టిలేపి, మన చుట్టూ ఉన్న సమస్యల్ని తన భాషలో నిజాయితీగా విప్పిచెప్పి, వేడి వేడిగా, వాడి వాడిగా, కారంకారంగా - ౧రశి ఆసక్తికరంగా, పాఠకులకు రుచికరంగా అందించిన మంచి కపితలు - మనకి 'ప్రవాహ స్పర్శ'లో దర్శన మిస్తాయి.

కవి పోతగానికి కవితా వస్తువులకి కొదువలేదు. వ్యక్తీకరణలో స్పష్టత ఉంది. ఆయన కలం నుంచి మరికొన్ని మంచి సంకల నాలు రాగలవనే నమ్మకాన్ని కలిగిస్తుంది ప్రవాహస్పర్శ.

---

## రన్నింగ్ కామెంట్రీ

చిరునవ్వుల హరివిల్లు (కార్టూన్లు)

రచన: ఏ.వి.యమ్.



వెల: రు. 60/-

ప్రతులకు - విశాలాంధ్ర బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు

మనిషి నవ్వులకు ఎంత దూరమౌతున్నాడో రోగాలకి అంత దగ్గరవుతున్నాడు. వర్తమాన ప్రపంచంలో ప్రతి మనిషీ సమస్యల వలయంలో కొట్టుమిట్టాడుతున్నాడు. బి.పి.లు, షుగర్‌లు, వాటి ద్వారా సంక్రమించే మరెన్నో వ్యాధులతో సతమతమవుతూ ఇష్టం లేకపోయినా మూడు పూటలా మందుబిళ్లలు మింగుతూ (మింగని రోజున రోగంతో బాధపడుతూ) బలవంతంగా విధుల్ని నిర్వహిస్తున్నాడు.

మనిషి నవ్విన సందర్భాల కన్నా, ఏడిచే (అసూయతో కూడా) సందర్భాలే ఎక్కువ. ఇన్నిరకాల సమస్యలకి మందులేని వైద్యం ఏదైనా ఉందంటే అది హాస్యమే! 'రన్నింగ్ కామెంట్రీ'లో హాస్యం పుష్కలంగా ఉంది.

ఏ.వి.యమ్. సీనియర్ కార్టూనిస్ట్‌గా తన ప్రతిభను బహుముఖాలుగా ప్రదర్శించారు. వీరి వస్తువుల్లో వైవిధ్యమే కాదు... విలక్షణత కూడా ఉంది. కొన్ని బొమ్మల్లోని గీతలు సుపరిచయంగా అనిపిస్తాయి. బహుశా గతంలో ఏదో ఒక పత్రికలో వీటిని చూసి ఉండటమే కారణం కావొచ్చు. కానీ మళ్ళీ మళ్లీ చూసి, చదివించగల సత్తా ఏ.వి.యమ్. గారి కార్టూన్లలో ఉంది. ప్రతి ఇంట్లో ఉండదగ్గ నవ్వుల టానిక్కు ఇది. మనసేకాదు, ఆరోగ్యం బాగా లేనప్పుడు కూడా ఈ పుస్తకాన్ని విసుగులేకుండా ఎన్నిసార్లైనా తిరగెయ్యవచ్చు.

**చాతురి**

LPSA(01T7)101



GREEN CITY PROJECTS






# Prime Plots for Sale

## at Nagaram, Maheswaram Mandal Near Shamshabad Airport & Fab City







**A Brand New City Adding to Twin Cities!**

Hyderabad is growing by leaps and bounds. Opportunities are striking on a global scale at this chosen place. A medley of super heavyweight industries coupled with the India's biggest airport at Shamshabad is adding another full fledged city to twin cities. Shamshabad is to be the Technology Hub of Hyderabad, nay, to the nation. You have to be told to believe it. That a succession of development will sweep off your feet.

Grab a life time offer while you can, and strike it rich. And that's NOW !




**PROJECT HIGHLIGHTS**

Black top roads of 50', 60', 40' and 33'.

Beautifully Landscaped Environment

Avenue Plantation

Overhead Water Tank

Drinking water & Rain Water Harvesting System

Children Park & Tennis Court

Complete fencing with Security

Under Ground Drainage and Sewage System

Farm House with Swimming Pool

Grand Entrance Archway

**GREEN CITY PROJECTS**

Admn. Off : 6-3-569/1/1/2/2,
Opp. RTA Office, Rock Dale Compound,
Somajiguda, Hyderabad - 500 082.

www.hitha.com

For Bookings/Enquiry please contact :

BC **Phone : 55577782/83, 23323564, 23323501**

**Mobile : 98660 88811, 99499 21111**

**www.greencityprojects.com**



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | LPSA101M101 |
| పుస్తకం పేరు | కథావేళ |
| తారీఖు | 14 March 2025 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 101 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 1, 2 |
| తయారు చేసినది | P. Jayamma |
| పేజీలు విడదీసినది | P. Jayamma |
| స్కాన్ చేసినది | Saraswathi |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |